# కించిత్ భోగో భవిష్యతి?



## వేమూరి వెంకటేశ్వరరావు కథలు

# విషయ సూచిక

# తొలిపలుకు

ఈ పుస్తకంలో కనిపించే కథలలో మొదటి పదింటిని వంగూరి ఫౌండేషన్ వారు ఇదే పేరుతో 1997 లో ప్రచురించేరు. దానికి శ్రీ బాపు లోపల, అట్టమీద బొమ్మలు వేసేరు. అప్పుడు అచ్చు కొట్టించిన 400 ప్రతులు ఖర్చు అయిపోయాయి. అందుకని ఆ పుస్తకాన్ని ఇ–పుస్తకంగా ఇప్పుడు మళ్లా ప్రచురించడానికి పూనుకున్నాను. ఈ రెండవ విడతలో, వైవిధ్యత కొరకు, మరో మూడు కథలు, ఒక వ్యాసం చేర్చేను. ఈ నాలుగింటికి బాపు బొమ్మలు లేవు.

ఈ కథలలో ఎనిమిది కథలు వైద్య పరమైన కథలు. వీటిల్లో 'పంటి కింద పోక చెక్క' ఆంధ్ర ప్రభ లో పడ్డప్పుడు కొన్ని నెలలపాటు పాఠకుల నుండి అనూహ్యమైన స్పందన వచ్చింది. మిగిలినవాటిలో మూడు – ఆర్జవజీవులు, దొమ్మి, దంతోదంతం – "ఎమర్జెన్సీ వార్డు కథలు" అన్న మకుటం కింద రచన మాసపత్రికలో వచ్చి బాగా ఆదరణ పొందేయి. తరువాత అయిదు కథలు – కించిత్ భోగో భవిష్యతి, బ్రహ్మాండం బద్దలయింది, భూతద్దాలు, గాలి దోషం, కాకతాళీయం – పక్కా సైన్సు ఫిక్షన్ (వైకల్పన) కథలు.

పాత పది కథలతోపాటు ఈ సంకలనంలో మరో రెండు కొత్త కథలు చేర్చేను: నిజంగా జరిగిన సంఘటనలు, వాటికి జరిగిన వైద్యం ఆధారంగా చేసుకుని, కథాగమనం కోసం కాసింత కల్పన జోడించి, రాసిన కథ ఒకటైతే, వైకల్పన మరొకటి. ఈ సంకలనంలో చివర చేర్చిన రెండింటిలో ఒకటి ఒక సైన్సు వ్యాసం, మరొకటి తెలుగులో రాసేటప్పుడు ఎదురయే ఇబ్బందులని గురించి రాసిన వ్యాసం.

వేమూరి వేంకటేశ్వరరావు

ప్లెజెంటన్, కేలిఫోర్నియా, 2015

# పంటికింద పోకచెక్క

1

కొమ్ములు తిరిగిన వైద్యులకి కూడ అంతు పట్టని జబ్బులని ఒక హోమియోపతీ వైద్యుడు కుదర్చగలడని ఎవ్వరైనా గప్పాలు కొడితే ఎవరు మాత్రం ఎలా నమ్మగలరు? అందులోనూ విశ్వవిద్యాలయంలో పి. ఎచ్. డి. పట్టా పుచ్చుకున్న నేనా?

2

ఘోసాసుపత్రికి ఎదురుగా ఉన్న వీధిలోనే మా అత్తవారి ఇల్లు. రామేశం పంతులు గారి ఇల్లంటే ఆ ఊళ్లో తెలియనివారుండరు. గేటు తెరుచుకుని, వాకిలి నిండా ఉన్న అరటి చెట్లని దాటుకుని వెళితే పర్ణశాలలా చిన్న ఒంటిదూలం పెంకుటిల్లు కనిపించేది. ముందు వరండా. ఆ వరండాని ఆనుకుని ఉయ్యాలా గది. దానికొక పక్క పడక గది, రెండవ పక్క దేవుడి గది. ఆ దేవుడి గది గోడ మీంచి ఒక పంచపాళీ దింపి దాన్ని వంట గదిగా వాడుకునేవారు. ముందు వరండా మీద, పడకగదిని ఆనుకుని, చిన్న పీలికంత కొట్టుగది. ఆ కొట్లేనే మందుల పుస్తకాలు, మందుల పెట్లు ఉండేవి. అందుకని దానిని మందులకొట్టు అనేవారు. ఆ మందులకొట్టుకి బయట, వరండా మీద ఎత్తయిన పెద్ద బల్ల ఉండేది. కచేరీలో పనయి ఇంటికొచ్చిన తరువాత రామేశంగారు ఆ బల్ల మీదే కొలువు తీర్చేవారు. పెద్దనక, పిల్లనక, ఉన్న వాళ్లనక, లేని వాళ్లనక, ఊరు వాళ్లనక, పైఊరు వాళ్లనక, ఎప్పుడూ ఎవ్వరో ఒకరు పంతులుగారి సలహా కోసం ఎదురు చూస్తూ ఉండేవారు.

ఆ రోజు ఆదివారం. సంత పని చూసుకొని, మరీ పొద్దెక్కిపోకుండా నాలుగు మెతుకులు కతికి, అలవాటు ప్రకారం చుట్ట చుట్టిన పరుపుని ఆసరాగా పెట్టుకుని, కునుకు తీద్దామన్న ఉద్దేశంతో నడ్డి వాల్చి, రాత్రి అల్లుడు తెచ్చిన పుస్తకం చదవడం మొదలు పెట్టేరు రామేశం గారు. ఇంతలోనే వీధి

గుమ్మంలో కారు ఆగింది. కారు తలుపు తెరుచుకుని ఒకామె, ఆమె వెనకాతలే ఒక చిన్నమ్మాయి దిగేరు. పొరుగూరు నుండి పక్కనే ఉన్న ఘోషాసుపత్రికి ఎవ్వరో పేషెంట్లు వచ్చి ఉంటారని అనుకుని రామేశం గారు పుస్తకంలో దూర్చేసిన తలని పైకి తీయదలుచుకోలేదు. ఇంతలో ఇద్దరూ గేటు తెరచుకుని లోపలికి రావడం ఓరకంటితో గమనించిన రామేశం గారు

"అమ్మాయీ! ఎవరో వచ్చారు, చూడమ్మా." ఆని అనడమూ,

"రామేశం గారి ఇల్లు ఇదేనా?" అని ఆమె వాకబు చెయ్యడమూ ఒకేసారి జరిగేయి.

తండ్రి పిలుపుకి కూతురు బయటకి వచ్చి ఆగంతకులని పరకాయించి చూసింది. పెద్దామెకి ముప్ఫయ్ దాటి ఉండొచ్చు. ఆమె దేహకాంతిలో పాలమీగడలాంటి స్నిగ్ధత పాలు ఎక్కువ, దబ్బ పండును పోలిన పసిమి ఛాయ తక్కువ. దమ్మిడీ అంత బొట్టు, సింగారంగా చుట్టిన సిగ, చెవులకి రవ్వల దుద్దులు, సన్నటి శంఖం లాంటి పొడుగాటి మెడ, పువ్వుల వాయిల్ చీర, చేతిలో చేతిసంచి, కాళ్లకి చెంకీ చెప్పులు. పిల్లకి పదేళ్లు ఉంటాయేమో.

"ఎవరు కావాలండీ?"

"అమ్మా, రామేశం పంతులు గారు ఉన్నారా?"

"నేనేనండి, రామేశాన్ని" అని అంటూ రామేశం గారు బల్ల మీద లేచి కూర్చుని, పక్కనుక్క కాశీ తువ్వాలు తీసి భుజం మీద వేసుకుని, "ఎవరి తాలూకమ్మా?" అని అడిగేరు.

"నన్ను స్వరాజ్యలక్ష్మి అంటారండి. నారికేళవలస జమీందారు గారి తాలూకండి. మావారే వద్దామనుకున్నారు. కాని ఆయనకి వ్యాపకాలు ఎక్కువ."

"నారికేళవలస అంటే బరంపురం దగ్గర కదూ? జగన్మోహనరావు బహద్దరు గారి బంధువులా‐‐‐." అంటూ అర్ధ గర్భితంగా మాటని మధ్యలోనే ఆపేసి, "దయచేయండి" అంటూ ఆహ్వానించేరు.

ఈ కుశల ప్రశ్నలు ఇలా అవుతూ ఉండగా కూతురు వచ్చిన వారు కూర్చుందుకి వరండాలో చాప వేసి కూర్చోబెట్టి, సేద తీర్చుకుందికి చల్లటి మంచి నీళ్లు ఇచ్చి చెయ్యవలసిన కనీసపు మర్యాదలు చేసింది.

"మా సరోజకి వచ్చిన రోగం ఏమిటో తెలుసుకుందామని తిరగని ఊరు లేదండి. వైజాగు నుండి వెల్లూరు వరకు అన్ని ఊళ్లూ తిరిగేమండి."

చల్లకొచ్చి ముంత దాచడమెందుకని వచ్చిన పనేమిటో కుండ బద్దలు కొట్టినట్లు చెప్పింది స్వరాజ్యలక్ష్మి.

"పడిశం పడితే పల్సటిల్లా, దెబ్బ తగిలితే ఆర్నికా అంటూ ఇంట్లో పిల్లలకోసం నేర్చుకున్న పంచదార మాత్రల వైద్యం అమ్మా నాది. ఏదో ఆప్తులు అడిగితే కాదనలేక ఒక మాత్ర అడపా తడపా ఇచ్చేనేమో. మీరేదో నా మీద గౌరవం కొద్దీ వచ్చేరు. సంతోషం. ఇది నా తలకి మించిన పని. పోనీ, పిఠాపురం డాక్టరు గారికి చూపించలేకపోయేరా?"

"పిఠాపురం డాక్టర్లు, బెండపూడి యోగులు, పెందుర్తి భూతవైద్యులు,... అంతా అయేరండి. మేము చూడని స్పెషలిస్టు లేడండి. ఆఖరికి, యెలమంచిలిలో ఓరుగంటి సోమసుందరం గారు లేరండీ? వకీలు గారు. మీ కాళ్ల మీద పడమని సలహా ఇచ్చింది ఆయనే! మీరు కాదంటే వల్ల కాదు."

స్వరాజ్యలక్ష్మి ఇలా అంటూ ఉండగానే డ్రైవరు ఒక సజ్జ చేతితో పట్టుకుని వచ్చి యజమానురాలి కనుసన్న కోసం చూస్తూ వేచి ఉన్నాడు. సజ్జలో పళ్లు, వాటి మీద ప్లేస్టిక్ సంచిలో కంచి పట్టు చీర, రవికల గుడ్డ, పసుపు, కుంకం, తమలపాకులు, వక్కలు ఉన్నాయి. సజ్జని డ్రైవరు చేతిలోంచి అందుకుని, కొంగుతో చెయ్యి తుడుచుకుంటూ వంట గదిలోంచి బయటకి వచ్చి ఉయ్యాల గదిలో తలుపు చాటున నిలబడ్డ సీతమ్మ గారి చేతికి ఇచ్చి, వంగి, ఆవిడ పాదాలకి దండం పెట్టింది స్వరాజ్యలక్ష్మి.

"అమ్మా! మీరు ఒక్క మారు నా తరపున బాబుగారితో చెప్పి...."

ఈ తతంగం అంతా ఇలా జరుగుతూన్నంత సేపూ సరోజ ఉలుకూ పలుకూ లేకుండా, బెల్లం కొట్టిన రాయిలా, కదలకుండా, మెదలకుండా అలా వరండాలో ఒక కర్ర కుర్చీలో కూర్చొని ఉంది. విగ్రహం అంటే కుర్చీలో ఉంది కాని దృష్టి మాత్రం ఎక్కడో ఉంది. రామేశం గారు పిల్లని ఓరకంటితో చూస్తూనే ఉన్నారు.

సీతమ్మ గారు సజ్జని అందుకుని ఏవో క్షేమ సమాచారపు ప్రశ్నలు రెండు వేసి,

"ఎండకి బాగా అలసిపోయినట్లు ఉన్నారు. కాస్త ఫలహారం ఏదైనా చేసి పట్టుకు వస్తాను" అని లోపలికి వెళుతూ, "ఆ పంకా పట్టుకొచ్చి ఇక్కడ పెట్టమ్మా" అని కూతురుకి పురమాయించించేరు.

"ఎంత ఎండా కాలంలో అయినా ఉదకమండలంలా ఉండే మన వరండాలో ఫేను ఎందుకమ్మా, ఆ పెరటి తలుపు తెరిస్తే గాలి రివ్వున వస్తుంది," అంటూ రామేశం గారు అతిథిని ఉద్దేశించి మళ్లా అందుకున్నారు.

"చూడండమ్మా. ఎండవేళప్పుడు వచ్చేరు. ఒక గంట అయినా ఇక్కడ కూర్చుని సేద తీర్చుకోకుండా ఎలాగూ మా ఆవిడ మిమ్మల్ని తిరిగి  వెళ్లనివ్వదు. ఈ లోగా నాలుగు ప్రశ్నలు అడుగుతాను. మీకు చేతనయినంత మేరకి సమాధానాలు ఇవ్వండి. నాకు చేతనయిన సలహా ఇస్తాను," అంటూ స్వరాజ్యలక్ష్మి సమాధానం కోసం ఆగకుండా,

"పిల్ల చూడ్డానికి చాల అర్భకంగా కనిపిస్తోంది. పుట్టినప్పటినుండి ఇలానే ఉందా లేక ఈ మధ్య ఏదయినా సుస్తీ చేసిందా?"

ఈ ప్రశ్నకి తల్లి సమాధానం చెప్పేలోగా సరోజ గొంతుకలోంచి ఒక విచిత్రమైన శబ్దం వచ్చింది. గదిలో పిల్లిని బంధించి తలుపుకు గొళ్లెం పెడితే ఆ పిల్లి పెట్టే కూతలా ఉందా శబ్దం.

"ఛప్, సరూ! ఆ శబ్దం చెయ్యొద్దని ఎన్ని సార్లు చెప్పేను. పెద్దవాళ్ల ఎదుట అలా ప్రవర్తించవచ్చా?"

తల్లి గదమాయింపుకి ప్రతిస్పందనా అన్నట్లు సరోజ ఆ చప్పుడు చెయ్యడం ఆపేసింది. కాని సరోజ దృష్టి మాత్రం ఎక్కడో ఉన్నట్లు ఉంది.

"సరోజ సాధారణంగా చాల బుద్ధిమంతురాలు. ఆ మాయదారి రోగం ప్రకోపించినప్పుడల్లా ఇలా వింతగా ప్రవర్తిస్తూ ఉంటుంది. నేను వర్ణించి చెబితే ఎవ్వరూ నమ్మడం లేదు. మీరు చూస్తున్నారు కదా. ఇదీ ఈ పిల్లకి వచ్చిన మాయదారి రోగం."

రామేశం గారు పిల్లని అలా పరికించి చూస్తూనే ఉన్నారు. ఆ పిల్ల లోకమే వేరు.

"వెల్లూరులో కాని, వైజాగులో కాని పిల్ల 'ఆటిస్టిక్' అని ఎవ్వరైనా చెప్పేరా?"

స్వరాజ్యలక్ష్మికి ఆ 'ఆటిస్టిక్' అన్న మాట అర్థం అయినట్లు లేదు.

రామేశం గారు ఈ విషయం పసికట్టి, "ఆటిజం అంటే తన చుట్టూ ఉన్న ప్రపంచంతో నిమిత్తం లేనట్లు ప్రవర్తించే ఒక రకం లక్షణ సముదాయం. ఇది ఒకొక్కరిలో ఒకొక్క విధంగా అభివ్యక్తం అవుతుంది."

"లేదండి. ఈ రోజంటే ఇలా ఉంది కాని సాధారణంగా బాగా కలుపుగోలుగా ఉండే పిల్లండి. ఈ మాయదారి రోగం విజృంభించినప్పుడు మాత్రం దయ్యం పట్టిన పిల్లలా ప్రవర్తిస్తుంది."

"ఎంత తరచుగా వస్తూ ఉంటుందీ విజృంభణ?"

"ఏటికి ఒక సారో రెండు సార్లో వస్తుందీ పిశాచం. వచ్చినప్పుడు ఇలా ఉంటుంది. లేనప్పుడు చిలకలా ఉంటుంది. ఎప్పుడు వస్తుందో తెలియదు. అదృష్టం బాగుండి ఈ రోజు మీరు చూస్తూండగా వచ్చింది. మేము రాయవెల్లూరు వెళ్లినప్పుడు ఆసుపత్రిలో నెల్లాళ్లు మకాం వేసేం. పిల్ల చిలకలా ఉంది. డాక్టర్లు చూస్తూ ఉండగా ఒక్క సారి రోగం విజృంభించేలా చెయ్యి నాయనా అని ఆ వేంకటరమణమూర్తికి మొక్కుకున్నాను కూడా. లేని పోని రోగాలని పిల్లకి ఆపాదించే పిచ్చిదానిలా నన్ను జమకడతారో ఏమో అని భయపడ్డాను. పోనీలెండి. ఇప్పటికయినా ఆ దేవుడికి దయ కలిగింది."

ఇది వచ్చినప్పుడు ఎంత సేపు ఉంటుంది?" ఈ జబ్బు ఇదమిత్థంగా 'ఇదీ' అని తేలలేదు కనుక, దాన్ని ఏ పేరు పెట్టి పిలవాలో తెలియక రామేశం గారు 'ఇది' అనేసి ఊరుకున్నారు.

"వచ్చినప్పుడల్లా రోజో, రెండ్రోజులో, వారమో, రెండు వారాలో ఉంటుంది. ఎప్పుడొస్తుందో తెలియదు. ఎన్నాళ్లుంటుందో తెలియదు."

"ఇది మూర్చ రోగమని ఎవ్వరైనా నిర్ధారణ చేసేరా?"

"మెడ్రాసులో డాక్టర్లకి చూపించేమండి. బుర్రకి తీగలు తగిలించి మెదడులో నాడీ తరంగాలని పరీక్షించి చూసేరండి. రక్తపు పరీక్ష అన్న మిషతో చిట్టితల్లి చేతులనిండా, కనీసం పది సార్లయినా, తూట్లు పెట్టేసేరండి. ఇప్పుడు మీరే చూస్తున్నారు కదా! ఇది నా బుర్రకి పట్టిన రోగమా? లేక, నా చిట్టితల్లికి పట్టిన దయ్యమా?"

"పరీక్షలేనా? లేక, ఎవ్వరైనా ఏదయినా మందు ఇచ్చేరా?"

"ఒక డాక్టరు మూర్చ రోగమని 'డైలేన్‌టిన్ సోడియం' ఇచ్చేరండి. కిందటి వారం వైజాగులో మరొక డాక్టరు 'టెగ్రిటాల్' వాడమన్నారండి. ఏ మందు వాడినా వీసమెత్తు గుణం కనిపించడం లేదండి. అసలీ వైద్యాల వల్ల లేని రోగాలు తెచ్చిపెట్టుకుంటూన్నామేమో అని భయంగా ఉంటోందండి."

రామేశం గారికి ఈ రోగం యొక్క ఆద్యంతాలు అర్థం కాలేదు.

"అమ్మాయికి మొట్టమొదటిసారి 'ఇది' వచ్చినప్పుడు వయస్సెంత?"

స్వరాజ్యలక్ష్మి మెల్లగా పూర్వ చరిత్ర చెప్పుకొచ్చింది.

"సరోజకి మూడేళ్ల వయస్సు వచ్చేవరకు ఏ రోగమూ, రొష్టూ లేకుండా చిలకలా ఉండేది. మూడేళ్లప్పుడు మెడ్రాసులో మావయ్య ఇంటికి వెళ్లింది. అక్కడ అరుగు మీదనుండి కింద పడి మోచెయ్యి

విరగ్గొట్టుకుంది. అప్పుడు ఆ చేతి మీద శస్త్రం చెయ్యవలసి వచ్చింది. ఆ సందర్భంలో మత్తు మందు వాడేరు. కోతి పుండు బ్రహ్మ రాక్షసి అయింది. సర్జరీ అయిన తరువాత పిల్లకి మరి మెలుకువ రాలేదు. పిల్ల కోమా లోకి వెళ్లిపోయింది. మత్తు మందు పడక మెదడు దెబ్బ తిందేమోనని అనుమానపడ్డారు. ఊళ్లో పెద్ద పెద్ద ఆసుపత్రులు ఉన్నాయి కనుక "సి.టి. స్కేను" తీసి చూడగలిగేరు. మెదడు బాగానే ఉందన్నారు. తరువాత "ఏంటీబయటిక్కులు," "స్టీరాయిడ్లు" – ఇలా ఒకటేమిటి. డాక్టర్లు ప్రయత్నం చెయ్యని మందు లేదు. ఫలితం మాత్రం శూన్యం. పిల్ల చచ్చిపోయిందనే అనుకున్నాం. ఏదో గుడ్డిలో మెల్ల. బతికి బయట పడింది."

రామేశం గారు అంతా శ్రద్ధగా వింటున్నారు. మత్తు మందు లోంచి తేరుకుని వెంటనే బయట పడలేదు. అదొకటి. మత్తు మందు వాడిన తరువాతే సరోజకి ఈ వింత జబ్బు వచ్చింది. ఈ రెండింటికి ఏమిటి సంబంధం?

"పిల్ల అలా కోమాలో ఎన్నాళ్లు ఉంది?"

"రెండు వారాలండి. ఆ రెండు వారాలూ రెండు యుగాలులా గడిచేయండి. పిల్ల పక్కనే ఉండి జాగరం చేసేనండి. అక్కడ డాక్టర్లు వాళ్లకి తెలిసినంతవరకు పిల్లకి ఏ జబ్బూ లేదంటారండి! కాని కోమాలోకి ఎందుకు వెళ్లిపోయిందో, కోమా నుండి బయటకి ఎప్పుడు వస్తుందో చెప్పలేకపోయారండి.

"ఈ డాక్టర్ల మీద ఆధారపడి లాభం లేదని నేనే చొరవ చేసి అక్కడ ఉన్న గ్రంథాలయంలో ఉన్న పుస్తకాలెన్నో తిరగేసి చూసేనండి. గ్రీకు భాషలో 'కోమా' అంటే ఘాటైన నిద్ర అని అప్పుడు తెలిసింది. ఈ రకం ఘాటు నిద్రలో ఉన్న వారికి పక్కన బాంబులు వేసినా మెలుకువ రాదుట. సూదితో గుచ్చినా మెలుకువ రాదుట. అంత తీక్షణమైన నిద్రట. కోమాలో పడ్డవారి జ్ఞానేంద్రియాలు మూసుకు పోయాయన్నమాట. మనవాళ్లు 'చెవులకి గెడలు పడిపోయాయి' అనే పదజాలాన్ని వాడుతూ ఉంటారు. అదేనేమో కోమా అంటే! ఏది ఏమయితేనేమి, కోమాలో పడ్డవాళ్లకి మళ్లా మెలుకువ వచ్చి మన లోకంలో పడాలంటే వాళ్లతో మనం మాట్లాడుతూ ఉండాలిట. శరీరాన్ని నిమురుతూ ఉండాలిట. అలా

కొన్నాళ్లు పోతే, మన అదృష్టం బాగుంటే, జ్ఞానేంద్రియాలకి పడ్డ మూతలు తెరుచుకునే అవకాశం ఉందిట. అందుకని సరోజ చేతులు నిమురుతూ, ఇష్టమైన పాటలు పాడుతూ, కబుర్లు చెబుతూ, పిల్లని ఒక్క క్షణం వదలకుండా పదిహేను రోజులు కాపలా కాసేను. నా నోములు ఫలించేయి. ఒక రోజు సరోజ అకస్మాత్తుగా లేచి, 'అమ్మా' అని పలకరించింది."

స్వరాజ్యలక్ష్మి ఇలా కథనం చెబుతూ ఉంటే సరోజ రామేశం గారు కూర్చున్న బల్ల దగ్గరకి వెళ్లి, బల్ల మీద బుగ్గ ఆనించి, విగ్రహంలా నిలబడింది.

రామేశం గారు పిల్లని ఎగా, దిగా చూసి, కాసింత కంగారు పడి, కర్తవ్యం తోచక పిల్ల చేతిని తన చేతిలోకి తీసుకుని నాడి చూడడం మొదలెట్టేరు.

"మరేమీ పరవా లేదండి. ఆ రోగం వచ్చినప్పుడల్లా ఈ ప్రవర్తన ఇలాగే ఉంటుందండి," అని స్వరాజ్యలక్ష్మి ధైర్యం చెప్పింది.

"ఈ మొదటి సంఘటన తరువాత పిల్ల మామూలుగా అయిపోయిందా?"

"ఏం మామూలండి. పక్షవాతం వచ్చినట్లు ముఖం కుడి పక్క అంతా వాచిపోయిందండి. ఆ వాతంతో జన్మంతా బాధ పడాల్సిందే అని డాక్టర్లు తీర్మానించి చెప్పేరండి. కాని, డాక్టర్లు చెప్పింది ఎప్పుడు నిజం అయిందండి? వారం రోజుల్లో వాతపు లక్షణాలు అన్నీ హరించుకుపోయాయండి. పూర్తిగా నయం అయిపోయిందనే అనుకున్నాను. కాని మళ్లా ఎప్పుడో ఆ రోగం కమ్ముకు వస్తుందండి. ఆ తరువాత ముఖానికి వాతం కమ్ముతుంది. తరువాత దానంట అదే సర్దుకుంటుంది."

రామేశం గారు బల్ల పక్క గూట్లో ఉన్న పలక, బలపం తీసుకుని, ఆ పలక మీద వరుసగా 'మత్తు మందు వాడిన తరువాత మొద్దు నిద్ర, ' 'ముఖానికి పదే పదే పక్షవాతం' అని రాసుకుంటూ,

"ఇప్పటికి ఈ రుగ్మత ఎన్ని సార్లు ఇలా విజృంభించి ఉంటుందంటారు?"

“ఏటికి రెండు, మూడు సార్లయినా వస్తూ ఉంటుందండి. ఇప్పటికి కనీసం పాతిక సార్లయినా వచ్చి ఉంటుందని నా అంచనా.”

“ఇంకేమయినా చెప్పగలరా? కొంచెం జ్ఞాపకం చేసుకోండి.”

స్వరాజ్యలక్ష్మి కొద్ది సేపు ఆలోచించి, తనకి తట్టినది చెప్పదగ్గ లక్షణమో కాదో అని తటపటాయించి, “ఇది వచ్చినప్పుడల్లా మాట ఖణిగా రాదండి.”

“మాట ఖణిగా రాదు” అని పలక మీద రాసుకున్నారు.

“నిద్ర లేమి కూడానండి. ఇది వచ్చినప్పుడల్లా రెండు, మూడేసి రోజులు అస్సలు నిద్రపోదండి. తను నిద్రపోకపోతే ఎక్కడ దెబ్బలు తగిలించుకుంటుందో అని నేను కూడా నిద్రపోకుండా పిల్లకి కాపలా కాస్తానండి.“

ఇప్పుడు రామేశం గారికి అర్థం అయింది, స్వరాజ్యలక్ష్మి ముఖం ఎందుకు అలా అలసిపోయినట్లు కనిపిస్తోందో. పలక మీద ‘నిద్ర లేమి’ అని రాసుకుంటూ,

“అమ్మా! ఆ బీరువాలో ఉన్న ఎర్ర బైండింగు ఉన్న పుస్తకం ఒక సారి ఇలా పట్టుకురా, తల్లీ” అంటూ కూతురికి పురమాయించేరు. ఆయన అలా రాసుకుంటూ ఉంటే ఎందుకో స్వరాజ్యలక్ష్మికి ధైర్యం పెరిగి మరొక విషయం జ్ఞాపకం తెచ్చుకుంది.

“అకస్మాత్తుగా రెండు, మూడు పర్యాయాలు ‘నొప్పి, నొప్పి’ అని బాధ పడిందండి. ఒక సారి గుండెల్లో నొప్పి వస్తే ‘హార్ట్ ఎటాక్’ అన్నారండి. చిన్న పిల్లకి హార్ట్ ఎటేక్ ఏమిటండి? మరొక సారి కడుపులో నొప్పి వస్తే ‘ఎపెండిసైటిస్’ అని చెప్పి ఆపరేషన్ చేస్తామన్నారండి. ఒక సారి ఆపరేషన్ చేయించి అనుభవిస్తున్నాం కదండి? అందుకని ఒప్పుకోలేదు. నొప్పి దానంటట అదే తగ్గిపోయిందండి.”

రామేశం గారు తన పలక మీద ఉన్న జాబితాని ఒక సారి తేరిపార చూసేరు.

“మత్తు మందు, మొద్దు నిద్ర, ముఖానికి పక్షవాతం, మాట నములుడు, నిద్రలేమి, నొప్పి.”

ఆయన కనుబొమ ముడి పడింది. ఈ లోగా కూతురు పుస్తకాన్ని ఆయనకి అందించింది.

ఆ పుస్తకంలో పుటలని కొంతసేపు ఇటూ అటూ తిరగేసి, తరువాత తను చదువుతూ చదువుతూ తలగడ కింద దాచిన అల్లుడు ఇచ్చిన పుస్తకాన్ని ఒకసారి సంప్రదించి, తల పైకైనా ఎత్తకుండా,

“జబ్బు చేసినప్పుడు పిల్ల మూత్రం రంగులో ఏదైనా మార్పు గమనించేరా?”

ఈ ప్రశ్న వినగానే స్వరాజ్యలక్ష్మి ముఖ కళవళికలలో వచ్చిన మార్పుని వర్ణించడం కష్టం; చూసి తీరాల్సిందే!

“ఏడేళ్ల బట్టి దేశం అంతా కాలు కాలిన పిల్లిలా తిరుగుతున్నానండి. బాబూ, మీరే ఈ ప్రశ్న వేసేరు. జబ్బు చేసినప్పుడల్లా పిల్ల మూత్రం పసుపు పచ్చగా కాకుండా, ముదర రంగులో పడుతుందండి. మీరు అడిగేవరకు ఈ జబ్బుకీ ఆ రంగుకీ సంబంధం ఉందనే అనుకోలేదండి.”

కూతురి జబ్బు అప్పుడే నయం అయిపోయినంత ఉత్సాహం ఆమె కంఠంలో ద్యోతకం అయింది.

“అమ్మా! మీ అమ్మాయిని అట్టి వేధిస్తూన్న జబ్బు ఏమిటో కొంచెం చూచాయగా ఆచూకీ దొరికింది. లక్షణాలని బట్టి ఇది ‘ఎక్యూట్ ఇంటర్మిటెంట్ పోర్ఫిరియా’ అన్న జబ్బులా అనిపిస్తోంది. నా అనుమానమే నిజం అయితే ఇది చాల అరుదుగా వచ్చే జబ్బు. ఈ జబ్బుని నేను కుదర్చగలనో లేనో చెప్పలేను.”

“బాబు గారూ! ఇంతవరకు పిల్లకి ఏ జబ్బూ లేదని దబాయించినవారే. అలా దబాయిస్తూనే మందులిచ్చినవాళ్లు కొందరు, ఆపరేషన్లు చేస్తామన్నవాళ్లు మరికొందరు. తమరు కుదర్చ గలిగినా లేకపోయినా పరవా లేదు. మా రాత ఎలా ఉంటే అలా జరుగుతుంది. కనీసం ఆ జబ్బు ఏమిటో నాకు అర్థం అయేటట్లు చెప్పండి” అని స్వరాజ్యలక్ష్మి ప్రాధేయపడింది.

ఈ లోగా సీతమ్మ గారు పళ్లెంలో ఫలహారం పెట్టి పట్టుకొచ్చి తినమని బలవంతం చెయ్యడంతో, మొహమాటపడుతూనే పుచ్చుకున్నారు.

'ఎక్యూట్ ఇంటర్మిటెంట్ పోర్ఫిరియా' అనేది వంశపారంపర్యంగా వచ్చే జబ్బని రామేశం గారికి తెలుసు. పిల్లకి ఈ జబ్బు వచ్చిందంటే దాని అంకురం తల్లిదండ్రులలో ఉండి తీరాలి. ఎటు నుండి వచ్చిందో తెలుసుకుందామని, ఆవిడ ఫలహారం చేస్తూన్నప్పుడే, రామేశం గారు కూపీ లాగడానికి ప్రయత్నం మొదలు పెట్టేరు.

"మీరు చూలింతరాలుగా ఉన్నప్పుడు మీ ఆరోగ్యం ఎలా ఉండేది?"

ఫలహారం చేస్తూన్న స్వరాజ్యలక్ష్మి కింది దవడ జారిపోయింది! ఆమె ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది. 'ఈయన ఆవలిస్తే పేగులు లెక్కపెట్టెస్తున్నాడు' అని లోలోపలే అనుకుని, పిల్ల మూత్రం రంగుకీ తను గర్భవతిగా ఉన్నప్పుడు తన ఆరోగ్యానికి మధ్య లంకె అర్థం కాక,

"బాబు గారూ! మీరు నా ముఖం చూసి నా జాతకం చెప్పేస్తున్నారు. నేను సరోజని మోస్తూనున్నాళ్లూ మంచం మీదనే ఉన్నాననుకోండి. రెండు సార్లు ఆసుపత్రిలో కూడ జేర్పించవలసి వచ్చింది. మొదటి సారి నెల తప్పేనని తెలిసిన కొద్ది రోజులకే నాకు విపరీతమైన కడుపు నొప్పి వచ్చింది. గర్భం నిలవదేమోనని కంగారు పడ్డారు. డాక్టర్లకి అర్థం కాక కడుపుని కోసి, లోపల చూసి, ఏమీ లేదని నిర్ధారించేరు. తరువాత నొప్పి ఎలా వచ్చిందో అలానే పోయింది."

"రెండవ సారి?"

"ఒక నెల్లాళ్లు పోయిన తరువాత, ఒకటే వాంతులు. వేవిళ్లు అనుకున్నాను. ఆసుపత్రిలో ఆరు వారాలు ఉన్నాను. శరీరం ఎండిపోతూ ఉంటే 'సేలీను' ఎక్కించి బతికించేరు."

సరోజకి వచ్చిన జబ్బేమిటో అదే జబ్బు తల్లికి కూడ ఉందని పంతులుగారికి అవగాహన అయిపోయింది. లక్షణాలు తేడా. మరికొంచెం తవ్వి చూడాలి.

"మీ వారి ఆరోగ్యం గురించి కొంచెం చెబుతారా?"

"ఆయన జన్మలో జిర్రున చీదెరగరు. వాళ్ల వాళ్లంతా ఆరోగ్యవంతులే."

"మీ పుట్టింటి వారి ఆరోగ్యం సంగతి ఏమి చెప్పగలరు?'

"మావాళ్లంతా ఎప్పుడూ ఏవో జాడ్యాలతో మూలుగులేనండి. మా అమ్మ బాగానే ఉండేదండి. వైద్యుడి దగ్గర దాపరికాలు కూడదంటారు కనుక చెబుతున్నాను. మా నాన్న అడపా తడపా మయికంతో ఇంటికి వచ్చేవాడండి. తాగుడేమోనని మొదట్లో అనుమానించేరు. కాని, ఆయనకి ఆల్కహాలు పొడ కిట్టదండి.

మా పెద్దత్తకి కూడ మూర్ఛ రోగం లాంటిదేదో ఉండేదండి........"

రామేశం గారు ఇంక ఆలశ్యం చెయ్యదలుచుకోలేదు.

"అమ్మా! ఇది వంశపారంపర్యంగా సంక్రమించే జబ్బని నా మనస్సు ఘోష పెడుతోంది. మీ తండ్రి గారు తాగినవాడిలా తూలుతూ కనిపించేరంటే అది కూడ ఈ రోగ లక్షణమే అని నా అనుమానం. మీరు చూలింతరాలుగా ఉన్నప్పుడు వచ్చిన కడుపు నొప్పి కూడ ఈ రోగ లక్షణమే అయి ఉంటుంది."

"ఈ జబ్బు నివురు కప్పిన నిప్పులా మా అందరిలోనూ ఉన్నా మేము మా జీవితాలని ఈడిచేస్తున్నాం కదా. మా సరోజ ఏం పాపం చేసుకుంది?"

"ఇది జన్యు రోగం అమ్మా. ఇది అందరిలోనూ ఒకేలా ప్రకోపించదు. సరోజలో ప్రకోపన ఎక్కువగా ఉంది. అది మీ దురదృష్టం."

"బాబు గారూ! మీరు చెప్పిన మాటలన్నీ అమృత వాక్కులులా ఉన్నాయి. మీ అమృత హస్తంతో మీరే మా సరోజ నోట్లో మూడు మాత్రలు వేసి ఇంత పుణ్యం కట్టుకొండి. మీకు రుణపడి ఉంటాను."

రామేశం గారి మస్తిష్కంలో ఒక నైతిక సమస్య ఎదురయింది. జన్యు రోగాలు మన జీవకణాలలో ఉన్న వారసవాహికలో ఉన్న లోపాల వల్ల వస్తాయి. ఈ వారసవాహికలు తల్లిదండ్రుల నుండి పిల్లలకి సంక్రమిస్తాయి. వీటిల్లోనే మన భవిష్యత్తు అంతా రాసి పెట్టి ఉంటుంది. కనుక జన్యు రోగాలని కుదర్చడం అంటే విధి వ్రాతని మార్చడం అన్నమాట. పైపెచ్చు ఈ జీవకణాలు శరీరం అంతటా ఉంటాయి. ఎన్నని మరమ్మత్తు చెయ్యగలం? ఈ రకం జబ్బులకి మందు లేదని చెప్పడమా? లేక, మందు వేస్తూన్నట్లు నటించి, రోగికి కొంచెం నమ్మకం కలిగించి, లక్షణాల ఉపశమనానికి పునాది వెయ్యడమా?

"అమ్మా! ఎక్యూట్ ఇంటర్‌మిటెంట్ పోర్ఫిరియా కి ఇంగ్లీషు వైద్యంలో ప్రస్తుతానికి మందు లేదు. హోమియోపతీలో ఫలానా జబ్బుకి ఫలానా మందంటూ ఎప్పుడూ లేదు. ఒక వ్యక్తిని సమగ్రంగా పరిశీలించి ఆ వ్యకి వ్యక్తిత్వానికి సరిపోయే మందు ఇస్తాం కాని రోగ లక్షణాలకి కాదు. కనుక నేను మందు ఇచ్చినా కుదురుతుందని ఆశపెట్టి ఇవ్వలేను. మందు వేసుకుని, నేను చెప్పిన పథ్యాన్ని తు. చ. తప్పకుండా పాటిస్తే కొంత ఉపశమనం కలగవచ్చు."

"చెప్పండి. ఎన్నో మందులు వాడి ఇంతవరకు కాలహరణం చేసేం. మీరిచ్చే మందు పని చేస్తుందని ఆశగా ఉంది.."

"మీరు మొట్టమొదట చెయ్యవలసిన పని ఆ ఇంగ్లీషు మందులు మానెయ్యడం. ఆ 'డైలేంటిన్ సోడియం,' ని ఆ 'టెగ్రిటాల్' ని చెత్త కుండిలో పారెయ్యండి. తరువాత పథ్యం. కర్బనోదకాలు ఎక్కువగా ఉన్న భోజనమే పెట్టండి. అంటే మాంసం, గుడ్లు, వగైరా మానేసి శాకాహారాలే పెట్టండి," అని చెప్పి, కూతురుని పిలచి, "అమ్మా! మన మందుల పెట్టెలో, కింద అరలో, మూడో వరసలో ఉంటుంది, 'సేక్‌లేక్ సిక్సెక్స్' సీసా ఇలా పట్టుకురా, తల్లీ" అని పురమాయించేరు.

కూతురు ముసుముసి నవ్వులు నవ్వుతూ పట్టుకొచ్చిన సీసా అందుకుని, స్వయంగా పరీక్షించి, చేతి చెమట తగిలితే మందు గుణం చెయ్యదని చెబుతూ, అందులోని మాత్రలు తిన్నగా సరోజ నోట్లో పడేటట్లు వేసి,

"అమ్మా! నెల్లాళ్లవరకు మరొక మోతాదు అక్కరలేదు. ఎందుకైనా మంచిది, వైజాగు వెళ్లి డాక్టరు సత్యనారాయణ గారికి కూడ ఒక సారి చూపించండి. ఉత్తరం రాసిస్తాను. రక్త పరీక్ష చేయించి నా నిర్ణయం సరి అయినదో కాదో ఆయన రూఢి పరిస్తే మీకూ ధైర్యంగా ఉంటుంది, నాకూ సంతృప్తిగా ఉంటుంది."

"బాబు గారూ, మీ మాట మీదే మాకు నమ్మకం. అయినా మీ మాట కాదనడం ఎందుకు. అలాగే రక్త పరీక్ష చేయిస్తాను. మరి తమ ఫీజు ఎంతో....." అంటూ స్వరాజ్యలక్ష్మి లేచి నిలబడింది.

"అమ్మా! ఇంతవరకు నేను ఎవ్వరినీ చిల్లి గవ్వ ఫీజు ఇమ్మని అడగలేదు. సంతోషంగా తమలపాకులు, అరటిపండు చేతిలో పెడితే నా కదే పది వేలు. అయినా అమ్మాయికి గుణం కనిపించాలి కదా. క్షేమంగా వెళ్లి లాభంగా తిరిగి రాండి. శలవ్!"

3

మావగారు వైద్యం చెసే వయినం అంతా పక్కనున్న పడక గదిలోని కిటికీ గుండా పరికిస్తూనే ఉన్నాను. స్వరాజ్యలక్ష్మి కారు చప్పుడు విన్న తరువాత వరండాలో మావగారి దగ్గరకి వచ్చేను.

"పెద్ద పెద్ద డాక్టర్లకి అంతు పట్టని విషయాన్ని మీరెలా పట్టగలిగేరండీ?"

"చూడు అల్లుడూ! ముందస్తుగా హోమియోపతీ వైద్యానికీ, ఎల్లోపతీ వైద్యానికి మధ్య తేడా చెప్పనీ. ఇంగ్లీషు డాక్టరు దగ్గరకి వెళితే నిన్ను రెండు, మూడు నిమిషాల కంటె ఎక్కువ సేపు చూడడు. చూడలేదు. ఎందుకంటే, వాళ్లకి ఎంత మంది పేషెంట్లని చూస్తే అంత డబ్బు. స్వరాజ్యలక్ష్మి కథ

వినడానికి నాకు గంటన్నర పైగా పట్టింది. ఈ సమయంలో ఆమె గురించి, వారి వంశం గురించి తెలుసుకోగలిగేను కనుకనే ఇది జన్యు రోగమని నిర్ధారించగలిగేను.

"ఎల్లోపతీ వైద్యులు రోగ లక్షణాలు వింటారు తప్ప రోగిని చూడరు. వాళ్ల దృష్టిలో ఈ శరీరం ఒక యంత్రం. రక్తం, మలం, మూత్రం, వగైరాలు అన్నీ పరీక్షిస్తారు తప్ప రోగిని మనిషిలా చూడరు. రోగి పది లక్షణాలు చెబితే పది మందులు రాసిస్తారు. రోగి సంసారం గురించి వాళ్లకి అక్కర లేదు. హోమియోపతీ వైద్యం దీనికి వ్యతిరేకం. మాకు రోగం కంటె రోగే ముఖ్యం. మనిషి, ఆ మనిషి ఆలోచనా సరళి, తత్వం, ఆ మనిషి అలవాట్లు, ఇంట్లోవాళ్ల అలవాట్లు – ఇవన్నీ మాకు కావాలి. రోగిని ఒక వ్యక్తిగా అర్థం చేసుకోవడం ప్రధాన అంశం. రోగ లక్షణాలు ద్వితీయాంశం.

"కలకత్తాలో మహేంద్రనాథ్ సర్కార్ అని పేరుపడ్డ హోమియో వైద్యుడు ఒకాయన ఉండేవాడు. ఆయన రోగి ముఖం చూసి, నడక తీరు చూసి, మనిషి వాటం చూసి, ఒక్క ప్రశ్న అయినా అడగకుండా మందు ఇచ్చి కుదిర్చేవాడుట. ఆ కథ మరొక సారి చెబుతా కాని......"కాలం, కర్మం కలిసి రావాలంటారు చూడు. అలాగ ఈ దినం నాకు కలిసి వచ్చిన రోజు. రోగం విజృంభించిన సమయంలో సరోజని పరీక్ష చేసే సదవకాశం నాకు ఒక్కడికే  దొరికింది. మిగిలిన వైద్యులంతా ఆమెని ఆరోగ్యంగా ఉన్న పరిస్థితిలోనే చూసేరు. నేను బరంపురంలో ఉద్యోగం చేసే రోజుల్లో నారికేళవలస జమీందారుగారి గురించి విన్న కథలు కొన్ని ఆధారాలు ఇచ్చేయి. ఆఖరికి నువ్వు నిన్న రాత్రి అనుకోకుండా రావడం కూడ ఒక విధంగా ఈ సమస్యని పరిష్కరించడానికి తోడ్పడిందనుకో!

"రాత్రి నువ్వు పట్టుకొచ్చిన పుస్తకంలో "బ్రిటిష్ రాజవంశంలో జబ్బులు" అనే శీర్షిక కింద ఒక వ్యాసం ఉంది.  బ్రిటిష్ రాజులలో మూడవ జార్జి ఒక వింతయిన జబ్బుతో బాధ పడేవాడట. సరోజకి వచ్చినట్లే లక్షణాలు అడపా, తడపా పొడచూపేవట. వణుకు, అపస్మారం, అర్థం కాని నొప్పి, నిద్రలేమి, మొదలయిన లక్షణాలు చూసి ఆనాటి వైద్యులు ఏమీ చెయ్యలేకపోయారుట. కాని వాళ్లు చేసిన మంచి పని ఏమిటంటే జార్జి ప్రభువు లక్షణాలు, ఆయనకి వారు చేసిన వైద్యం, అంతా పూసగుచ్చినట్లు

పుస్తకాలలో రాసి ఉంచేరుట. ఈ మధ్య, అంటే 1966 లో, ఇద్దరు బ్రిటిష్ డాక్టర్లు ఆ పుస్తకాల దుమ్ము దులిపి ఒక కొత్త సిద్ధాంతం లేవదీశారుట. ఆ సిద్ధాంతం ప్రకారం జార్జి ప్రభువు 'ఎక్యూట్ ఇంటర్మిటెంట్ పోర్ఫొరియా' తో బాధ పడ్డాడని తీర్మానించేరు. ఆ వ్యాసం నిన్న రాత్రే చదివేను. రెండూ, రెండూ కలిపేను. అంతే.

"ఈ జబ్బు ఇంగ్లండు మొదలయిన పాశ్చాత్య దేశాలలోనే ఉంది. తెల్ల వారి సంపర్కం వల్ల మన దేశంలో కూడ వ్యాపించిందని నా అనుమానం.

ఈ "పోర్ఫొరియా' అనేది రక్త సంబంధమైన అనేక జబ్బులకి ఉమ్మడిగా పెట్టే పేరుట. ఈ జబ్బు ఉన్నవారి శరీరం హిమోగ్లోబిన్ అనే ప్రాణ్యాన్ని సరిగ్గా తయారు చెయ్యలేదుట.

ఈ హిమోగ్లోబిన్ లో హీం లేదా రక్తచందురం అనే రంజన ద్రవ్యం, గ్లోబిన్ అనే ప్రాణ్యం ఉంటాయి. ఈ హీం రక్తానికి ఎరుపు రంగుని ఇస్తుంది.

" 'పోర్ఫొరియా' ఉన్న వారి శరీరంలో రక్తచందురానికి కావలసిన ఘటకద్రవ్యాలు అన్నీ తయారవుతాయి కాని అవి రక్తచందురం పొందవలసిన ఆకారం పొందకుండా మధ్యంతరంగా ఆ ప్రక్రియ ఆగిపోయి, ఆయా ముడి పదార్థాలు రక్తంలో అలా ఉండిపోతాయి. ఇలా ఆగిపోడానికి జన్యు పదార్థంలో లోపమే కారణం. దీనికి పర్యవసానంగా శరీరం పాలిపోవడం, నీరసించడమే కాకుండా, రక్తం విషపూరితం అవడం మొదలు పెడుతుంది. కొంతవరకు మూత్రపిండాలు ఈ విష పదార్థాన్ని వడగట్టి మూత్రం ద్వారా బయటికి తోడెస్తాయి. అందుకనే ఈ జబ్బు చేసిన వారి మూత్రం కోకాకోలా రంగులో ఉంటుందిట. రక్తంలో ఈ విష పదార్థాలు ఉన్నన్నాళ్లూ రకరకాలయిన దుర్గుణాలు కనిపిస్తాయిట. అవే నొప్పులు, తిప్పులు, వికారాలుగా మనకి ప్రస్ఫుటమవుతాయి. ఇదంతా నువ్వు రాత్రి పట్టుకొచ్చిన పుస్తకంలో చూసేనోయ్!

"అసలు సరోజకి పుట్టుకతోటే ఈ రోగం వచ్చింది. మెద్రాసులో చేతికి ఆపరేషను చేసినప్పుడు ఇచ్చిన మత్తు మందు పడి ఉండదు. పైపెచ్చు ఆ 'ట్రామా' నిద్రాణంగా ఉన్న జబ్బుని రెచ్చగొట్టి ఉంటుంది. ఈ రోజు జబ్బు ఉద్రేకించడానికి కారణం వారం రోజుల క్రితం వాడిన 'ఫీనోబార్బిటాల్' అని నా అనుమానం. అందుకనే 'టెగ్రిటాల్ వెంటనే మానెయ్యమని చెప్పేను."

"మావగారి ప్రజ్ఞా పాటవాలకి ముక్కు మీద వేలేసుకుంటున్నాను" అని చెప్పేను పక్కనున్న నా శ్రీమతితో.

"నారికేళవలసకీ ఈ జబ్బుకీ ఉన్న సంబంధం ఏమిటో నాకు బోధపడలేదు" అంది శ్రీమతి.

"నారికేళవలస జమీందారు ఒకాయన ఇంగ్లీష్ అమ్మాయిలతో జరిపిన కృష్ణలీలలు గురించి అడవి బాపిరాజు నారాయణరావు నవలలో ఒక చోట ప్రస్తావించేరు. బరంపురంలో ఉద్యోగం చేసిన వాడిని కనుక అదంతా కట్టుకథ కాదని నాకు తెలుసు," అంటూ రామేశం గారు మసాల అందించేరు.

"' 'ఇది జన్యు రోగం. దీనికి మందు లేదు' అని చెబుతూనే మీరు ఆ అమ్మాయికి ఏదో మందు ఇచ్చేరు. ఇది ధర్మమేనా?" అని నేను ప్లేటు ఫిరాయించేను, తెలుగు సాహిత్యం చదవనందుకు నన్ను నేనే నిందించుకుంటూ.

"నేను ఆ అమ్మాయి నోట్లో వేసినవి పంచదార మాత్రలోయ్! ఏదో మందు పుచ్చుకుంటున్నానన్న సంతృప్తి, ఆ మందు పని చేస్తుందన్న నమ్మకం లేకపోతే ఏ జబ్బూ నయమవదోయ్!"

"మరితే మందేదీ ఇవ్వనప్పుడు......."

"మందివ్వకపోవడమేమిటోయ్. వెర్రి కక్కగట్టలా ఉన్నావ్.  మాంసం ముట్టొద్దనీ, కర్బనోదకాలు తినమనీ చెప్పేను కాదోయ్.  ఇదే ఎల్లోపతీ డాక్టరు అయితే 'హై కార్బ్ డయట్' అని ఇంగ్లీషులో చెబుతాడు. పుట్టుకతో వచ్చిన జబ్బుకి పథ్యమే పరమౌషధం. మోతాదుగా తిన్న తిండే కదుటోయ్

మందు అంటే," అని రామేశం గారు చిన్న కునుకు తియ్యడానికి తలగడ మీదకి జారబడుతూ ఉండగా గేటు తెరుచుకుని సత్యవరం అప్పన్న తాత ఒక మోద తమలపాకులతో ప్రత్యక్షం అయేడు.

"ఆదోరం సంతకొచ్చా బాబూ. తవఁ దరిసెనం సేసుకోని, తవఁ కాళ్లొకసారి పట్టుకోని పోదావని ఒచ్చేను బాబయ్యా! దరమ పెబువులు. పదేళ్ల కితం సచ్చిన బొందికి పేణం పోసి బతికించేవు కదా. ఏదో పేదోణ్ణి. ఈ తవలపాకులు తప్ప ఇంకేదీ ఇచ్చుకోలేను. బాబూ నేను సచ్చిన తరువాత ఈ సెరమం ఒలిపించి సెప్పులు కుట్టించుకోండి....."

"తాతా, నువ్వు చావా వద్దు. మాకు చెప్పులూ వద్దు. నువ్వు వారం వారం, బతికున్నన్నాళ్లూ, ఇలా మాకు తమలపాకులు పట్టుకురానక్కర లేదని నీకెన్ని సార్లు చెప్పేను? ఎండలో వచ్చేవు. నీకింత అన్నం పెడతాను. తిని కాసేపు నీడని అలా పడుక్కో!" అంటూ సీతమ్మ గారు గదమాయించేసరికి

"దమ్మ పెబువులు" అంటూ తాత అరిటాకేసుకుని చతికిల పడ్డాడు.

రామేశం గారు అప్పటికే చిన్న కోడి కునుకు లోకి జారుకున్నారు.

**కథ వెనుక కథ:**

ఆంధ్ర ప్రభ వార పత్రిక, మార్చి 1996 వారం వారం కథా ప్రభ శీర్షిక లో ప్రచురణ పొందింది. ఈ కథ మీద పాఠకుల నుండి వచ్చిన స్పందన వర్ణనాతీతం. కథ ప్రచురణ పొందిన తరువాత కనీసం రెండు నెలల పాటు పాఠకులు రాసిన ఉత్తరాలని ప్రచురించడమే తప్ప సంపాదకుల వారు అమెరికాలో ఉన్న నాకు మాట వరసకైనా కథ ప్రచురితమైన సంచికని పంపడం కాని, కథ మీద వస్తున్న స్పందనని నాకు తెలియపరచడం కాని, నా ప్రతి స్పందన అడగడం కాని చెయ్యలేదు. చివరికి బెంగుళూరు నుండి ఒక పాఠకుడు (మిలటరీ ఆఫీసరు) అంతర్జాలంలో నా పేరు వెతికి, కథ పడ్డ ప్రతిని, పాఠకుల స్పందనని కత్తిరించి, తపాలా ఖర్చులు తానే భరించి, పంపేరు. ఈ కథకి బొమ్మ వేసిన బాపు కథ తనకి ఎంతో నచ్చిందని స్వహస్తంతో ఉత్తరం రాసేరు.

# ఆర్జవజీవులు

## 1

"అమ్మోయ్! నొప్పి," అంటూ పొత్తి  కడుపు మీద డాక్టరు వేసిన చేతిని పక్కకు తోసేసింది తాయారమ్మ. "పచ్చి పుండులా ఉంది, బాబూ!"

అసంకల్ప ప్రతీకార చర్యలా  నా చేతిని గభీమని వెనక్కి లాగేసేను. కాని పరీక్ష అర్ధాంతరంగా ఆపేస్తే రోగనిర్ణయం చేసేదెలా?

"అమ్మా! మీరు ఒక్క క్షణం ఓపిక పట్టాలి" అంటూ సముదాయించి, మరొక సారి పొత్తి  కడుపు కుడి వైపు నెమ్మదిగా నొక్కి చూసేను. ఒక్కసారి కెవ్వు మని కేకేసింది ఏభయ్యవ పడిలో పడుతూన్న తాయారమ్మ.

ఇక సందేహం లేదు. ఇది ఎపెండిసైటిస్. గాంధీ గారికి జైలులో ఉండగా  ఎపెండిసైటిస్ రావడం వల్ల మన దేశంలో ఈ మాట వినని వాళ్లు అరుదు.

'ఎపెండిక్స్' అంటే క్రిమిక. 'అయిటిస్' అంటే వాపు. కనుక ఎపెండిసైటిస్ అంటే క్రిమిక వాచడం అని అర్థం. మనం తిన్న ఆహారం చిన్న పేగులలో పూర్తిగా జీర్ణం అయిపోయిన తరువాత పెద్ద పేగుల లోకి వెళ్లే ముఖద్వారం దగ్గర ఉంటుంది ఈ  క్రిమిక. చూడ్డానికి చిన్న వానపాము ఆకారంలో ఉండే సంచీ వంటిది ఇది. అప్పుడప్పుడు ఆంత్రోచ్ఛిష్టమైన ఆహార ఉలూఖలాలు ఈ  సంచిలో చిక్కుకుంటే క్రిమికకి చీము పట్టి వాచుతుంది. వెనువెంటనే శస్త్రచికిత్స చేసి, కోసి తీసివెయ్యకపోతే క్రిమిక చితుకుతుంది. అది ప్రాణాపాయ పరిస్థితి. అందుకని సర్జన్ కి కబురు పంపేను. అయన కూడ పరీక్ష చేసి ఇది ఎపెండిసైటిస్ అని రూఢి చేస్తే అప్పుడు ఆపరేషన్ చేస్తారు.

అమెరికాలో చాల ఆసుపత్రులలో "ఎమర్జెన్సీ విభాగం" అంటూ  కొన్ని గదులు ఉంటాయి. ప్రమాదం ముంచుకొస్తున్నాదని అనుమానం ఉన్న సందర్భాలలో ముందు  ఉపతాపిని ఈ "ఆత్యయిక శాల"

(ఎమర్జెన్సీ వార్డ్) కి తీసుకొస్తారు. తుపాకి దెబ్బలకి, కత్తి పోట్లకి క్షతగాత్రులయిన వాళ్లు, మందులని దుర్వినియోగం చేసి కొరివితో తల గోక్కున్న వాళ్లూ, ఇలా రకరకాల ప్రజానీకంతో, ఎల్లప్పుడు రద్దీగానే ఉంటుందీ ఆత్యయిక శాల. రోగనిర్ణయం చెయ్యగలిగినంత చేసి, చేతనయిన ప్రథమ చికిత్స చేసి, ఏ నైపుణ్యం ఉన్న వైద్యుడు అవసరమో నిర్ణయం చేసి ఆ వైద్యుడిని పిలిపించడం వంటి పనులతో ఎమర్జెన్సీ గదిలో సిబ్బంది ఇరవై నాలుగు గంటలూ, ఏడు రోజులూ, ఊపిరి తిరగని పనులతో సతమతమవుతూ ఉంటారు.

ఆపరేషన్ అనగానే తాయారమ్మా, ఆవిడని ఆసుపత్రికి తీసుకొచ్చిన కొడుకూ కొంచెం కంగారు పడ్డారు. భయపడవలసిన అవసరం లేదనిన్నీ, ఇది రివాజుగా చేసే శస్త్ర పరిక్రియేననీ ధైర్యం చెప్పి అక్కడనుండి మరొక ఉపతాపిని చూద్దామని వెనక్కి తిరిగి వెళ్లబోతూ ఉంటే నా తెల్ల కోటు పట్టుకుని తాయారమ్మ వెనక్కి లాగింది.

"నాయన్నాయనవి కాదూ! అందాకా ఈ నొప్పి తగ్గడానికి ఏదయినా ఒక మాత్ర ఇయ్యి బాబూ" అని ప్రాధేయపడుతూ అడిగింది.

"లేదమ్మా, సర్జన్ వచ్చి ఇది ఎపెండిసైటిస్ అని రూఢి చేసే వరకూ మరే మందూ ఇవ్వడానికి వీలు లేదు. మందుతో నొప్పిని కప్పెడితే అసలు రోగం ఏమిటో తెలియకుండా పోయే సావకాశం ఉంది. ఒక్క నిమిషం భరించండి," అని నచ్చచెప్పి తాయారమ్మ "చార్టు" ని మరొకసారి చదవడానికి నర్సులు ఉండే మంచె దగ్గరకి వెళ్లేను.

ఇది అమెరికాలో నాకు తగిలిన తొలి తెలుగు కేసు. ఆంధ్రా మెడికల్ కాలేజీలో చదువు వెలగబెట్టి, హవుస్ సర్జన్ అయిన తరువాత, ఇ. సి. ఎఫ్. ఎమ్. జి. పరీక్ష రాసి, సరాసరి అమెరికా వచ్చేసేను. ఇన్నాళ్ళకి తెలుగు వాళ్లు తారస పడ్డారు. ఏదో మన వాళ్లే కదా అని మరి కొంచెమ పూనుకుని చూస్తున్నాను.

తాయారమ్మ టెంపరేచరు 101 డిగ్రీల మీద మరొక్క పిసరు ఉంది. తెల్ల కణాల లెక్క 19,000 దాటింది. ఆరోగ్యంగా ఉన్నవాళ్ళకి ఈ విలోకనాంకం 4,300 కీ 10,800 కీ మధ్య ఉంటుంది. ఈ సంఖ్య 19,000 ఉందంటే శరీరంలో ఎక్కడో సోకుడు – అంటే, తిష్ట లేదా ఇన్ఫెక్షన్ – పట్టి ఉండాలి. మెక్బర్నీ బిందువు (ఇది బొడ్డుకి తుంటియెముకకి మధ్యస్తంగా, కుడి వైపు పొత్తికడుపు మీద ఉండే ప్రదేశం) మెత్తగా ఉండి ముట్టుకోగానే మొర్రో మంటున్నాది, తాయారమ్మ. పక్కనే ఉన్న ఆఫీసులోకి వెళ్లి, బీరువా తెరచి, పుస్తకం తీసి, పేజీలు తిప్పి చూసేను. క్రిమిక వాచినప్పుడు ఆ క్రిమిక వెళ్లి ఈ మెక్బర్నీ బిందువు ఉన్న స్థావరంలో పొత్తికడుపు గోడలకి ఉన్న నరాలని తాకుతుంది. అందుకే అక్కడ చేయి పెట్టగానే కెవ్వుమని కేక వేసింది తాయారమ్మ. నేను చేసిన రోగనిర్ణయం సరి అయినదే అని మరొకసారి మననం చేసుకుని, మళ్లా నర్సులు ఉండే బల్ల దగ్గరకి వెళుతూ ఉంటే – నేను పంపిన కబురుకి సమాధానంగా వచ్చినట్లున్నారు – ముగ్గురు సర్జనులు తాయారమ్మ చుట్టూ మూగి పరీక్ష చేస్తూ కనిపించేరు.

ఇంతలోనో ఇహలోనో వీళ్లు తాయారమ్మని ఆపరేషన్ చేసే గదిలోకి తీసుకెళతారని నేను అనుకుంటూ ఉండగానే 'సర్జికల్ రెసిడెంటు' నా దగ్గరకి వచ్చి, భుజం మీద చెయ్యి వేసి, "చూడు, డాక్టర్ రావ్! పేషెంటు పొట్ట పచ్చి పుండులా ఉన్న మాట నిజమే. ఆసుపత్రిలో వెంటనే చేర్పించాలి. అదీ నిజమే. కాని ఆపరేషన్ మాత్రం అక్కర లేదోయ్!"

నా ముఖ కళవళికలని గమనించి, నేను ఎక్కడ బాధ పడతానో అని కాబోలు, "ఆహా! నువ్వు పరీక్ష చేసినప్పటికీ, ఇప్పటికీ రోగ లక్షణాలలో మార్పు వచ్చి ఉండొచ్చు. నేను చూసే వేళకి నొప్పి పొట్టకి ఎడం పక్క, పొత్తికడుపుకి మరీ దగ్గరగా కాకుండా, బొడ్డుకి కొంచెం మీదని వస్తోంది. విరేచనాలు కూడా అవుతున్నాయని చెప్పింది. ఇది ఎపెండిసైటిస్ కాదోయ్, ఇది ఎంటెరైటిస్."

'ఎంట్రెయిల్స్' అంటే చిన్న పేగులు. ఎంటెరైటిస్ అంటే చిన్న పేగుల వాపు. ఈ వాపుని తెలుగులో ఆంత్రశోఫ అంటారు. నేను అనుకున్నట్టు ఎపెండిసైటిస్ కాదనేసరికి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో స్వర్ణ

పతకం గెలుచుకున్న నా అహం దెబ్బ తింది. ఎపెండిసైటిస్ అని నేను రోగనిర్ణయం చేసినప్పుడు కడుపులో ఏది వాచిందో నిర్దిష్టంగా చెబుతున్నాను. ఎంటెరైటిస్ అంటే వాపు పేగులలో ఎక్కడైనా కావచ్చు. “మీది ఏ ఊరు?” అని అడిగితే “గోదావరి జిల్లా” అని చెప్పినట్లుంది ఇతని వరస.

నేను మరీ అంత తెలివి తక్కువ వాడిని కాదని నిరూపించుకుందికా అన్నట్లు, “ఎంటరైటిస్ అంటే వాపు ఎక్కడైనా కావచ్చు. అది రోగ నిర్ణయం ఎలా అవుతుంది?” అంటూ నీళ్లు నమిలేను.

“ప్రస్తుతానికి నేనూ అంతకంటె ఏదీ చెప్పలేనోయ్! తెల్ల కణాల లెక్క మరీ అంత ఎక్కువగా ఉండడం మంచిది కాదు. నువ్వు చెప్పినట్లే ఆసుపత్రిలో తప్పకుండా చేర్పించి మన పర్యవేక్షణలో ఉంచాలి. కాని కోత అక్కర్లేదు,” అంటూ నా స్పందన కోసం వేచి ఉండకుండా జరజర మరొక కేసు చూడ్డానికి వెళ్లిపోయేడు.

చేసేది, చెయ్యగలిగేది ఏదీ లేక తెల్ల కోటు ఒక సారి సర్దుకుని, మనస్సులో భావాన్ని బయటకి వెళ్లగక్కకుండా, మరొక సారి పరీక్ష చేసే నెపంతో తాయారమ్మ దగ్గరకి వెళ్లి, “ఇప్పుడు నొప్పి ఎలాగుంది?” అని అడిగి, “తాయారమ్మ గారూ! మరేమీ భయపడకండి. ఒక మంచి వార్త, ఒక చెడ్డ వార్త చెప్పడానికి వచ్చేను. మంచి వార్త ఏమిటంటే మూడొంతులు ఆపరేషన్ అక్కర లేదని పెద్ద డాక్టరు గారు అంటున్నారు. చెడ్డ వార్త ఏమిటంటే మీకు వచ్చిన జబ్బు ఏమిటో అంతూ, దరి తెలియటం లేదు. మీరు ‘నొప్పి, నొప్పి’ అని అరవకుండా కొంచెం కుదురుగా ఉండి, నేను అడిగిన ప్రశ్నలకి సమాధానాలు చెబితే మీ బాధ తగ్గించడానికి ప్రయత్నాలు చేస్తాను” అన్నాను.

తన పొట్ట తన చేత్తో ఒకసారి నొక్కుకుని, “అబ్బే! ఇప్పుడు అంతగా నొప్పి లేనే లేదు. అడుగు నాయనా, చెబుతాను,” అంది తాయారమ్మ.

కడుపులో వికారం, వాంతులు, విరేచనాలు, మొదలయినవన్నీ క్రిమిక శోఫ లక్షణాలే. అందువల్ల ఎపెండిసైటిస్ అని రోగనిర్ణయం చెయ్యడం అంత అనాయాసంగా జరిగే పని కాదు. మూత్రపిండాలు

కాని, పిత్తాశయం కాని రోగగ్రస్తం అయినా, లేదా మరెన్నో ఇతర కారణాల వల్ల ఎపెండిసైటిస్ లక్షణాలు పొడచూపే సావకాశాలు ఉన్నాయి. అందుకని తాయారమ్మని మరొక కోణం నుండి పరీక్షించడం మొదలు పెట్టేను.

"అప్పుడప్పుడు ఉబ్బసం వస్తూ ఉంటుందని చెప్పేరు కదా, మందు ఏదయినా తీసుకుంటున్నారా?"

"ప్రొవిటిల్ ఇన్‌హేలర్ వాడుతోందండి. మరీ ఎక్కువగా వస్తే స్టీరాయిడ్ మాత్రలు వేసుకుంటోందండి," తల్లి తరఫున కొడుకు సమాధానంచెప్పేడు.

ఉబ్బసం ఉన్న వాళ్లకి వ్యాధి విజృంభించినప్పుడల్లా ఎగ ఊపిరి వస్తుంది. దీనికి కారణమేమిటంటే ఊపిరితిత్తులలో ఉండే శ్వాసనాళికలలోని గాలి దారులు ముకులించుకు పోవడమే. ఇలా ఇరుకయిన మార్గాలని విప్పారించడానికి 'ఇన్‌హేలర్' రామబాణంలా పని చేస్తుంది. ఈ ఇన్‌హేలర్ చిన్న గొట్టంలా ఉంటుంది. అది నోట్లోపెట్టుకుని గట్టిగా లోపలికి పీల్చితే గొట్టంలో ఉన్న 'ప్రొవిటిల్" అనే మందు ఛాతీలోకి వెళుతుంది. అప్పుడు గురక ఉపశమించి గాలి పీల్చడం కొంత తేలిక అవుతుంది.

ఇక 'స్టీరాయిడ్' గురించి చిన్న పాఠం. స్టీరాయిడ్ ని తెలుగులో ఘృతార్థం అంటారు – అంటే, నెయ్యిని పోలిన కొవ్వు పదార్థం అని అర్థం. ఇది ఒక రసాయనం. దీని గొప్పతనం ఏమిటంటే ఇది వాపుని కలుగజేసే పదార్థాల ఉత్పత్తిని ఆపుతుంది. కనుక స్టీరాయిడ్ ల సహాయంతో రకరకాల వాపులని అరికట్టవచ్చు. కాని అత్యవసర పరిస్థితులలో తప్ప స్టీరాయిడ్లని చీటికీ మాటికీ వాడడం అంత మంచిది కాదు. స్టీరాయిడ్లకి అలవాటు పడిపోయిన శరీరం రోగాలని ఎదిరించి పోరాడ లేదు. అప్పుడు మొదటికే మోసం కదా? అందుకని రోగం విజృంభించినప్పుడు మాత్రం ఈ స్టీరాయిడ్లని వాడి, దైనందిన అవసరాలకి ఇన్‌హేలర్ వాడతారు.

"అంతేనా? ఇంకేమయినా మందులు వాడుతున్నారా?"

“ఆ మధ్య ‘బ్రాంకైటిస్’ కి ‘ఏంటీబయటిక్స్’ వాడమంటే వాడేమండి,” తాయారమ్మ తనయుడు చెప్పేడు.

“ఆ విషయం ఇంతవరకు చెప్పలేదేమి?” నేను మొదట్లో చేసిన తప్పుడు రోగనిర్ణయానికి రోగిదే బాధ్యత అన్నట్లు స్ఫురించిందా ప్రశ్న. “ఆ ఏంటీబయటిక్ పేరేమిటో తెలుసా?”

“పేరు జ్ఞాపకం లేదండి. తెల్లగా ఉన్న పెద్ద పెద్ద మాత్రలండి.”

“దాని పేరు ‘బేక్ట్రిం’ అయి ఉండొచ్చా?”

“అవునండి. అదేనండి. పేరు వినగానే గుర్తుకి వచ్చింది.”

“విరేచనాలు ఎప్పుడు మొదలయాయి?”

“నిన్ననేనండి. ఈ రోజు బాగా ఎక్కువయాయి.”

“నీళ్ల విరేచనాలా? రక్తం పడుతోందా?”

“టుర్రు నీళ్లు నాయనా. బిరడా తీసేసిన సీసా అనుకో.”

నా మనస్సులో గభీమని ఒక ఆలోచన మెరిసింది. కానీ ఇందాకటిలా తొందరపడి తప్పు చేస్తే మరి ముఖం చెల్లదు. అందుకని – ఎందుకేనా మంచిదని – మరో రెండు ప్రశ్నలు వేసేను.

“ఈ మధ్య విదేశాలలో ప్రయాణం చేసి వచ్చేరా?”

“లేదు నాయనా”

“ఇండియాలో మీది ఏ ఊరు?”

“మొగల్తుర్రు. మావారితో కలసి చిన్నతనంలోనే ఈ దేశం వచ్చేసేను. అప్పటికి పద్దెనిమిది ఏళ్లు నిండేయేమో. మా అబ్బాయి,” కొడుకుని చూపిస్తూ, “ఈ దేశంలోనే పుట్టేడు…..”

తాయారమ్మ ఇంకా ఏవేవో చెబుతూనే ఉంది. నేను ఆమె మాటలు పూర్తిగా వినకుండానే సర్జికల్ రెసిడెంటు దగ్గరకి వెళ్లేను.

“తాయారమ్మ రెండు వారాల కిందట బేక్ట్రిన్ వాడిందిట. ఆ విషయం మీకు చెప్పిందా?”

బుర్ర వంచుకుని ఏదో రాసుకుంటూన్న రెసిడెంటు, బుర్ర ఎత్తకుండానే, “నేనూ అదే అనుకుంటున్నాను ” అని ముక్తసరిగా మూడు మాటలు అన్నాడు.

“అలాగా! అయితే తాయారమ్మకి వచ్చినది ‘సూడో మెంబ్రేనస్ కోలైటిస్’ అని మీకూ అనుమానంగా ఉందా?”

“ఉహు! ఆ అవకాశం ఉంది. పరీక్ష చేసి చూడండి.”

‘సూడో మెంబ్రేనస్ కోలైటిస్’ ఒక మొండి రోగం. పెనిసిలిన్, ఏంపిసిలిన్, మొదలైన ‘ఏంటీబయాటిక్కు’ లని విచక్షణ లేకుండా, విచ్చలవిడిగా వాడేస్తే వచ్చే ప్రమాదాలకి ఈ ‘సూడో మెంబ్రేనస్ కోలైటిస్’ ఒక చక్కని ఉదాహరణ.

ఏంటీబయాటిక్కుల వాడకం వల్ల మంచితోపాటు చెడు కూడా జరిగే అవకాశం ఉంది. ఇదేమిటో సోదాహరణంగా వివరిస్తాను. ‘ఏంటీబయాటిక్’ అన్న ఇంగ్లీషు మాటకి ప్రాణాంతకి లేదా ప్రాణం తీసేది అని అర్థం చెప్పుకోవచ్చు. పొలంలో కలుపు మొక్కలని చంపడానికి మందు జల్లితే కలుపు మొక్కలతో పాటు పైరు మొక్కలు కూడ చచ్చిపోయే ప్రమాదం ఎలా ఉందో అలాగే ఈ ఏంటీబయాటిక్కులని నిర్లక్ష్యంగా వాడితే ఇవి రోగ కారకులైన సూక్ష్మజీవులని చంపడమే కాకుండా మన ఆరోగ్యానికి అవసరమయే స్నేహపూరిత సూక్ష్మజీవులని కూడ విచక్షణారహితంగా హతమారుస్తాయి. ఈ మందులని, అత్యవసరం కాని సమయాలలో, విచ్చలవిడిగా వాడడం మొదలు

పెడితే హానికర  సూక్ష్మజీవులు వీటికి అలవాటు పడిపోయి,  క్రమేపీ వేసిన మందుకి లొంగడం మానెస్తాయి. అది చాల ప్రమాదకరమైన పరిస్థితి.

అలాగని తప్పంతా వైద్యుల మీదకి తోసెయ్యడమూ న్యాయం కాదు. అవసరమని వైద్యుడు నిర్దేశించినప్పుడు, వైద్యుడు నిర్ణయించినంత కాలం, మోతాదు తప్పకుండా, వేళ తప్పకుండా వాడాలి. మందు వేసుకున్న మూడు రోజులలోనే గుణం కనిపించినా కూడ, మందు వాడకం మధ్యలో ఆపెయ్యకూడదు. అలా వాడకపోతే ఇంకా ప్రమాదం. అదెందుకో కూడ చెబుతాను. మన శరీరంలో రోగం కలిగించే సూక్ష్మజీవులలో కొంచెం అర్భకంగా ఉన్నవి మందు ధాటికి ముందు చచ్చిపోయి, కొంచెం గుణం కనిపించినట్లు మనకి అనిపిస్తుంది. గుణం కనిపించింది కదా అని మందు వేసుకోవడం ఆపెస్తే, దృఢంగా ఉన్న సూక్ష్మజీవులు చావవు; పైపెచ్చు ఈ మందుకి అలవాటు పడిపోయి, ఇంకా దృఢంగా ఉన్న పిల్లలని కంటాయి. అలా బలం పుంజుకున్న జీవులు ఒక రోగి శరీరం నుండి మరొక చోటికి వెళ్లి తిష్ఠ వేసినప్పుడు, రోగనిర్ణయం చేసి, మందు నిశ్చయించే లోపున ఉపతాపి ప్రాణం పోవచ్చు.

గుణం కనిపించింది కదా అని ఉపతాపి మందు వాడడం ఆపెయ్యకుండా చెయ్యాలంటే ఒక మార్గం ఉంది. అవసరం ఉన్నంత మందు రోగి చేత ఒకేసారి కొనిపించడం. ఎలాగా కొన్నాం కదా, కొన్న మందుని ఎందుకు వృధా చెయ్యడం అనే తత్త్వం ఉన్న వ్యక్తుల యెడల ఈ చిటకా పని చేస్తుంది. కాని డాక్టరు అనుకున్నట్లు మందు పని చెయ్యక పోతే, మందు మార్చవలసి రావచ్చు. అప్పుడు, వైద్యుడు – మందుల దుకాణం వాడితో లాలూచీ పడి – ఉపతాపి చేత అనవసరంగా మందు కొనిపించేడనే అపవాదు వస్తుంది. 'తీస్తే మంట, తియ్యక పోతే తంట'  అన్న విధంగా ఉంది ఈ రోజులలో వైద్యం చెయ్యడం!

ఏంటీబయాటిక్కుల విషయంలో ఇటీవల మరొక విచిత్రం జరుగుతోంది. ఒక జాతి సూక్ష్మజీవులు మనం వాడిన ఏంటీబయాటిక్కునే ఆహారంగా మార్చేసుకుని బలిసిపోతున్నాయిట! ఇదే నిజం అయితే మానవ జాతిలో ముసలం పుట్టినట్లే! మన పుట్టి మినిగినట్లే!

మన పేగులలో ఎల్లప్పుడూ ఒక రకమైన సూక్ష్మజీవులు స్థావరం ఏర్పరచుకుని ఉంటాయి. ఇవి మనకి హాని చెయ్యవు సరికదా ఉపకారమే చేస్తాయి. మనం మందు రూపంలో వేసుకున్న ఏటీబయాటిక్కులు ఈ మిత్రజాతుల మీద కూడ దాడి చేస్తాయి. మనకి ఉపకారం చేసే సూక్ష్మజీవులు ఇలా చచ్చిపోతే ఆ స్థావరాలలో అపకారం చేసే ఆషాఢభూతులు చేరతాయి. ఈ ఆషాఢభూతుల కోవకి చెందిన ఒక సూక్ష్మజీవి జాతి పేరు 'క్లోస్ట్రిడియం డిఫిసీల్.' ఈ 'క్లోస్ట్రిడియం డిఫిసీల్' మనం తిన్న తిండిలో ఒక వాటా తీసుకుని – తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టిన చందాన – ఒక విష పదార్థాన్ని విసర్జిస్తాయి. ఈ విష పదార్థపు ప్రభావంవల్ల మన పేగుల లోపలి పొర చివికి, చిరిగిపోతుంది. ఇలా చిరిగిపోయిన స్థానంలో ఒక దొంగ పొర పెరుగుతుంది. ఈ దొంగ పొరనే ఇంగ్లీషులో 'సూడో మెంబ్రేన్' అంటారు. 'కోలన్' అంటే పేగు, 'ఐటిస్' అంటే వాపు కనుక 'కోలైటిస్" అంటే పేగు వాపు. పేగు ఎక్కడ వాచింది? దొంగ పొర దగ్గర. కనుక ఈ దొంగ పొర వాచడాన్ని 'సూడో మెంబ్రేనస్ కోలైటిస్' అంటారు.

తమాషా ఏమిటంటే, అశ్రద్ధగా ఏంటీబయాటిక్కులు వాడడం వల్ల సంక్రమించిన ఈ 'సూడో మెంబ్రేనస్ కోలైటిస్' కి కారణభూతమైన 'క్లోస్^ట్రీడియం డిఫిసీల్' మీద రామబాణం లాంటి మందు 'ఫ్లేజీల్' అనే వ్యాపారనామంతో చెలామణీ అవుతూన్న 'వేంకోమైసిన్' లాంటి ఏంటీబయటిక్! చూశారా! ఈ ఏంటీబయటిక్ లు వాడితే ఒక చిక్కు, వాడకపోతే మరొక చిక్కు.

ఏమయితేనేమి. తాయారమ్మని పట్టి పీడుస్తూన్న రుగ్మత ఏమిటో కొంచెం అర్థం అయింది. కనీసం అయిందని అనుకుంటున్నాను. కనుక నర్సు దగ్గరకి వెళ్లి తాయారమ్మని ఆసుపత్రిలో చేర్పించమని

సిఫారుసు చేసి, ఆమె మలం పరీక్షించమనిన్నీ, వెంటనే ఫ్లేజీల్ ఇవ్వమనిన్నీ ఉత్తర్వు జారీ చేసి, “హమ్మయ్య, నెగ్గేమురా” అనుకుంటూ ఒక్క సారి గట్టిగా గాలి పీల్చుకుని ఇంటి ముఖం పట్టేను.

2

ముందు రోజు అలసట నుండి మరునాటికి తేరుకున్నాను. ఫ్లేజీల్ ప్రభావానికి తాయారమ్మ కూడా తేరుకుని ఉంటుందనే ధీమాతో ఆసుపత్రిలో అడుగు పెట్టేను. తలుపు తెరుచుకుని లోపల అడుగు పెట్టేనో లేదో తాయారమ్మ కొడుకు తగులుకున్నాడు.

“డాక్టర్! అమ్మకి రాత్రంతా కంటి మీద కునుకు లేదంటే నమ్మండి. ఎడతెరిపి లేకుండా అలా ధారాపాతంగా విరేచనాలు అవుతూనే ఉన్నాయి.”

పుండు మీద కారం జల్లినట్లు ఇంకా తాయారమ్మ మంచం ఎమర్జెన్సీ వార్డు వరండాలోనే ఉంది. మేడ మీద గది ఇంకా ఖాళీ అవలేదుట. నాకు జాలి వేసింది. రాత్రి ఏమేమి మందులు ఇచ్చేరో ఒక సారి సింహావలోకనం చేసేను. నా ఉత్తర్వు ప్రకారం క్లోస్ట్రీడియం డిఫిసీల్ ని చంపడానికి ఫ్లేజీల్ ఇవ్వడం మాత్రం ఇచ్చేరు. కాని రక్త ప్రవాహంలోకి తిన్నగా వెళ్లడానికి మందుని సూదితో ఎక్కించేరు. “పేగులలో ఉన్న సూక్ష్మజీవులని చంపడానికి మందుని నోటి ద్వారా ఇస్తే బాగుండేది కదా” అని నైట్ డూటీలో ఉన్న నరసమ్మతో నేనంటే, వాళ్లు “అలాగే డాక్టర్” అన్నారు. మనం ఇంకొకళ్లకి పనులు పురమాయించినప్పుడు సందిగ్ధానికి ఆస్కారం లేకుండా చెప్పకపోతే మనం మనస్సులో అనుకునేది ఒకటి, వాళ్లు చేతులతో చేసేది మరొకటి. వైద్యుడిగా మొదలు పెడుతూన్న జీవితంలో మరొక పాఠం నేర్చుకున్నాను.

“కొంచెం ఆమె బాధ ఉపశమించేలా చూడండి. ‘కేవోపెక్టేట్’ కాని ‘ఇమోడియం’ కాని ఇచ్చి ఆవిడ విరేచనాలు అదుపులో పెట్టండి,” అని నరసమ్మతో చెప్పి, చేయగలిగిందంతా చేస్తున్నామని తాయారమ్మ కొడుకుని సముదాయించి, నా పనులలో నేను మునిగి పోయాను.

జబ్బుకి కీలకమైన కారణం తెలుసుకోకుండా, బయటకి కనిపించే లక్షణాలను బట్టి వైద్యం చేస్తే ఇలాగే గుడ్డి గుర్రపు తాపులా ఉంటుంది. పలికితే పలుకుతుంది. లేకుంటే, పేషెంటు హరీమనిపోవచ్చు.

మరునాడు తాయారమ్మ మంచం పక్కకి చేరుకున్నాను. కనీసం ఈ రోజు వార్డులో మంచం దొరికింది. విరేచనాల ఉధృతం కూడ తగ్గిందని విన్నాను. కాని మనిషి ముఖం మాత్రం తేట పడలేదు.

"రాత్రి కంటి మీద రెప్ప వాల లేదంటే నమ్ము బాబూ" అంటూ తాయారమ్మ మొర పెట్టుకుంది.

ఆమెకి వచ్చిన మహామారి రోగం ఏమిటో అంతూ, దరీ తెలియడం లేదు. మలం పరీక్షకి పంపేను కదా. ఆ కోణం ఎలా ఉందో కనుక్కుందామని 'లేబు' కి వెళ్లేను.

"డాక్టర్! ఈ 'స్లయిడ్' ని మీరు ఒక సారి చూడాలి. ఇలా రాండి, ఒకసారి" అని టెక్నీషియన్ కేకేస్తే ఏమిటా అని అటు వైపు వెళ్లేను. సూక్ష్మదర్శనిలోకి తొంగి చూస్తూన్న వ్యక్తి పక్కకి తప్పుకుని, "స్టాంజిలాయిడ్లు! చూడండి!" అంటూ నన్ను ప్రోత్సహించేడు.

కళ్లజోడు సవరించుకుని, నాకు బాగా కనబడేలా ఫోకస్ ని సవరించి, "ఎవరయ్యా ఈ పేషెంటు?" అని అడిగేను.

మరెవరో అయితే మిమ్మల్ని ఎందుకు చూడమంటాను? మీ పేషేంటే! టాయారమ్మ!" అని తకారోచ్చారణ దోషంతో ఇబ్బంది పడుతూన్న మా చైనా టెక్నీషియన్ మాటలు నమ్మలేకపోయాను. స్లయిడు మీద మెలికలు తిరుగుతూ డజన్ల కొద్దీ ఉన్నాయి, స్టాంజిలాయిడ్లు!

'స్టాంజిలాయిడ్స్ స్టెరాకొరాలిస్' అన్న నోరు నిండేంత పేరున్న ఆసామీ నిజానికి ఒక మిల్లీమీటరు పాటి పొడుగుండే చిన్న పురుగు. సూక్ష్మజీవుల కంటె కాసింత పెద్దగా ఉండే వీటిని స్టాంజిలాయిడ్స్ అన్న పొట్టి పేరుతో పిలుస్తూ ఉంటారు. శాస్త్రీయంగా ఇవి ఆర్జవజీవుల కోవలోకి వస్తాయి. ఈ ఆర్జవజీవులనే ఇంగ్లీషులో 'పేరసైట్' లు అంటారు. పేరసైట్ అంటే మరొక జీవి మీద ఆధారపడి జీవించేది అని అర్థం. ఒక విధంగా చూస్తే నల్లులు, పేలు వగైరా నుండి కంటికి కనబడని బేక్టీరియా,

ఇంకా చిన్న వైన వైరస్, వగైరాలన్నీ పేరసైట్లే. కానీ వైద్య పరిభాషలో పేరసైట్ అన్న మాట వాడినప్పుడు అవి బేక్టీరియా, వైరస్ ల కంటే పెద్దవి, నల్లులు, పేలు కంటే చిన్నవి అని అర్థం చేసుకోవాలి. వీటిని తెలుగులో పరాన్నభుక్కి, పరభాగ్యోపజీవి, పరాన్నజీవి మొదలైన పేర్లతో కూడా పిలుస్తారు. ఉష్ణమండలాలలో ఉండే ప్రజల శరీరాలలో ఈ అర్జవజీవులు తరచు తిష్ట వేసుకుంటూ ఉంటాయి.

అసలు ఈ అర్జవజీవులు మన శరీరాలలో ప్రవేశించడమే ఒక వింత ప్రక్రియ. ఇవి మట్టిలో ఉండే సూక్ష్మమైన జీవులు. కానీ మట్టిలో ఉన్నన్నాళ్లు ఇవి డింభక దశలోనే ఉంటాయి. ఈ రకం పురుగులలో బోదకాలుని కలుగజేసే 'ఫైలేరియం' డింభాలు ఒక జాతివి. పాదరక్షలు లేకుండా మట్టిలోనూ, నీళ్ల్లలోనూ పని చేసే వారి చర్మాల గుండా ఇవి మొదట శరీరం లోకీ, ఆ తరువాత రక్త ప్రవాహం లోకీ ప్రవేశిస్తాయి. రక్తం లోంచి ఊపిరితిత్తులలోకి చేరతాయి. అక్కడ నుండి శ్వాస నాళికలోకి పాకుకుని వస్తాయి. దగ్గినప్పుడు అవి నోట్లోకి వచ్చి, మింగినప్పుడు కడుపులోకి వెళతాయి. అక్కడ నుండి పేగులలో చేరి, జీర్ణమైన ఆహారాన్ని కొంత తస్కరించి డింభక దశ వదలి, పెరిగి, పెద్దయి గుడ్లు పెడతాయి. ఈ గుడ్లు డింభములుగా మారి, మల విసర్జనతో బయటకి వచ్చి, మళ్లా మట్టిలో కలుస్తాయి. అక్కడ నుండి మళ్లా ఈ చక్రం పునరావృత్తం అవుతుంది.

చెప్పడానికి ఎలా ఉన్నా ఈ కథ వినడానికి అసహ్యంగా లేదూ? శుచి, శుభ్రత లేని దేశాలలోనూ, బహిరంగంగా మల మూత్రాదులు విసర్జన చేసే దేశాలలోనూ మట్టితో కల్మషమైన బురద నీటిలో పాదరక్షలు లేకుండా ప్రజలు పనులు చేస్తూ ఉంటే ఈ ఆర్జవజీవులు సునాయాసంగా చర్మాన్ని దొలుచుకుని శరీరంలో ప్రవేశించగలవు. ఇలాంటి ప్రమాదాలని దృష్టిలో పెట్టుకునే కాబోలు మనవాళ్లు మడి, ఆచారం అనిన్నీ, ఆడంగులు చెమ్మలో మసిలే సావకాశాలు ఎక్కువ కనుక వాళ్లు పాదాలకి పసుపు రాసుకోవాలనిన్నీ ఏవేవో నిబంధనలు పెట్టి శుచీ, శుభ్రత మనకి అలవాటు చేసేరు.

స్టాంజిలాయిడ్లు అన్ని ఆర్జవజీవుల వంటివీ కావు. వీటికి కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉన్నాయి. ఇవి వాటి అభ్యాగతి శరీరం వదలి బయటకి రాకుండానే, పేగులని దొలుచుకొని రక్త ప్రవాహంలో

ప్రవేశించగలవు. అలానే ప్రవేశిస్తాయి కూడా. అంటే ఏమిటన్నమాట? ఒకసారి శరీరంలోకి జొరబడిన తరువాత అవి ఏళ్ల తరబడి రక్తంలోంచి ఊపిరితిత్తులలోకీ, అక్కడ నుండి నోటిలోకీ, అక్కడ నుండి కడుపులోకీ, అక్కడ నుండి పేగులలోకీ, అక్కడ నుండి రక్తంలోకీ,....అలా చక్కర్లు కొడుతూనే ఉంటాయి.

స్ట్రాంజిలాయిడ్లుకి మరొక లక్షణం ఉంది. ఇవి ఊపిరితిత్తుల నుండి శ్వాసనాళికలోకి ప్రవేశించి, అక్కడ నుండి కడుపులోకి వెళ్లే సమయంలో ఆ గాలిగొట్టాన్ని వాచేటట్లు చేస్తాయి. ఆ వాపు వల్ల దగ్గు, ఆయాసం, ఎగ ఊపిరి వస్తాయి. ఇవి చూడడానికి ఉబ్బసం లక్షణాలులా కనిపిస్తాయి. తేడాని పసిగట్టడం కష్టం.

అభ్యాగతికి జబ్బు చేసినా, పోషణ సరిగ్గా లేకపోయినా, మరే కారణం వల్ల అయినా మనిషి నీరసించినా కడుపులో ఉన్న స్ట్రాంజిలాయిడ్లు జనాభా పెరుగుతుంది. అప్పుడు చిన్నగా జ్వరం, విపరీతమైన కడుపు నొప్పి, విరేచనాలు వచ్చి ఎపెండిసైటిస్ లక్షణాలు పొడచూపుతాయి. ఇవే లక్షణాలతో తాయారమ్మ ఎమర్జెన్సీ వార్డులో చేరింది.

ఉబ్బసం లక్షణాలని అదుపులో పెట్టడానికి ఘృతార్థాలని (స్టీరాయిడ్లని) వాడితే ఆ ఘృతార్థాల ప్రభావానికి స్ట్రాంజిలాయిడ్లు దినదిన ప్రవర్ధమానంగా పెరిగి వృద్ధి పొందుతాయి. తాయారమ్మకి ఉబ్బసం వచ్చినప్పుడల్లా వాడిన ఘృతార్థాల ధర్మమా అని ఆమె కడుపులో ఉన్న స్ట్రాంజిలాయిడ్లు అల్లారుముద్దుగా పెరుగుతూ వచ్చేయి. కొసకి కొంపని ముంచేయి.

అసలు సంగతి అర్థం అయింది కనుక ఇప్పుడు చికిత్స చిటికెల మీద చెయ్య వచ్చు. తాయారమ్మ శరీరంలో ఏళ్ల తరబడి తిష్ట వేసుకున్న స్ట్రాంజిలాయిడ్ల మీద రామ బాణంలా పని చేసే మందు ఒకటి ఉంది. దాని పేరు థయోబెంజడోల్.

మరునాడు ఉదయమే థయోబెంజడోల్ ఇద్దామని తాయారమ్మ గదిలోకి వెళ్లేను. సామానంతా సర్దేసుకుని ఆసుపత్రి గదిని ఖాళీ చెయ్యడాని సిద్ధంగా ఉన్న తాయారమ్మని చూడగానే ఆశ్చర్యం వేసింది.

"ఇంత బతుకూ బతికి ఇంటెంక్కాల చచ్చినట్లు ఇదేంటి బాబూ? రాత్రి నుండి చూస్తున్నాను. కుష్టు రోగిని చూసినట్లు చూస్తున్నారు, ఈ నర్సులు. నిప్పుని నీళ్లతో కడిగే ఆచారవంతుల ఇంట్లో పుట్టి పెరిగేను. ఆ ముదనష్టపు చైనావాడు వచ్చి నా ఒళ్లంతా పురుగులు పట్టిపోయిందని చెబుతాడా? పైపెచ్చు అందరూ ముక్కులకీ, మూతులకీ – దూడ పెయ్య మూతులకి కట్టే బుట్టలలాంటి – తెరలు కట్టుకుని ఏదో అంటురోగిని చూసినట్లు చూస్తారా….?

నిస్సందేహంగా తాయారమ్మ అహం దెబ్బ తింది.

"మీరు అలా అధైర్య పడకండి. వైద్యంలో సూక్ష్మాలు అర్థం కాని కుర్రకారు ఉద్యోగాలు వాళ్లవి," అని కురుక్షేత్రంలో యుధిష్టరుడు చెప్పిన అబద్ధం లాంటిది చెప్పి "పడిశం పట్టిన వ్యక్తిని చూసి పది బారలు పరిగేట్టే రకాలు వీళ్లంతా. వెనకటికి చెరువు మీద అలిగి ఎవ్వరో…." – విరేచనాలతో బాధ పడుతూన్న పెద్ద ముత్తయిదువు ముందు వాడదగిన సామెత కాదని నాలిక కరుచుకుని – మధ్యలోనే మాట ఆపేసేను. తాయారమ్మ అర్థం చెసుకున్నట్లే అనిపించింది.

ఒక మోతాదు మందు ఇచ్చేను. ఏండ్ల తరబడి పాతుకు పోయిన రోగం ఒక్క మోతాదుతో పొమ్మంటే పోతుందా? మరో రెండు మోతాదులు మందు వేసుకోవాలనిన్నీ, మళ్లా మళ్లా మలం పరీక్ష చేయించుకోవాలనిన్నీ మరీ మరీ చెప్పి ఆవిడని ఆసుపత్రి నుండి విడుదల చేయించేను.

ఆరోగ్యంగా ఉన్నప్పుడు చూసుంటే తాయారమ్మ అందగత్తే అయి ఉంటుంది. నలభై ఏళ్ల కిందట పట్టు పావడా వేసుకుని, శ్రావణ మంగళవారం పేరంటానికి వర్షంలో తడుస్తూ, మొగల్తుర్రు వీధులలో ఉన్న బురదలో నడుస్తూన్న చిన్న తాయారుని ఊహించుకున్నాను, ఆవిడ వెళుతూన్న వైపే చూస్తూ.

స్టాంజిలాయిడ్ల వంటి ఆర్జవజీవుల బారి నుండి రక్షించడానికే కాబోలు ఆడవాళ్ల పాదాలకి పసుపు, పారాణి రాసుకోవాలని మనవాళ్లు ఒక ఆచారం పెట్టేరు. ఏమో! నాకు తెలియదు.

"డాక్టర్ రావ్! ఎమర్జెన్సీ" అంటూ ఆసుపత్రి వారి లౌడ్ స్పీకర్ పిలుస్తోంది. మరో రోజు, మరో కేసు!

**కథ వెనుక కథ**

టోనీ డేహేర్ రాసిన 'ట్రయంఫ్ అఫ్ ట్రెచరీ' అనే అనుభవం దీనికి ఆధారం. అమెరికాలో నూ జెర్సీ నుండి వెలువడే తెలుగు జ్యోతి సెప్టెంబరు 1995 లో ప్రచురితం. రచన 1997 సంచికలో కూడ ప్రచురితం.

# త్రిశంకు లోకం

"మూడ్రోజులు పోయిన తర్వాత మళ్ళా వస్తే కుట్లు విప్పేస్తాను. దెబ్బ మాని పోతుంది. మచ్చ కూడా మిగలక పోవచ్చు. మరేమీ పరవా లేదు."

ఆడ పిల్ల కదా మచ్చ పడితే బాధ పడుతుందేమోనని సముదాయించే ధోరణిలో ఊరడింపు మాటలు చెప్పేడు డాక్టర్ పరాంకుశం.

"పెద్ద దెబ్బ తగిలిందేమిటోయ్ మచ్చా గిచ్చా అంటున్నావు. ముఖం మీద కానీ తగిలిందా?" పక్క గదిలోంచి రామేశం గారి గొంతుక వినిపించింది.

"ముఖం మీద కాదండి. ముంజేతి మీద. ఆరు కుట్లు పడ్డాయండి. రొటీన్ ఇంజరీ కేసేనండి," అంటూ బోర విరుచుకుని ఊపిరి పీల్చేడు పరాంకుశం, అదేదో బ్రహ్మవిద్య చేసినవాడిలా.

పరాంకుశం ఆంధ్రా మెడికల్ కాలేజీలో చదువు పూర్తి చేసి ఆ ఊళ్ళో కొత్తగా ప్రేక్టీసు పెట్టిన రోజులవి. చూడ్డానికి బొత్తిగా కుర్రాడిలా కనిపించేవాడు. పుస్తక పరిజ్ఞానం బాగానే ఉంది కానీ అనుభవంలో ఇంకా చెయ్యి తిరగలేదు. అప్పటికే ఊళ్ళో అరడజను మంది డాక్టర్లు ఉన్నారేమో, పోటీలో నెగ్గుకు రావాలంటే క్లినిక్ ని మంచి స్థావరంలో పెట్టాలి. లేదా అనుభవం ఉన్న వైద్యుడి దగ్గర కొద్ది కాలం శిష్యరికం చేసి ఆ ప్రేక్టీసుకి తను వారసుడుగా నిలవాలి.

"ప్రేక్టీసు నిలదొక్కుకునే వరకు మీ ఇంటి ముందు వాటాలో ఉంటే కొంచెం సదుపాయం గానూ ఉంటుంది, సర్దుబాటుగానూ ఉంటుంది" అని ప్రాధేయపడ్డాడు పరాంకుశం.

"…"

“మీరొక్కరూ ఉంటున్నారు. ఇల్లంతా ఖాళీగానే ఉంది కదా. మీకు చేదోడు వాదోడుగా ఉంటాను. ఆలోచించండి.”

ఇచ్చకపు మాటలకి గభీమని లొంగే తత్వం కాదు రామేశం గారిది. అందుకని ఏ సమాధానమూ ఇవ్వలేదు.

“మీ దగ్గరగా ఉంటే వైద్యంలో మెళుకువలు కూడ నేర్చుకోవచ్చని అనుకుంటున్నాడండి. పైగా చూడబోతే మీ దృష్టి మందగిస్తోంది. ఉండనియ్యండి. మనిషి సహాయం ఉంటుంది” అని పక్క నున్న ఆప్తమిత్రుడు గోపాలం ప్రోత్సహిస్తూ ఒక సిఫారుసు చేసేసరికి రామేశం గారు మౌనం తోనే అర్థాంగీకారం చూపించేరు. అప్పటినుండి పరాంకుశం మీదా, అతని ప్రేక్టీసు మీదా చెరొక కన్నూ పారేసి చూస్తూ ఉంటున్నారు రామేశం.

“దెబ్బ ఎలా తగిలిందేమిటమ్మా. ఏదీ ఇలా వచ్చి ఒక సారి నాక్కూడా చూపించు,” అంటూ పేషెంటుని తన వైపు ఒక సారి రమ్మని రామేశం గారు కేకేసేరు. వచ్చిన పేషెంట్లని అందరినీ ఆయన చూడరు. అప్పుడప్పుడు ఒకరిని ఎంపిక చేసి పిలుస్తారు. మంచీ చెడ్డా ఒక సారి మాట్లాడి పంపేస్తూ ఉంటారు.

“ముళ్ళ కంచె గీసుకుందండి” అంటూ మడిచిన ముంజేయి పైకెత్తి చూపించింది.

ఆమె వయస్సు ఇరవై ఉండొచ్చు. ముఖంలో వర్చస్సు లేదు. లోతైన బావిలో కదలిక లేని నీళ్ళలా జడ స్థితిలో ఉన్న ముఖ కవళిక. ఆరోహణ, అవరోహణ లేని ఏకస్వరపు మాట తీరు. ఎవరివో పరిచయస్తుల పోలికలు ముఖంలో కనిపించేయి కానీ ఇదమి ఇదమిత్థంగా ఎవరూ స్ఫురణకి రాలేదు. తన జీవితంలో ఎంతమందిని చూసేడో ఆయన!

“ఇది ముళ్ళ గీకుడు కాదమ్మా. గాటు లోతుగా పడి ఉండకపోతే ఆరు కుట్లు పడవలసిన అవసరం ఏమిటి వచ్చింది? నిజంగా ఏమిటి జరిగిందో చెప్పమ్మా.”

రామేశం గారు ఈ ప్రశ్న అడుగుతూన్నప్పుడు ఆయన గొంతుకలో అభిమానం, బుజ్జగింపు ధ్వనించేయి కానీ అభియోగం కాని, గద్దింపు కాని ధ్వనించ లేదు. కొత్త మళుపు తిరుగుతూన్న కథ ఏమిటో చూద్దామని పరాంకుశం పక్క గదిలోంచి వచ్చేడు.

కుడి మోచేతి వెనక భాగంలో మొదలయి అంగుళంన్నర మేర ఆరు కుట్లనీ పరిశీలిస్తూ, మడచి ఉన్న పేషెంటు ముంజేతిని తన చేతులోకి తీసుకుని రామేశం గారు ఆ మడతబందు కీలుని ముందుకు చాచేరు. మణికట్టుకి కొంచెం కిందుగా బాగా మానిపోయిన మచ్చ మరొకటి కనిపించింది, అయన కంటికి. అది కూడా దరిదాపు రెండంగుళాల పొడుగు ఉంది. మణికట్టు వరకూ వెళ్ళిన ఆయన కళ్ళు ఆమె చేతి వేళ్ళమీద పడ్డాయి. ఆమె వేళ్ళని తన చేతులోకి తీసుకుని పళ్ళతో కొరకబడి గార రంగుతో చూడ్డానికి చాలా అనారోగ్యంగా కనబడుతూన్న ఆ గోళ్ళని నిమురుతూ…

"ఏమోయ్ పరాంకుశం! ఏమిటోయ్ నీ రోగనిర్ణయం?"

"ఇన్‌ఫెక్షన్ అయుంటుందంటారా?"

"ఇప్పుడు అడగవలసిన తరువాత ప్రశ్న ఏమిటోయ్?"

రామేశం గారి రెండవ ప్రశ్నతో రోగనిర్ణయం ఇన్‌ఫెక్షన్ కాదని పరాంకుశం గ్రహింపుకి వచ్చేసింది. తర్వాత అడగవలసిన ప్రశ్న ఏమిటో తెలియక బుర్ర అడ్డుగా ఆడించేసేడు.

"ఏమమ్మా, నీది కుడి చేతి వాటమా? ఎడం చేతి వాటమా?"

ఆ అమ్మాయి ఇదమిత్థంగా ఏ సమాధానమూ ఇవ్వకుండా భుజాలు ఎగరేసింది.

"అమ్మా నీది కుడి చేతి వాటం కదూ?" మళ్ళా అడిగేరు.

"…"

"ఈ ప్రశ్న ఎందుకు అడుగుతున్నానో తెలుసా?" అని రామేశం పరాంకుశాన్ని అడిగేరు.

రామేశం గారి ప్రశ్న లోని అంతరార్ధం అర్ధం కాక, “మీరే చెప్పండి” అని తప్పించుకున్నాడు పరాంకుశం.

“ఏమమ్మా ఆ పైట చెంగు కొంచెం పక్కకి తప్పించి ఆ ఎడం చెయ్యి కూడా ఒక సారి చూపించు.”

పరాంకుశం నిర్విణ్ణుడై కళ్ళప్పగించి ఆమె చూపించిన చేతిని చూస్తూ అలా ఉండిపోయేడు.

ఆ చేతి నిండా గీతలు గీసినట్టు దెబ్బలు మానిన మచ్చలే. ఒకటి కాదు. ఒక రకం కాదు. అంగుళం పొడుగున్నవి. రెండంగుళాల పొడుగున్నవి. కుట్లు పడ్డ మచ్చలు. వాటంతట అవే మానిన మచ్చలు. నిలువుగా. అడ్డుగా!

“ఒక్క మనిషికి ఇన్ని దెబ్బలా? ఎలా తగిలేయి? ఎందుకు తగిలేయి?” అప్రయత్నంగా పరాంకుశం నోట్లోంచి వస్తూన్న ప్రశ్నల వర్షాన్ని ఆపడానికా అన్నట్లు రామేశం మధ్యలో కలుగజేసుకున్నారు.

“పరాంకుశం! అకర్మక క్రియ కాదోయ్ వాడవలసినది. సకర్మక క్రియ.”

ఈ వ్యాకరణపు సవరింపు వినేసరికి పరాంకుశం ఆశ్చర్యానికి అవధులు లేకుండా పోయింది. కుడి ఎడమల తారతమ్యం ఇప్పుడు తెలిసింది. తన ప్రశ్నలో వ్యాకరణాన్ని సవరించి, “ఎవరు కొట్టేరు? ఎందుకు కొట్టేరు అని అడగాలంటారా, లేక ఆత్మనేపదాన్ని వాడి ఎందుకు కొట్టుకున్నావు? ఎలా కొట్టుకున్నావు? అని అడగమంటారా?” అని పరాంకుశం సమ ఉజ్జీలో సమాధానం చెప్పి తను తెలుగు పండితుడి కొడుకునే అని నిరూపించుకున్నాడు.

“మనకి వ్యాకరణాలతో తగవులాట ఎందుకు లెద్దూ! అమ్మాయిని రెండు రోజులపాటు ‘అబ్సర్వేషన్’ లో ఉంచి చూడ్డం మంచిదనిపిస్తోంది. అమ్మా నీ పేరేమిటమ్మా?”

“కామాక్షి”

కామాక్షిని ఆఫీసు లోకి తీసుకువెళ్ళి పేరు, చిరునామా, కావలసినవాళ్ళ పేరు, చిరునామా, వగైరా విశేషాలన్నీ నమోదు చేసి "రెండు రోజులు 'అబ్సర్వేషన్' లో ఉంచండి" అని పరాంకుశం చిన్న హుకుం ఒకటి జారీ చేసి రామేశం గారి గదిలోకి వచ్చి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"ఇది 'బోర్డర్ లైన్ పెరసనాలిటి డిసార్డర్' అని నా అనుమానం" అన్నారు రామేశం.

'బోర్డర్ లైన్ పెరసనాలిటి డిసార్డర్' అన్న పేరు వినగానే తను మెడికల్ కాలేజీలో రుక్కు పట్టేసిన పాఠాలు జ్ఞాపకం వచ్చేసేయి పరాంకుశానికి. ఇహ ఉండబట్ట లేక "ఇవన్నీ తనంతట తాను తగిలించుకున్న దెబ్బలేనేమో. అడిగి వస్తానుండండి," అని పరాంకుశం లేవబోయాడు.

"కూర్చోవోయ్ పరాంకుశం. అడగవలసిన తొందర ఏమీ లేదు. అడుగుదాంలే. అడిగినా పిల్ల నిజం చెబుతుందని నమ్మకం ఏదీ? 'అబ్సర్వేషన్' లో పెడుతున్నాము కదా. ఈ 'బోర్డర్ లైన్ సింద్రోమ్' తో బాధ పడే వాళ్ళ నిఘంటువులో 'నేను', 'తాను', 'నా అంతట నేను', 'తనంతట తాను', 'కావాలని' మొదలైన మాటలు, భావాలు ఉండవు. వీళ్ళకి 'తన–పర' వ్యత్యాసం తెలియదు. వీళ్ళ శరీరానికీ ఆత్మకీ మధ్య ఉండే లంకె దరిదాపుగా తెగిపోయినట్లే. కనుక తమని తామే కొట్టుకుంటున్నారో, మరొకరు వాళ్ళని కొడుతున్నారో తెలుసుకునే విచక్షణ జ్ఞానం వీరికి ఉండదు. వాళ్ళ అస్థిత్వం అంతా ఎవరిదీ కాని త్రిశంకు లోకం. ఇంగ్లీషులో, 'దె ఆర్ ఇన్ నో మేన్స్ లేండ్.'

"మా ఎల్లోపతీ పరిభాషలో చెప్పాలంటే ఈ రకం త్రిశంకు లోకంలో ఉన్న వ్యక్తులు రెంటికీ చెడ్డ రేవళ్ళ లాంటి వాళ్ళు. అటు ఆలోచనా కేంద్రాలు రోగగ్రస్తమైనప్పుడు వచ్చే 'స్కిజోఫెర్నియా' వంటి 'కాగ్నిటివ్ డిసార్డర్స్' లక్షణాలని ఒక పక్కా, ఇటు మనస్థితికి సంబంధించిన 'డిప్రెషన్' లక్షణాలని ఒక పక్కా రకరకాల పాళ్ళల్లో ప్రదర్శిస్తూ ఉంటారని వైద్య సిద్ధాంతం ఉండడం ఉందండి."

"సిద్ధాంతం అన్నావు కనుక ఏదో మాటవరసకి చెబుతున్నాను. సిద్ధాంతాలూ నిర్వచనాలూ అక్షరాలా పాటిస్తే మనందరిలో కూడా ఏదో ఒక రకం 'పెరసనాలిటీ డిసార్డర్' కొద్దో గొప్పో కనిపిస్తూనే

ఉంటుంది. చాదస్తం ఒక రకం వ్యక్తిత్వ దోషం. దీన్ని ఇంగ్లీషులో 'కంపల్సివ్ పెరసనాలిటీ డిసార్డర్' అంటారు. అహంభావం ఒక రకమైన 'నార్సిసిజం.' మరొకళ్ళని గభీమని నమ్మలేకపోవడం, గభీమని క్షమించ లేకపోవడం, ఊరికే తప్పులు పట్టడం 'పెరనోయా' లక్షణాలు. ఇవి శ్రుతి మించకుండా, మరొకరికి హాని చెయ్యకుండా ఉన్నంత సేపూ చికిత్సలూ, అభిచర్యలూ అక్కర లేదు.

"అందుకని ఎవరి శరీరాలని వాళ్ళు కత్తితో కోసుకుని హాని చేసుకునే వాళ్ళంతా ఈ మానసిక వ్యథలతో కృంగి కూలిపోతున్నారని అనుకోడానికీ వీలు లేదు. తలనొప్పి మీద అమృతాంజనం ఎలా పనిచేస్తుందో నేను నీకు చెప్పక్కరలేదు, పరాంకుశం. తలనొప్పి బాధని కప్పెడుతూ ఈ లేపనం మరొక రకం చిరు బాధని కలుగజేస్తుంది. కత్తితో కోసుకోవడం కూడా అలాంటిదే. ఎన్నో విధాల సవ్యంగా వుండి సజావుగా జీవితాలు సాగిస్తూన్న వాళ్ళు కూడా ఉద్వేగాత్మకమైన మనోకల్లోలాలని ఎదుర్కొన్నప్పుడు కోత వల్ల కారే రక్తాన్ని చూసి, కోత వల్ల పుట్టే నొప్పిని భరించి అసలు సంక్షోభాన్ని వెనక్కి తోసేసి ఉపశమనం పొందుతూ ఉంటారు."

"నేను మాత్రం ఇటువంటి కేసుని ఎప్పుడూ చూడలేదండి."

"తొందర పడకోయ్. ఇప్పుడు చూస్తున్నావు కదా. అయినా మన దేశంలో ఇటువంటి కేసులు, పూర్వపు రోజుల్లో, డాక్టర్ల వరకూ వచ్చేవి కావు. దృష్టి దోషం అనో, చెడుపు అనో, చిల్లంగి అనో, దయ్యం అనో, పూనకం అనో రకరకాల పేర్లు పెట్టి నాటు వైద్యాలు చేస్తామంటారు కాని వైద్యుడి దగ్గరకు వెళ్ళరు."

"వెళ్ళితే డబ్బు ఖర్చు అయిపోతుందని ఒక బెంగ. మనవాళ్ళకి అన్నీ ఉచితంగా కావాలంటారు. గవర్నమెంటు ఆసుపత్రులలో ఉచితంగానే రంగునీళ్ళు పోస్తారు. అవి పని చేసి చావవు. రోగం ముదురుతుంది. అప్పుడు మనదగ్గరకి వస్తారు. రోగాలని మొక్కగా ఉన్నప్పుడు ఒంచాలి గాని మానైతే ఒంగవు." కొత్తగా ప్రేక్టీసు పెట్టిన పరాంకుశం తన సాధక బాధకాలని చెప్పుకున్నాడు.

“అందుకనే వైద్యుడు రోగిని చూసేటప్పుడు డబ్బు ప్రసక్తి రాకూడదు. డబ్బుతో నిమిత్తం లేకుండా వైద్యం జరిగిపోవాలి. డబ్బు అదే వస్తుంది.”

“మరి నాలాంటి వాడి గతి ఏమిటి కావాలండి. బోలెడంత డబ్బు గుమ్మరించి చదువుకున్నాను.”

“చూడవోయ్. నేను ఈ వూళ్ళో నలభై ఏళ్ళ బట్టి హౌమియోపతీ వైద్యం చేస్తున్నాను. ఎప్పుడూ ఎవ్వరినీ ఒక్క చిల్లి గవ్వ ఇమ్మని అడగలేదు. ఇచ్చిన వాళ్ళు ఇచ్చేరు. ఇవ్వని వాళ్ళు ఇవ్వ లేదు. నిజానికి ఉన్న వాళ్ళల్లోనే మందు పుచ్చుకుని ఉడాయించిన వాళ్ళు ఎక్కువ. లేని వాళ్ళే తృణమో పణమో ఎప్పటికప్పుడు నా చేతిలో పెట్టే వారు. నేను వైద్యం చేసి గొప్పవాణ్ణి అవలేదు. కాని నాకీ ఊళ్ళో ఉన్న పరపతి ఎంతో తెలుసా?” సగర్వంగా ప్రశ్నించేరు, రామేశం.

“మీరు మెడికల్ కాలేజీకి వెళ్ళి బోలెడు డబ్బు ఖర్చు పెట్టలేదు కనుక మీరు “ఫ్రీ” గా వైద్యం చేసినా మీకు గిట్టుబాటు అయింది. మరి…”

“అలాగే! నీ కోణం నుండే చూద్దాం. మన ఊళ్ళో సుబ్బారాయుడు డాక్టరు గారిని తెలుసు కదా. నీలాగే ఆయన కూడా ఆంధ్రా మెడికల్ కాలేజీ లో గోల్డ్ మెడలిస్టు. ఇప్పుడంటే ఆయన పేరూ, ప్రతిష్ఠా ఈ జిల్లా అంతా పాకి పోయింది కాని, ఆయన కొత్తగా ఈ ఊళ్ళో ప్రేక్టీసు పెట్టినప్పుడు నీ లాగే చిన్న కుర్రాడు. ఆయన దమ్మిడీ అడిగి పుచ్చుకునే వాడు కాదు. ఎవరింటికి పిలచినా కాదనకుండా సొంత జటకాలో వెళ్ళే వాడు. జట్కా అద్దెగా జట్కా వాడే అర్ధ రూపాయి పుచ్చుకునేవాడు. ఎన్ని ఇళ్ళకి వెళితే అన్ని అర్ధలు. తనకి ఇవ్వ వలసిన ఫీజు ఇంత అని ఎప్పుడూ అడిగేవాడు కాదు. అయినా ఆయన ప్రేక్టీసు అవధులు లేకుండా పెరిగింది. ఆయన బంగారంతో మేడలు కట్టెయ్యలేదు కాని, బాగానే గణించేడు.”

“మీరు మీ వైద్యం అంతా స్వయంకృషితో నేర్చుకున్నదే అంటున్నారు కదా. ఈ మానసిక వైద్యంలో ఉన్న మెళుకువలు మీకింత బాగా ఎలా తెలిసాయండీ?”

“చూడు పరాంకుశం! హోమియోపతీ వైద్యం నిజానికి మానసిక వైద్యమోయ్. మేము మానసిక లక్షణాలకి బాగా ప్రాధాన్యత ఇస్తాం.

“అంతే కాకుండా “వైద్యులు విద్యార్థిగా నాలుగేళ్ళల్లో నేర్చుకున్న దాని కంటె హౌస్ సర్జన్ గా ఒక ఏడాదిలో ఎక్కువ నేర్చుకుంటారు” అనే నుడికారం ఎప్పుడు వినలేదుటోయ్! వైద్యానికి కావలసినది అనుభవం. పుస్తక పరిజ్ఞానం ఉండాలి. కాదనను. కాని అనుభవం నేర్పిన పాఠాలని మరచిపోలేము. అందుకనే ఎమ్. బి. బి. యస్. లు అరడజను మంది ఈ ఊళ్ళో బల్ల వేల్లాడదీసినా నా హోమియోపతీ ప్రేక్టీసుకి ఇంత వరకు ఢోకా రాలేదు.”

“అయితే మీరనేది ఇటువంటి కేస్ మీ అనుభవంలో ఇంతకు పూర్వం తగిలిందంటారు?”

“దరిదాపు పాతిక ఏళ్ళ కిందటి సంగతి. స్మృతిపథం లోంచి చెరిగిపోతూన్న సంఘటన. చాలమట్టుకు వివరాలు మరచిపోయాను. కాని కొన్ని ముఖ్యమైన అంశాలు మాత్రం రేఖామాత్రంగా మనస్సులో ఉండిపోయాయి. ఆ కేసుకీ ఈ కేసుకీ కొట్టొచ్చినట్టు పోలికలు ఉన్నాయి. కాలం మార్పుతో మనం వాడే భాష మారింది. చదువులతో మన దృక్పథం మారుతోంది. దానితో రోగనిర్ణయం మారినట్టు మనకి అనిపిస్తుంది.”

“ఆ కథ చెబుతారా?”

“ఇది కట్టుకథ కాదోయ్! నిజంగా జరిగిన సంఘటన. చెబుతాను విను.

“రామశాస్త్రి గారి కోడలికి దయ్యం పట్టింది.” అని మొదలుపెట్టేరు.

“రామశాస్త్రి గారు ఎవరండోయ్?” అంటూ పక్క గదిలోని నర్సు బిరబిరా వచ్చింది.

“నేను పిఠాపురంలో పని చేస్తూన్నప్పుడు రామశాస్త్రి గారి పక్కింట్లోనే మేము అద్దెకు ఉండే వాళ్ళం.”

పిఠాపురం పేరు వినగానే వీధి అరుగు మీద కూర్చుని లెక్కలు చూసుకుంటూన్న గోపాలం కూడా లోపలికి వచ్చేసేడు, కథ వినడానికి. ఆయన పిఠాపురం మనిషి.

"రామశాస్త్రి గారు బాగా పేరున్న సంస్కృత పండితుడు. ఆస్తిపరుడు. పిఠాపురంలో బాగా పలుకుబడి ఉన్న పెద్ద. కోడలికి దయ్యం పట్టిందని నలుగురి నోటా పడితే పరువు పోదూ? కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు. అలాగే దయ్యం పట్టిందన్న విషయం దాగదని శాస్త్రి గారు స్వానుభవం మీద తెలుసుకునే లోగా నన్ను సంప్రదించడానికి మన ఊరు వచ్చేరు."

"దయ్యం పడితే మీరేమి చెయ్య గలరండీ, భూతవైద్యుడి దగ్గరకి వెళ్ళాలి కానీ?" అన్నాడు గోపాలం.

"హోమియోపతీ మందు ఇచ్చి కుదర్చగలరా అని అడగడానికి వచ్చేరు."

"దయ్యం పడితే హోమియోపతీ మందేమిటండీ, ఎక్కడా వినలేదు. మీరు వెటకారం చేస్తున్నారు" అని నర్సు నవ్వాపుకోలేక మూతిని కొంగుతో కప్పుకొంది.

"అది దయ్యమని మొదట్లో ఆయనా అనుకోలేదు. ఉత్తరోత్తర్యా ఊళ్ళో ఉన్న పిల్లా పెద్దా, చిన్నా చితకా కలసి అది దయ్యమే అని తీర్మానించేరు."

"అప్పుడు మీరు ఆ దయ్యానికి – అదే ఆ దయ్యం పట్టిన కోడలికి – మందిచ్చి కుదిర్చేరు?"

నర్సు మాటలలోని వ్యంగ్యాన్ని గమనించి, "మందివ్వడం ఇచ్చేనమ్మా. దాని వల్లే కుదిరిందో మరో మంత్రం వల్ల కుదిరిందో నాకు తెలియదు. కాని ఇది నిజంగా జరిగిన విషయమమ్మా, నర్సమ్మా! ఇది ఆ రోజులలో నలుగురికీ తెలిసిన విషయమే. ఆఖరికి మహా కవి విశ్వనాథ సత్యనారాయణ గారు కూడ ఆయన రాసిన బాణావతి అన్న పుస్తకంలో ఈ విషయం క్లుప్తంగా ప్రస్తావించేరు."

ఈ దెబ్బతో నలుగురూ నమ్మకంగా వింటున్నారని నిర్ధారణ చేసుకుని, రామేశం గారు మళ్ళా అందుకున్నారు.

“నేను మందు ఇవ్వడం అంటే ఇచ్చేను గాని…తమాషా ఏమిటంటే ఆ దయ్యాన్ని ఒదలగొట్టుకునే ఉపాయం ఆ దయ్యమే చెప్పింది…..

“తన చేత కాశీ యాత్ర చేయించి, గంగలో స్నానం చేయించి, గయలో పిండప్రదానం చేయించి, ఇంకా ఏవేవో కర్మ కాండలు చేయిస్తే తను పార్వతిని ఒదిలి వెళ్ళిపోతానని పార్వతి నోటి ద్వారానే చెప్పింది, ఆ దయ్యం.

“నేనిచ్చిన మందు పని చేస్తుందని నాకు అంటే నమ్మకం ఉంది కానీ, కాశీ వెళ్ళి దయ్యాన్ని ఒదలగొట్టుకోవాలన్న కోరిక వారి ఇంటిల్లిపాదికీ ఉందని నేను గమనించి, కాశీ వెళ్ళినందువల్ల ఒరిగే నష్టమేముంటుందిలే అని “సరే అలాగే వెళ్ళి రండి” అన్నాను.

“రామశాస్త్రి గారు భార్య కామాక్ష్మమ్మతో పాటు కొడుకునీ, కోడలు పార్వతినీ వెంటపెట్టుకుని కాశీ యాత్ర చేసుకుని తిరిగి వచ్చేరు.”

వింటూన్న వాళ్ళకి కొంచెం నమ్మకం కలిగినట్టుంది. మధ్య మధ్యలో చొప్పదంటు ప్రశ్నలు వెయ్యకుండా కుదురుగా కూర్చుని వింటున్నారు. రామేశం గారు మళ్ళా అందుకున్నారు.

“కాశీకి వెళ్ళిన బృందంలో నాలుగు శాల్తీలు, ఒక దయ్యం ఉంటే, తిరిగొచ్చిన బృందంలో ఐదు శాల్తీలు ఉన్నాయి. దయ్యాన్నైతే సునాయాసంగానే ఒదలగొట్టుకున్నారు కానీ, ఆ దయ్యాన్ని ఒదలగొట్టించిన భూతవైద్యుణ్ణి ఒదలగొట్టించుకోలేకపోయారు, రామశాస్త్రి గారు. తను పార్వతి పక్కన లేకపోతే విడచి పెట్టిన దయ్యం మళ్ళా పట్టుకునే ప్రమాదం నికరంగా ఉందని – అతని పేరు మరచి పోయాను, కనుక కాశీశాస్త్రి అందాం – కాశీశాస్త్రి అందరికీ నచ్చచెప్పి ఒప్పించేడు. అప్పటినుండీ మనిషి మీద వేసిన కన్ను తియ్యకుండా, పగలనక, రాత్రనక, అహర్నిశలూ పారూని కనిపెట్టుకునే ఉన్నాడు కాశీ!

“ఏతా వాతా పార్వతి జబ్బు నయమయిందనీ, పార్వతి ఒక పిల్లని కూడా కన్నదనీ, దరిమిలా కాశీశాస్త్రి కాశీ ఉడాయించేసేడని కర్ణాకర్ణిగా విన్నాను.

“కాశీశాస్త్రి రామశాస్త్రి గారింట తిష్ట వేసిన కొత్తలో పార్వతి అన్నదమ్ముడికి ఒక విచిత్రమైన రుగ్మత వచ్చింది. రామశాస్త్రి గారికీ నాకూ ఉన్న సాన్నిహిత్యాన్ని పురస్కరించుకుని నన్ను సంప్రదించడానికి తొండంగి నుండి తుని వచ్చేడు.

“అతని పేరు మరచిపోయాను కానీ మనిషి మంచి స్ఫురద్రూపీ, ధృఢకాయుడూ. చెక్కి నిలబెట్టిన శిలావిగ్రహం లాంటి కాయవాటు శరీరం. శారీరకంగా కాని, మానసికంగా కాని ఏమీ లోపాలు ఉన్నవాడిలా కనపడ లేదు. ఏదో రాతకోతల వ్యవహారాలు మాట్లాడడానికి వచ్చి ఉంటాడనుకున్నాను. కాదు, మందు పుచ్చుకోడానికి వచ్చేనన్నాడు. సావకాశంగా కూర్చుని లక్షణాలు చెప్పమని అడిగేను.

“ఒకటే ఒక లక్షణం అన్నాడు. తను పరాగ్గా ఉన్నప్పుడు ఎవరో వెనకనుంచి వచ్చి కొట్టి పారిపోతూ ఉంటారుట.”

“ఎవరో కొడుతూ ఉంటే పోలీసుల దగ్గరకి వెళ్ళి ఫిర్యాదు చెయ్యాలి కాని వైద్యుడు మందేమి ఇస్తాడు?” అని గోపాలం తన అభిప్రాయం వ్యక్తం చేసేరు.

“నేనూ అలాగే అనుకున్నాను. కాని నా అనుభవంలో ఇలాంటి కథనాలు ఎన్నో విన్నాను. అందుకని మౌనంగా అతను చెప్పే విషయం ఓపిగ్గా వినడమే ఉత్తమ మార్గం అని అనిపించింది.

“అప్పుడు చెప్పేడు. ఆ కొడుతూన్న వ్యక్తి  ఒక ఆడ మనిషిట. ముఖం చూడడానికి ఎప్పుడూ అవకాశం చిక్కలేదుట. ఎవరా అని చూడడానికి ముఖం తిప్పేసరికి అక్కడ ఎవరూ కనిపించేవారు కాదుట.”

“ముఖం చూడకుండా ఆడ మనిషి కొడుతున్నాదని ఎలా చెప్పేడండీ?”

“గలగలమంటూ గాజులు తొడిగిన ముంజేయి, ఆ చేతిలో కత్తి స్పష్టంగా కనిపించేవిట!”

వింటూన్న అందరి ముఖాల్లోను కత్తి వేస్తే రక్తపు చుక్క లేదు.

"ఇలా చెపుతూ ఆ ఆసామీ ఉత్తరీయం తొలగించి తన ఎడమ చేతిని ముందుకు చాపి చూపించేడు. ఆ చేతి నిండా గాట్లు. కత్తి దెబ్బలకి పడ్డ గాట్లు!"

"ఎవరో అతనిని కత్తితో కొట్టేరన్నది నిర్వివాదాంశం. ప్రత్యక్షంగా నిదర్శనం కనిపిస్తోంది. ఆడ మనిషి గాజుల చేతులు కనిపించేయని చెబుతున్నాడు. పక్కకి వచ్చి కొట్టిన మనిషి అకస్మాత్తుగా ఎక్కడికి పోతుంది?" గోపాలం చిన్న విశ్లేషణ చేసేడు.

"ఆడ మనిషి, గాజుల చేతులు అనగానే నా అనుమానం మరొక పక్కకి దారి తీసింది, గోపాలం. అందుకని, ఆ దెబ్బలు ఇంట్లో ఉండగా తగిలేయా, నిద్రలో కాని తగిలేయా మొదలైన విషయాలు కొన్ని వాకబు చేసేను. ఇంట్లోనే మరొకరెవరైనా  కొడుతున్నారేమోనని నా అనుమానం. వాళ్ళ జాడ తెలిసికూడా కప్పెడుతున్నాడేమో."

"రోడ్డు మీద నడుస్తున్నప్పుడు, పెరట్లో పనులు చేసుకుంటూన్నపుడు, అలా ఒక వేళ అంటూ లేదుట. ఎప్పుడో ఒకప్పుడు ఆవిడ వచ్చి కొట్టి వెళ్ళిపోతూ ఉండేదని చెప్పేడు."

"పార్వతిని పట్టి వేధించిన దయ్యం ఇప్పుడు ఈ అన్నదమ్ముణ్ణి పట్టుకుందేమో"  అంది నర్సు.

"దయ్యాన్ని అదుపు ఆజ్ఞలలో పెట్టగల కాశీశాస్త్రి ప్రభావం ఏదైనా ఉందేమోనని నా అనుమానం" అని గోపాలం తన సిద్ధాంతాన్ని వెలిబుచ్చేడు.

"మీమీ పరిధులలో మీరిద్దరూ ఒక విధంగా రైటే. శాస్తుర్లు గారింట దయ్యం సంగతి ఊరూ వాడా అంతా తెలుసేమో ఇది మరొక దయ్యం అయుంటుందని సరిపెట్టుకున్నారు చాలమంది. మరొక కాశీ యాత్ర చేస్తే దీనిని కూడా ఒదుల్చుకో వచ్చని కొందరు ఉచితంగా సలహా కూడా ఇచ్చేరు.

మరొక కాశీ యాత్ర చెయ్యడం అస్సలు మంచి పని కాదనీ, శాస్త్రిగారింటికి వచ్చిన దయ్యాలన్నిటిచేతా కాశీ యాత్ర చేయించి విముక్తి ప్రసాదిస్తారన్న వార్త నాలుగు మూలలకీ పాకిందంటే దేశంలో ఉన్న దయ్యాలన్నీ వీరి ముంగిట్లోనో, చూరులోనో వేల్లాడుతూ ఉంటాయని రాజకీయాలలో ప్రవేశం ఉన్న వాళ్ళు ఆరాట పడ్డారు.

"కాశీ యాత్ర ప్రస్తావన వచ్చినప్పుడల్లా కాశీశాస్త్రి గుర్తుకు వస్తున్నాడనీ, ఆ ఆషాడభూతి పేరు తన ఎదురుగా చెప్పవద్దనీ కోపంతో ఒంటి కాలిమీద లేచిపోయేవాడుట ఈ పార్వతి అన్నదమ్ముడు.

"ఈ కథనం అంతా విన్న తర్వాత ఇది మానసిక రోగమో, దయ్యమో అప్పట్లో పూర్తిగా అర్థం కాలేదు. అదృష్టవశాత్తూ హోమియోపతీలో రోగానికో పేరు, లక్షణానికో మందు అంటూ ఏమీ లేదు. మేము మనిషి మానసిక ప్రవృత్తినీ, మనిషి నైజాన్ని చూసి మందు ఇస్తాము. అంటే 'వుయ్ ట్రీట్ ద పేషెంట్ నాట్ ద డిసీజ్' కనుక అప్పుడు నాకు తోచిన మందు ఇచ్చి పంపించేను."

"అయితే ఇప్పుడు అర్థం అయిందంటారా?" గోపాలం అడిగేడు.

"ఇప్పుడు ఈ కామాక్షిని చూసిన తరువాత పార్వతి అన్నదమ్ముడికి పట్టిన దయ్యమేమిటో మరికొంచెం బాగా అర్థం అవుతోంది."

"ఈ రకం మానసికమైన జబ్బులు కొన్ని సంసారాలలో వంశానుగతంగా వస్తూ ఉంటాయిట. ఒకరి వంశంలో ఒక సారి వచ్చిందంటే, అదే వంశంలో మళ్ళా జబ్బు లక్షణాలు కనిపించడానికి సావకాశాలు ఎక్కువట. మిగిలిన సంసారాలతో పోల్చి చూస్తే ఒకసారి కనిపించిన కుటుంబాలలో ఈ జబ్బు ఐదింతలు ఎక్కువగా వస్తుందిట." ఏదో పుస్తకం పట్టుకొచ్చి అందులో చూసి చదువుతున్నాడు పరాంకుశం.

"ఏదీ కామాక్షిని మరొకసారి ఇటు రమ్మని పిలుద్దామా? ఆ అమ్మాయి పుట్టుపూర్వోత్తరాలు కనుక్కుందికి మరొక రెండు ప్రశ్నలు అడిగి చూడొచ్చు."

కామాక్షి మళ్ళా గదిలోకి వచ్చింది. రామేశం గారు చూపించిన కుర్చీలో కూర్చుంది. కామాక్షి ముఖంలో తను ఎప్పుడో ఎక్కడో చూసిన మనిషి పోలిక ఇప్పుడు మరికొంచెం స్ఫుటంగా కనిపించసాగింది.

" అమ్మా మీది ఏ ఊరు?"

"పితాపురం."

"మీ ఇంటిపేరు ఏమిటమ్మా?"

చెప్పింది.

ఈ సమాధానంతో రామేశం గారి దవడలో పట్టు తప్పిపోయి కిందికి వేలాడిపోయింది.

"పితాపురంలో రామశాస్త్రిగారనే పండితుడొకాయన ఉండేవారు. ఆయన ఎవరో తెలుసా?"

"ఆయన మా తాతగారు."

"అయితే నువ్వు పార్వతి కూతురివా?"

"అవును."

"మీ మావయ్య ఒకాయన ఉండేవాడు కదూ?"

"మా మావయ్యే మీకు చూపించుకోమని పంపేడు."

అమ్మాయి మోచేతిమీది కుట్లని మరోసారి పరీక్షిస్తూ, "నువ్వు ఇక్కడ రెండు రోజులు మా పర్యవేక్షణలో ఉండమ్మా. పరాంకుశం గారు స్పెషలిస్టుకి చూపించే ప్రయత్నాలు చేస్తారు" అంటూ కుర్చీ లోంచి లేచి, "పరాంకుశం, కుట్లు బాగా వేసేవయ్యా. గుడ్ వర్క్" అని పరాంకుశాన్ని ఒక సారి పొగిడి పెరటి భాగంలో ఉన్న పడక గదికి దారి తీసేరు.

**కథ వెనుక కథ:**

ఈ  కథలోని సంఘటనలు కొన్ని నిజంగా పిఠాపురంలో జరిగినవే.

సెప్టెంబరు 2000 ఈమాట  అంతర్జాల పత్రికలో ప్రచురితం

http://eemaata.com/em/issues/200009/795.html

రచన అక్టోబరు 2002 లో ప్రచురితం.

# దొమ్మీ

'సైరను' ఊదుకుంటూ వచ్చి, కీచుమని శబ్దం చేస్తూ 'అంబులెన్సు' ఆసుపత్రి ప్రాంగణంలో ఆగింది. అంబులెన్సులో ఉన్న 'పెరామెడిక్' లు పరుగుతో ఎదురుసన్నాహం వచ్చిన నర్సుల సహాయంతో క్షతగాత్రి పడుక్కుని ఉన్న 'స్ట్రెచర్' ని బయటకి దింపి, "ట్రామా, ట్రామా' అంటూ 'ఎమర్జెన్సీ గదిలోకి వచ్చేరు.

గ్రీకు భాషలో 'ట్రామా' అంటే గాయం అని అర్థం. ఈ మాట ఇంగ్లీషులోకి యథాతథంగా దిగిపోయింది. సామాన్యులం 'ఇంజరీ' అనీ, 'ఊండ్' అనీ అంటాము, వైద్యులు పరిభాషలో 'ట్రామా' అంటారు. ఈ మాటకి 'బలమైన గాయం' అని తెలుగులో అర్థం చెప్పుకోవచ్చు. రైలు ప్రమాదాలలోను, విమాన ప్రమాదాలలోను, కత్తిపోట్ల వల్లా, తుపాకి దెబ్బల వల్లా, దొమ్మీలలోనూ బలంగా తగిలిన దెబ్బలు ఒక రకమైన భౌతిక ట్రామా. మనస్సుకి గట్టిగా దెబ్బ తగిలితే అది మానసిక ట్రామా.

అమెరికాలో ఉన్న చాల ఆసుపత్రులలో 'ఎమర్జెన్సీ వార్డు' అనే భాగం ఉంటుంది. ప్రాణాపాయ స్థితిలో ఉన్న వ్యక్తులని ఇక్కడకి తీసుకువచ్చి, ప్రథమ చికిత్స చేసి తరువాత ఆసుపత్రిలో చేర్చుకోవడమో, ఇంటికి పంపెయ్యడమో చేస్తారు ఇక్కడ. ప్రాణాపాయ స్థితికి కారణాలు అనేకం ఉండొచ్చు. పాము కాట్లు, విషం మింగుడు, హృద్రోగం, తుపాకి దెబ్బలు, ఇలా రకరకాల ఇబ్బందులతో ప్రజలు ఇక్కడకి వస్తూ ఉంటారు. కొన్ని పెద్ద ఆసుపత్రులలో ఎమర్జెన్సీ వార్డుని రెండు భాగాలుగా విడగొడతారు: జబ్బు చేసిన వారికి శుశ్రూష చేసే విభాగాన్ని వైద్య కేంద్రం అనిన్నీ, దెబ్బలు తగిలిన వారికి శస్త్ర చికిత్స చెయ్యవలసిన అవసరం తరచుగా వస్తుంది కనుక క్షతగాత్రులకి సంరక్షణ చేసే విభాగాన్ని ట్రామా కేంద్రం అని అనడం మొదలుపెట్టేరు. టూకీగా చెప్పాలంటే ట్రామా అంటే శస్త్ర చికిత్సతో పని, మెడికల్ అంటే మందులతో పని.

క్షతగాత్రిని లోపలికి తీసుకురావడమేమిటి, ఎమర్జెన్సీ వార్డులో ఉన్న డాక్టర్లు, నర్సులు, వెంటనే మనిషిని స్ట్రెచర్ మీదనుండి బల్ల మీదకి మార్చి, చుట్టూ గుమిగూడమేమిటి అంతా క్షణాలలో జరిగిపోయింది.

“ఏమిటి జరిగింది?” మెళ్లో ఉన్న స్టెతస్కోపుని సవరించుకుంటూ అడిగేను.

“సూపర్ బజారు దగ్గర చిన్న దొమ్మీ జరిగిందిటండి. అందులో ఈ పెద్దావిడ కాలు నిలదొక్కుకోలేక కింద పడిందిటండి. పడ్డ మనిషి మరి లేవలేదండి. కూతురు పక్కనే ఉందిటండి. షాపు తలుపులు తెరవగానే జనసందోహం ఇలా ఒక పెద్ద కెరటంలా ముందుకు తోసుకు వచ్చి ఈమెని ఒక తోపు తోసిందిటండి. మనిషంటే కింద పడిపోయింది కాని, పైకి ఏమీ దెబ్బలు కనబడటం లేదండి. మనిషికి స్పృహ తప్పి అరగంట కావస్తోందండి. ఉలుకు లేదు. పలుకు లేదు. అలా మానులా పడుందండి…”

“…ఇది స్ట్రోకు. దీనికి సర్జరీ అవసరం లేదు. పక్కనున్న మెడికల్ వార్డు లోకి తీసుకెళ్లండి….” పక్కింటి పిన్ని గారి కంటె ఒక వాసి ఎక్కువ వెడల్పుగా ఉన్న నల్ల నర్సు విల్మా తీర్మానించింది. మనిషి ఆకారం, వాలకం చూడగానే అందరి మీదా పెత్తనం చెలాయించే పెద్ద నర్సు అని ఎవ్వరైనా అనుకుంటారు. కాని నిజానికి ఈ విమలమ్మ పెద్ద నర్సు కింద పని చేసే చిన్న నర్సు. అసలు పేరు విల్మా కాని నేను మాత్రం విమలమ్మ అని తెలుగు పేరు పెట్టి పిలచేవాడిని. ఏం? మన దేశంలో ఈ తెల్లవాళ్లు వచ్చి మన పేర్లన్నిటినీ వాళ్లకి అనుకూలంగా మార్చేసింది లేదు కాని నేనేనేమిటి తక్కువ తిన్నాను?

“ఆ, మరీ చెప్పొచ్చావ్! సరిగ్గా దొమ్మీ జరిగే వేళకే ఈవిడకి వాతం కమ్మి మస్తిష్ఘాతం వచ్చిందంటావా?” అంటూ అంబులెన్సు తోలుకొచ్చిన ఆసామీ విమలమ్మతో లడాయి వేసుకున్నాడు. అమెరికాలో అంబులెన్సు డ్రైవర్లకి కూడ ప్రథమ చికిత్సలో తరిఫీదు ఉంటుంది. అందుకని తనకి తెలుసున్న విషయం తను చెప్పేడు.

స్ట్రోకు (మస్తిష్ఘాతం) ప్రమాదకరమైన పరిస్థితి. దీనివల్ల పక్షవాతం రావచ్చు. వెంటనే చికిత్స చెయ్యకపోతే కాలో, చెయ్యో కదలకుండా పడిపోవచ్చు. మాట పడిపోవచ్చు. లేకపోతే శరీరం అంతా తోటకూరకాడలా వేల్లాడి పోవచ్చు. ప్రాణం పోవచ్చు. కనుక ఇక్కడ నర్సులూ, డ్రైవర్లూ తగువులాడుకుంటూ ఉంటే ఎటూ తేల్చకుండా ఊరుకుందుకి ఇది ఐక్యరాజ్య సమితి కాదు కదా. అందుకని నేనే కలుగజేసుకుని అన్నాను.

“చాల్చాలు. ఇక్కడ హయాంలో ఉన్న వైద్యుణ్ణి నేను. ఇది మెడికల్ కేసో, సర్జికల్ కేసో నేను తేల్చుతాను. ఈ వేళ ట్రామా విభాగంలో కేసులు ఎక్కువ లేవు. కనుక ట్రామా గదిలోకి తీసుకెళ్ళండి.”

అని ఉత్తర్వు జారీ చేసి, నర్సు విమలమ్మ వైపు తిరిగి సముదాయింపుగా అన్నాను, "ప్రస్తుతానికి ట్రామా అనుకున్నంత మాత్రాన ఒరిగే నష్టం ఏమీ లేదుగా. పేషెంటు రికార్డుని రాయడం పూర్తి చెయ్యండి ముందు. జీవలక్షణాలు – నాడి, తాపోగ్రత, శ్వాస, రక్తపు పోటు, కొలిచి నమోదు చెయ్యడం, పరీక్ష నిమిత్తం రక్తపు మచ్చు తియ్యడం, వగైరా తంతు కానివ్వండి. మధ్యంతరంగా ఆపేసిన ఆ చంటాడి చెవి పోటుకి కారణం ఏమిటో తేల్చుకుని నేను ఇప్పుడే తిరిగి వస్తాను," అని సగం సగం చూస్తూ, మధ్యలో పరీక్ష ఆపేసి పరుగెత్తుకొచ్చిన నేను తిరిగి మళ్లా చెవి పరీక్షకని వెనక్కి వెళ్లేను. తిరుపతిలో మంగలివాడు క్షవరం చెసే తీరు నేను ఎప్పుడూ చూడలేదు కాని, మా ఎమర్జెన్సీ వార్డులో చేతులు తక్కువగా ఉన్నప్పుడు మేము ఒక కేసు నుండి మరొక కేసుకి గెంతుతూ ఉంటే ఆ సామెతే గుర్తుకి వస్తూ ఉంటుంది.

చెవి పేషెంటుని చూసుకుని తిరిగొచ్చేసరికల్లా నర్సులు దొమ్మీలో పడిపోయిన పేషెంటుని చకచకా తయారు చేస్తున్నారు. ఉపతాపి చైనా దేశపు మనిషి. కూతురే తల్లి తరఫున అడిగిన ప్రశ్నలకి సమాధానాలు చెబుతోంది.  తల్లి పేరు చెంగు. మధ్య మధ్యలో తల్లి చెవిలో ఏదో చైనా భాషలో మాట్లాడుతోంది. కాని తల్లి ముఖ కళవళికలలో లేశమంత మార్పు లేదు. నిశ్చలంగా, నిశ్చింతగా నిద్రపోతూన్నట్లున్న ఆ మనిషి బతికుందో లేదో కూడ ఆ ఆడ కూతురుకి తెలియదు.

రోగిని ఎగా దిగా మరొక సారి చూసిన తరువాత మా విమలమ్మ చెప్పిన మస్తిఘాతం సిద్ధాంతమే నిజమేనేమోనని నాకు కూడ అనిపించింది. ఈ నర్సులని అంత తేలికగా తీసి పారెయ్యడానికి వీలు లేదు. వైద్యులకి  పుస్తకం గురువైతే ఈ నర్సులకి అనుభవం గురువు. పైకి ఏమీ అనకపోయినా మస్తిఘాతం అంటే ఏమిటో మరొకసారి మననం చెసుకున్నాను.

ఈ మస్తిఘాతాన్నే ఇంగ్లీషులో స్ట్రోకు అంటారు. మెదడుకి రక్తం సరఫరా చేసే నాళాలు ప్రమాదవశాత్తూ పగిలినా, లేదా నాళంలో ప్రమాద వశాత్తూ ఏదయినా అడ్డం పడ్డా, మెదడుకి కావలసిన మోతాదులో రక్తం అందదు. ఈ సందర్భంలో మెదడుకి కలిగే అపాయమే మస్తిఘాతం – అనగా మెదడు దెబ్బ తిన్నాదని అర్థం. ఈ మస్తిఘాతంలో రకాలు ఉన్నాయి. పిత్తఘృతాల్ (దీనినే ఇంగ్లీషులో కోలెస్టరాల్ అంటారు) వంటి మైనపు జాతి పదార్థాలు రక్తనాళపు గోడల లోపల చేరినప్పుడు ఆ నాళాలు సన్నబడి, ఆ రక్త ప్రవాహం ఆగిపోతే దానిని "థ్రాంబోసిస్"  అంటారు. నాళం పగిలి రక్తం మెదడులోకి చిమ్మితే

దానిని 'సెరిబ్రల్ హెమరేజి' అని కాని ఉత్తనే 'హెమరేజి' అని కాని అంటారు. రెండూ ప్రమాదకరమైన పరిస్తితులే కాని, గుడ్డిలో మెల్లలా థ్రాంబోసిస్ కొంచెం మెరుగు. ఎందువల్లనంటే థ్రాంబోసిస్ వల్ల స్పృహ తప్పిపోవడం అనేది సాధారణంగా జరగదు. ఈ రెండింటికి మధ్య తేడా అర్థం అవాలంటే శరీరనిర్మాణశాస్త్రం కొద్దిగా తెలియాలి.

బల్ల మీద ఉన్న మన చెంగమ్మ గారు చాల లోతైన నిద్రలో ఉన్నారు. ఇలాంటి నిద్రని 'కోమా' అంటారు. గ్రీకు భాషలో కోమా అంటే ఘాటైన నిద్ర. తెలుగులో 'దీర్ఘనిద్ర' అంటే చావు అనే అర్థం ఉంది కనుక కోమాని 'ఘాటునిద్ర' అనొచ్చు – ఘాటు ప్రేమలా. ఘాటు ప్రేమ ఎలా గుడ్డిదో అలాగే 'ఘాటునిద్ర' లో పడ్డ వారి జ్ఞానేంద్రియాలకి మూతలు పడిపోతాయన్నమాట. ఈ రకం ఘాటునిద్రలో ఉన్న వారి పక్కన బాంబు పేల్చినా ఆ శబ్దానికి మెలుకువ రాదు.

కపాలంలో బంధించబడి ఉన్న మెదడుకి జ్ఞానేంద్రియాలు కిటికీల లాంటివి. చుట్టూ జరుగుతూన్న విషయాలని జ్ఞానేంద్రియాలు సేకరించి, వాటిని విద్యుత్ వాకేతాలుగా మార్చి. పెద్ద మెదడుకి పంపుతాయి. ఈ పెద్ద మెదడునే ఇంగ్లీషులో 'సెరిబ్రం' అంటారు. ఈ పెద్ద మెదడే మన స్మృతి స్థావరం. ఈ పెద్ద మెదడే శరీరం ఎప్పుడెప్పుడు ఏమేమి చెయ్యాలో ఆదేశిస్తూ ఉంటుంది. ఈ ఆదేశాలని చిన్న మెదడు ఆచరణలో పెడుతుంది. ఈ చిన్న మెదడుని 'సెరిబెల్లం' అంటారు. ఈ చిన్న మెదడుని ఆనుకుని మేధాకాండం తోకలా కిందికి దిగి వెన్నుపాము అవుతుంది. ఈ వెన్నుపాము నుండి నరాలు శరీరం అంతా వ్యాపించి మెదడు దగ్గర బయలుదేరిన వాకేతాలని కండరాల వరకు మోసుకు పోతాయి.

చిన్న మెదడు, మేధాకాండం కలుసుకున్న సంగమస్థానంలో ముచ్చికలాంటి కట్టడం ఒకటి ఉంది. చేపలు, పురుగులు, మొదలైన అల్పజీవులలో ఈ ముచ్చిక మాత్రమే ఉంటుంది; మెదడంటూ ఏమీ ఉండదు; మనకి మల్లే అర్థభాగాలూ ఉండవు. ఈ మేధాకాండాన్ని ఇంగ్లీషులో 'బ్రెయిన్ స్టెం' అంటారు. ఈ మేధాకాండం వెల్లి మన మెదడులోని అర్థ భాగాలని అతుక్కునే దమ్మిడీ అంత మేరని ఇంగ్లీషులో 'రెటిక్యులార్ ఏక్టివేటింగ్ సిస్టం' అంటారు. లేదా టకీగా ఆర్. ఏ. యస్. అంటారు. ఇది మెదడులో ఒక మీటలా పనిచేస్తుంది; ఇది మెదడుకి ఒక 'మెయిన్ స్విచ్' లాంటిది అన్నమాట. ఇది దెబ్బ తింటే దీపం ఆరిపోయినట్లే. అప్పుడు స్పృహ తప్పిపోతుంది. ఈ మీట సరిగ్గా మన కళ్ల వెనకాతల

ఉంటుంది. కనుక మెదడులో జరిగిన రక్తస్రావం వల్ల ఈ మీట దెబ్బ తింటే ఆ విషయం  కళ్లు పరీక్ష చేసి కనుక్కోవచ్చు.

ఈ సందర్భంలో నా చిన్నతనంలో నేను చూసిన ఒక సంఘటన ఇప్పటికీ నాకు కళ్లకి కట్టినట్లు జ్ఞాపకం వస్తోంది. మా పెరటి వీధిలో ఉన్న చొక్కాకుల తాతకి సుస్తీ  చేసింది. అందరూ పెదవి విరిచేసేరు. మనిషిని మంచం మీంచి కిందకి దింపేసి, నేల మీద పడుక్కోబెట్టేసి అంతా ఘొల్లుమన్నారు. శ్మశానానికి తీసుకెళ్లడానికి పాడెని కట్టే ప్రయత్నంలో ఉన్నారు. ఈ లోగా మా ఊళ్లో కొత్తగా బల్ల వేల్లాడదీసి 'ప్రేక్టీసు'  పెట్టిన చల్లా సుబ్బారాయుడు జట్కాలో అటే వెళ్ళడం ఎవరో చూసి, ఎందుకైనా మంచిదని జట్కాని ఆపు చేసి, ఆయనని తాత దగ్గరకి తీసుకు వచ్చేరు. డాక్టరు తాత కనురెప్పలని ఒక చేత్తో వెనక్కి లాగి, రెండవ చేత్తో కంట్లోకి టార్చిలైటు వేసి, చూసి, ఏదో ఇంజక్షన్ ఇచ్చి పక్కని పది నిమిషాలు కూర్చున్నారు. నిద్దట్లోంచి లేచినట్లు చొక్కాకుల తాత లేచి కబుర్లు చెప్పడం మొదలు పెట్టేడు. ఈ చోద్యం చూసినప్పుడు నాకు పట్టుమని పదేళ్లు కూడా ఉండి ఉండవు. ఇటువంటి సంఘటనలు రెండు, మూడు జరిగిన తరువాత చల్లా  సుబ్బారాయుడి గారి హస్తవాసికి తునిలో తిరుగు ఉండేది కాదు.

(మనలో మన మాట. దరిదాపు ఇటువంటి సంఘటనే 20 అక్టోబరు 1988 లో, పుట్టపర్తిలో, విజయదశమి నాడు సత్య సాయిబాబా ఎదుట జరిగిందిట. బొంబాయి ఐ. ఐ. టి. మాజీ డైరక్టరు, బ్రిగేడియర్ ఎస్. కె. బోసు నామధేయుడు వి. ఐ. పి. ల  కొరకు ప్రత్యేకించిన కుర్చీలలో కూర్చుని, పూర్ణాహుతిని తిలకిస్తూ, తటాలున నేల మీదకి ఒరిగిపోయి 'ప్రాణాలు వదలి పెట్టేరు'  ట. అదే సమయంలో, లోపల, హాలులో, జనసందోహానికి విజయదశమి సందేశం ఇస్తూన్న బాబా మధ్యలో ఆగి, పరుగున బయటకు వచ్చి, బోసు చెయ్యి పట్టుకుని, లేవమన్నారుట. "చచ్చిన బొందిలో ప్రాణం పోసేరు"  అని స్వహస్తాలతో రాసి, సంతకం పెట్టిన ఉత్తరం ప్రతిని, ఐ. ఐ. టి. లో విశ్రాంత భౌతిక శాస్త్ర ఆచార్యుడైన శ్రీ జి. గురునాధం ఈ కథా రచయితకి పంపేరు.)

హస్తవాసి వల్లో, బాబా కృపా కటాక్షాల వల్లో, ఎలాగో ఒకలాగ చెంగమ్మ బతికి బయట పడితే చాలనుకుంటూ, చెంగమ్మ కళ్లు రెండూ పరీక్ష చేసి ప్రతివర్తితలు ఎలా ఉన్నాయో గమనించేను. ఏమీ కదలిక కనిపించ లెదు. 'రెటిక్యులార్ ఏక్టివేటింగ్ సిస్టం'  దెబ్బ తిని ఉండకపోతే చెంగమ్మ పరిస్థితి

ఇంత అధ్వాన్నంగా ఉండదని మనస్సులో ఒక అనుమానం పీడిస్తోంది. మరొక పరీక్ష  చేసి చూడాలి. అందు నిమిత్తం కుడి చేతి బొటన వేలి తోటీ, చూపుడు వేలు తోటీ చెంగమ్మ కను రెప్పలు విడదీసి, ఎడం చేత్తో ఆమె బుర్రని ఇటూ, అటూ ఆడించి చూసేను. ఈ పరీక్షని 'బొమ్మ  కళ్ల ప్రతివర్తిత పరీక్ష' (డాల్స్ ఐ రిఫ్లెక్స్) అంటారు. బుర్రని కదిపినప్పుడల్లా మన అంతర్ కర్ణాలలో ఉన్న సంతులన యంత్రాంగం ఆ కదలికని గ్రహించి, బుర్ర కదులుతున్నాది సుమా అన్న వాకేతాన్ని మెదడుకి పంపుతుంది. వెంటనే ఆ కదలికకి విరుగుడుగా మన మెదడు కంటి గుడ్లని రెండో పక్కకి తిప్పుతుంది. చిన్న పిల్లలు ఆడుకునే బొమ్మలు కళ్లని ఇలానే తిప్పుతాయి. ఇది ఇలా జరగక పోతే మనం తల ఆడించినప్పుడల్లా చుట్టూ ఉన్న ప్రపంచం గుండ్రంగా తిరుగుతూన్నట్లు అనిపిస్తుంది. ఈ కార్యక్రమానికి సంబంధించిన వాకేతాలన్నీ కూడా మన కూడలి కేంద్రమైన 'రెటిక్యులార్ ఏక్టివేటింగ్ సిస్టం'  గుండా వెళ్లాలి.  ఈ కేంద్రం దెబ్బ తింటే "బొమ్మ కళ్ల ప్రతివర్తితలు"  ఉండవు. నేను అనుకున్నంత పనీ అయింది. చెంగమ్మ కళ్లల్లో ఏ రకమైన కదలికా కనిపించలేదు.

నా ముఖం కత్తివేటుకి నెత్తురు చుక్క లేనట్లు పాలిపోయి ఉండాలి. నా ముఖ కళవళికలు చదువుతూన్న చెంగమ్మ కూతురు ఆత్రుతతో అడిగుతోంది.

"డాక్టర్! మా అమ్మకి మరేమీ పరవా లేదు కదా."

"మీ అమ్మ పరిస్థితి…." నా వాక్యం అర్ధాంతరంగా ఆపేసి, నర్సుని ఎలుగెత్తి కేకేసేను.

"ఈమెకి అర్జంటుగా సి. టి. స్కేను తీయించాలి. మేడ మీదకి పంపే  ఏర్పాట్లు చేయించు," అని ఒక హుకుం జారీ చేసి, సి. టి. స్కేను అంటే ఏమిటో చెంగమ్మ కూతురుకి చెప్పే మిషతో మాట మార్చి,

"చూడమ్మా! సి. టి స్కేను అంటే మరేమీ కాదు. అదొక రకం ఎక్స్ రే అనుకో. ఎక్స్ రే అంటే సాధారణంగా ఒకటో, రెండో ఫొటోలు తీస్తారు. సి. టి స్కేన్ అంటే ఎక్స్ రే  సినిమా అనుకో. మీ అమ్మ మెదడుకి ఎక్స్ రే  కిరణాలతో బోలెడు ఫొటోలు తీస్తారు. కంప్యూటరు సహాయంతో ఆ ఫొటోలని చదువుతారు. అందుకే  ఈ పద్ధతిని 'కంప్యూటెడ్ టోమోగ్రఫీ'  అని కాని, ముద్దుగా 'సి.టి.' అని కాని, 'సి.టి. స్కేను'  అని కాని అంటారు. ఇందులోనే మరొక రకం పద్ధతిని 'కంప్యూటెడ్ ఏక్సియల్

టోమోగ్రఫీ' అని కాని, ముద్దుగా 'సి. ఎ. టి.' అని కాని, ఇంకా ముద్దుగా 'కేట్ స్కేను' అని కాని అంటారు. ఈ పద్ధతిలో……"

ఆ వాక్యం పూర్తి అవకుండానే ఎమర్జెన్సీ వార్డు లోకి ఏదో కొత్త కేసు వచ్చింది చూడడానికి రమ్మని పిలుపు వచ్చింది. పెల్లుబికి వస్తూన్న దుఃఖాన్ని ఆపుకుంటూన్న చెంగమ్మ కూతురినే ఓదార్చేదా, కొత్తగా వచ్చిన పేషెంటునే చూసేదా?

కొత్తగా వచ్చిన రోగికి డెబ్బై ఏళ్లు ఉంటాయేమో. స్నానాల గదిలో కాలు జారిందిట. నుదిటి మీద గాయం గట్టిగానే తగిలినట్లు ఉంది. ముఖం అంతా రక్తసిక్తమై ఉంది. తుంటి ఎముక విరిగిందంటే ప్రాణాపాయం కూడా. పెద్దాయన పరిస్థితి అదుపులోకి వచ్చేసరికి అరగంట పైగా పట్టింది.

మిగిలిన ఫనిని 'ఇంటర్న్' కి (అమెరికాలో ఇంటర్న్ అంటే మన దేశంలో హౌస్ సర్జన్ తో సమానం) అప్పగించి, సి. టి స్కేను తతంగం ఎంతవరకు వచ్చిందో కనుక్కుందామని మేడ మీద ప్రయోగ శాలలో పనిచేసే మా సాంకేతిక నిపుణుడు రాబర్ట్ కి ఫోను చేసేను.

"ఇంకా పని పూర్తి కాలేదు. చూసిన మేరకి బ్రెయిన్ స్టెం దగ్గర రక్తం చిమ్మినట్లు కనిపిస్తోంది. సారీ డాక్టర్! ఈ రోజు చెడ్డ వార్త చెప్పవలసి వచ్చింది."

తల్లి చచ్చిపోతోందని కూతురుకి చెప్పడం ఎలా? ఆ పిల్లకా ఇంగ్లీషు సరిగ్గా రాదు. అర్థం అవడం లేదు. ఎందుకైనా మంచిది, ఆ సిటీ స్కేను బొమ్మలేవో నేనే స్వయంగా ఒక సారి చూసి అప్పుడు చెబితే మంచిదని ఎలివేటర్ దగ్గరికి వెళ్లి, గోడ మీద మీట నొక్కి నిరీక్షిస్తున్నాను. ఎలివేటరు వచ్చింది. నేనూ లోపలికి వెళ్లబోతూ ఉంటే మా విమలమ్మ బయటకు వస్తూ తారసపడింది.

"డాక్టర్ రావ్!, చెంగుకి సిటి స్కేను అయిపోయింది. వరండాలోనే వేచి ఉంది. విశేషం ఏమిటో తెలుసా? చెంగుకి పూర్తిగా మెలుకువ వచ్చేసింది. తల్లీ, కూతురూ చిలకల్లా మాట్లాడుకుంటున్నారు."

"అసంభవం. చెంగమ్మకి బొమ్మ కళ్లు లేవు. సిటి స్కేను ఫొటోలలో రాబర్ట్ కి రక్తం కనబడింది. ఈ రోగికి మెలుకువ రావడమా? అసంభవం."

"డాక్టర్ రావ్! మీ వైద్య సిద్ధాంతాలని నమ్మమంటారా? నా కళ్లని నమ్మమంటారా? మీరే చూడండి!" అంటూ చెంగమ్మ పడుక్కున్న మంచం వైపు చూపించింది.

నా కళ్ళని నేనే నమ్మలేకపోయాను. ఈమెలో బొమ్మ కళ్ల ప్రతివర్తితలు ఎందుకు కనిపించలేదు? బ్రెయిన్ స్టెం లో రాబర్ట్ కి రక్తపు డాగులు ఎందుకు కనిపించేయి? ఎవరు ఎక్కడ పప్పులో కాలేసేరా అని పరిపరి విధాల పరిగెడుతూన్న నా ఆలోచనలకి అంతరాయం కలిగిస్తూ, "హార్ట్ ఎటాక్! హార్ట్ ఎటాక్!" అనుకుంటూ ఒక నడి వయస్సులో ఉన్న వ్యక్తిని లోపలికి తోసుకుంటూ వచ్చేరు.

"కదలండి. కదలండి!" అంటూ పెద్ద నర్సు అందరినీ అదమాయిస్తోంది.

యాంత్రికంగా అంతా హృద్రోగపు ఆసామీ చుట్టూ మూగేం. మనిషికి నలభై ఉంటాయి. శీతల స్వేదంతో నుదురు చెమ్మగా ఉంది. గబగబ ఇ. కె. జి. తీసి చూసేం. అది కచ్చితంగా హార్ట్ ఎటేకే. సందేహం లేదు.

హార్ట్ ఎటేక్ రాడానికీ, స్ట్రోకు రాడానికీ ఉండే కారణాలలో పోలికలు లేకపోలేదు. గుండెకాయకి రక్తం సరఫరా చేసే నాళంలో కదుం కట్టిన రక్తపు గడ్డ ప్రవాహానికి అడ్డు పడితే హార్ట్ ఎటేక్ వస్తుంది. కనుక హార్ట్ ఎటేక్ అంటే గుండెకి రక్తపు సరఫరా ఆగిపోవడం. మెదడుకి సరఫరా చేసే రక్తనాళంలో కదుం అడ్డు పడితే 'బ్రెయిన్ ఎటేక్' వస్తుంది; అదే స్ట్రోకు అంటే. హార్ట్ ఎటేక్ ని తెలుగులో గుండెపోటు అనిన్నీ హృద్ఘాతం అనిన్నీ అనొచ్చు. అదే విధంగా స్ట్రోకుని మెదడుపోటు అని కాని మస్తిఘాతం అనొచ్చు.

కనుక మస్తిఘాతం వచ్చిన వారికి ముందుగా చెయ్యవలసిన ప్రథమ చికిత్స ఏమిటంటే కరడు కట్టిన రక్తపు కదుం కరిగేలా చూడడం. దీనికి ప్రత్యేకమైన మందులు ఉన్నాయి. ఆ మందులని ఐ. వి. ద్వారా సిరలలోకి ఎక్కిస్తూ ఉండగా డాక్టర్ రంగనాథన్ డ్యూటీలోకి రావడం గమనించి, ఈ గుండె పోటు రోగిని అతనికి అప్పగించి, నేను మళ్లా మన చెంగమ్మ సి.టి. స్కేనుల బొమ్మలు స్వయంగా చూద్దామని 'రేడియాలజీ' విభాగానికి పరిగెట్టుకుంటూ వెళ్లేను.

ఎక్సురే బొమ్మలని సి.టి.స్కేను బొమ్మలని పరీక్షించే నిపుణుడిని 'రేడియాలజిస్టు' అంటారు. చెంగమ్మ సి. టి. స్కేను బొమ్మలు రేడియాలజిస్టుకి ఇచ్చి ఆమె అభిప్రాయం అడిగేను.

సి. టి. స్కేను బొమ్మలని చూసీ చూడగానే, “ఇది సెరిబెల్లార్ హెమరేజి. సందేహం లేదు. రక్తస్రావం రెండు, మూడు సెంటీమీటర్ల మేర వ్యాపించిపోయింది….”

“…ఇది సెరిబెల్లారా? కొంప ములిగిందమ్మా” అని ఒక్కసారి కేకేసినట్లు అరచి, ఒక్క ఉదుటున పెద్ద పెద్ద అంగలు వెసుకుంటూ పరుగు లంకించుకున్నాను.

హెమరేజి అంటే రక్తస్రావం అని చెప్పేను కదా. ఈ రక్తం ఎక్కడనుంచి స్రవించిందో చెప్పడానికి ‘హెమరేజి’ అనే మాటకి ముందు ఒక విశేషణాన్ని వాడతారు. సెరిబెల్లార్ హెమరేజి అంటే చిన్న మెదడులో రక్తస్రావం. స్రవించిన రక్తం గడ్డ కట్టి కదుం అయినా, వాపు కలగజేసినా దానిని ‘హెమటోమా’ అంటారు. మెదడుకీ, మెదడు చుట్టూ ఉండే ‘డూరా’ అనే పొరకీ మధ్య రక్తం స్రవించి గడ్డకడితే అది ‘సబ్ డూరల్ హెమటోమా’ . ఇదేదో మెదడు లోపల ఎక్కడో జరిగి వాచితే అది ‘ఇంట్రా సెరిబ్రల్ హెమటోమా.’ ఇలా ఉంటాయి, ఈ పేర్లు.

రక్తస్రావం కాని, కదుం కట్టడం కాని అన్ని వేళలలోనూ ప్రాణాంతకమైన పరిస్థితి కాదు. మేధాకాండం లోపల రక్తస్రావం జరిగితే అది యమధర్మరాజు పాశం. చిన్న మెదడులో రక్తం స్రవిస్తే అది సత్యవంతుడి తరపున సావిత్రి అడ్డువేసిన హస్తం. మిగిలిన మస్తిఘాతాలు అంత త్వరగా లొంగవు కాని, చిన్న మెదడులో రక్తస్రావం జరగడం వల్ల వచ్చిన మస్తిఘాతాన్ని మాత్రం శస్త్రచికిత్స చేసి కుదర్చవచ్చు. కాని ఆ కాగల కార్యాన్ని తొందరగా తెమల్చాలి. నిమిషాల మీద శస్త్ర చికిత్స చేసి మెదడులోకి స్రవించి, గడ్డకడుతూన్న రక్తపు ముద్దని తొలగించకపోతే ఆ కరడు కదుం కట్టి మేధాకాండం మీద ఒత్తిడి పెట్టడం మొదలు పెడుతుంది. దానితో ఊపిరి ఆగిపోతుంది. అదే నా గాభరాకి కారణం. అదే నా పరుగుకి కారణం. ఇప్పటికే కాలహరణం అయిపోయింది.

నా కాలి కంటె బుర్ర జోరుగా పనిచేస్తోంది. ఇప్పటికి పరిస్థితి నిజ స్వరూపం అరటిపండు ఒలచినట్లు అర్థం అయింది. చెంగమ్మ చిన్న మెదడులో రక్తస్రావం జరిగింది. దాని వల్ల ఆ దగ్గరలోనే ఉన్న మేధాకాండం, రెటిక్యులార్ ఏక్టివేటింగ్ సిస్టం దెబ్బ తినలేదు కాని కొద్దిగా బెదిరేయి. దాని వల్ల ఉపతాపి తాత్కాలికంగా కోమా లోకి వెళ్లిపోయింది. కొద్ది క్షణాలపాటు బొమ్మ కళ్లు ప్రతివర్తితలు ఆగిపోయాయి. ప్రయోగశాలలో రాబర్ట్ చూపించినది మేధాకాండం మీదకి చిమ్మబడ్డ రక్తపు దాగులు మాత్రమే; అది మేధాకాండం లోపలి నుండి బయటకి స్రవించిన రక్తం కాదు. ఈ విషయం అర్థం కాక

దరిదాపు గంట సేపు కాలయాపన చేసేను. ఆలశ్యం అమృతం విషం అన్న నానుడి ఈ సందర్భంలో అక్షరాలా నిజం.

యంత్రంలా పని చేస్తూన్న నా మెదడులో ఒక ఆలోచన మెరిసింది. మా ఆసుపత్రిలో మెదడు మీద ఆపరేషను చెయ్యడానికి కావల్సిన సదుపాయాలు లేవు. కనుక పేషెంటునీ, పేషెంటు మెడికల్ రికార్డునీ పెద్దాసుపత్రికి వెంటనే తరలించాలి. అందుకని రాబర్టు పని చేసూన్న ప్రయోగశాల పక్కకి చేరుకోగానే నా కాలుకి మరకట్టు వేసి,

"రాబర్ట్! ఆ చెంగమ్మ జబ్బేమిటో అర్థం అయింది. అది సెరిబెల్లార్ హెమరేజి. వెంటనే ఆపరేషన్ చేస్తే నయమయే రోగం. కనుక ఆ సిటి స్కేను బొమ్మలని పెద్దాసుపత్రికి ఫేక్సు చెయ్యి," అని నేను అరవడం, "అలాగే" అని రాబర్ట్ సమాధానం చెప్పడం మాత్రం నాకు గుర్తున్నాయి, అంతే! మరు క్షణంలో చెంగమ్మ పక్కకి చేరుకున్నాను.

చెంగమ్మ పరిస్థితి ఏమీ బాగు లేదు. కూతురితో పది నిమిషాలు మాట్లాడిందో లేదో మళ్లా మగత కమ్మేసిందిట. ఇలా మెలుకువ వస్తోంది, అలా మగత కమ్మేస్తోంది. నేను వెనువెంటనే పెద్దాసుపత్రిలో ఉన్న నూరో సర్జన్ కి ఫోను చేసి కథనం అంతా చెప్పేను.

"సిటీ స్కేనులు పంపుతున్నారు కదా. అవి రానివ్వండి చూద్దాం." అతి నెమ్మదిగా, తాపీగా వచ్చింది సమాధానం.

ఈ లోగా చెంగమ్మ కూతురికి పరిస్థితి బోధపరచడానికి వెళ్లేను. నేను చెప్పబోయే మాటకి ఇప్పుడు ఏమి విలువ ఉంటుంది? ముందు ప్రాణాపాయం అన్నాను. నా మాట నా నోట్లో ఉండగానే చెంగమ్మ లేచి కూతురితో కబుర్లు చెప్పింది. ఇప్పుడు సర్జరీకి మరొక ఆసుపత్రికి బదిలీ చెయ్యాలంటే గొల్లపిల్లవాడు, తోడేలు కథలా అవదూ? అయినా తప్పదు కదా. చెంగమ్మ కూతురికి అంతా వివరంగా చెప్పి, కొంచెం ఓపిక పడితే అన్నీ సర్దుకుంటాయని ధైర్యం చెప్పి, కాగితాలు పెద్దాసుపత్రికి ఫేక్సు అయాయో లేదో నని రాబర్టు ఆఫీసు వైపు వెళ్లి,

"రాబర్ట్! ఆ సిటి స్కేనులు పెద్దాసుపత్రికి పంపడం అయిపోయిందనుకుంటాను" అన్నాను మాటవరసకి అన్నట్లు.

“ఇంకా లేదండి. ఈ వేళ ఫేక్సు మెషీను చాల బిజీగా ఉంది.”

“ఆ బొమ్మలు తక్షణం వెళ్లాలోయ్!”

“ఉత్తర  క్షణంలో వెళ్లాలంటారా?”

“ఉత్తరం లేదు, దక్షిణా లేదు. పంపవయ్యా మగడా! ఇప్పటికే ఆలశ్యం అయిపోయింది.” నా మాటలో కొద్దిగా విసుగు ధ్వనించింది.

మరో పది నిమిషాలు పోయిన తరువాత పెద్దాసుపత్రిలో నూరోసర్జన్ కి మరోసారి ఫోను చేసేను, సిటి స్కేను బొమ్మలు అందేయో లేదో కనుక్కుందామని. అందేయిట. చూసిన తరువాత ఫోను చేస్తానన్నాడు. ఏదో పెద్ద గుర్రానికి పళ్లు తోముతూ ఉండుంటాడు. చూసిన తరువాత ఫోను చేస్తాడుట. ఉద్ధరించలేకపోయాడు.

“మహానుభావా! ఇక్కడ ప్రాణాలు పోయేపరిస్థితి. కొంచెం తొందరగా తెమల్చండి,” అని మరొక సారి బతిమాలి, ఇంక చెయ్యగలిగేది ఏమీ లేక కాలు కాలిన పిల్లిలా రెండు నిమిషాల పాటు ఇటూ అటూ తిరిగి, అంబులెన్సు సిబ్బందిని తయారుగా ఉండమని హెచ్చరించి, ఫోను ఎప్పుడు మోగుతుందో అని ఫోను పక్కనే కూర్చున్నాను. చెంగమ్మ మగతలోకి జారుకుంటోంది. టెలిఫోను ఎప్పటికీ మోగదే. ఉండబట్టలేక నేనే మరొకసారి నూరోసర్జన్ కి ఫోను చేసేను.

“క్షమించాలి. మిమ్మల్ని వేధించుకు తినక తప్పడం లేదు. ఇక్కడ నా పేషెంటు చెయ్యి జారిపోతుందేమోనని భయంగా ఉంది…..”

“పంపండి. చూద్దాం!” అని ముక్తసరిగా రెండే రెండు మాటలు మాట్లాడి ఫోను పెట్టేసేడు. ఏం? మరొక ముక్క మాట్లాడితే అరిగిపోతాడా? ఒళ్లు మండి, విసురుగా ఫోను పెట్టేసి, ఆ తరువాత, “థేంక్స్!” అని అరిచేను.

నిమిషాల మీద చెంగమ్మని పెద్దాసుపత్రికి బదిలీ చేసేసేము.

వైద్య వృత్తిలో ఉన్న మేము పేషెంట్ల యెడల అభిమానం, ఆప్యాయత పెంచుకోకూడదు. తామరాకు మీద నీటిబొట్టులా ఉండాలి. నిజమే. కాని మొదట్లో నా వల్ల జరిగిన ఆలశ్యానికి ప్రాయశ్చిత్తం ఏదీ? ఆ

చెంగ్ చైనా దేశీయురాలు. నేను భారతీయుణ్ని. ఏదో కాకతాళీయంగా, ఈ అమెరికాలో, ఈ ఆసుపత్రిలో కలుసుకోవడం తటస్థించింది. ఆమె ఎలా పోతే నాకెందుకు? నా జీవితంలో నిర్విరామంగా వచ్చే కేసులలో ఇది మరో కేసు! ఇలా అంతర్మథనంతో తర్జనభర్జనలు పడుతూ ఉంటే,

"తుపాకి దెబ్బ! ట్రామా! ట్రామా!" అని నర్సులు, పరిచారకులు పరుగులు తీస్తూ ఉంటే నా జీవితపు నాటకంలో మరొక అంకం మొదలయింది.

కాని చెంగమ్మ నా మనో ఫలకం మీదనుండి తొలగిపోలేదు. వారం గిర్రున తిరిగిపోయింది. మరో కేసు. మరో సందర్భం. అదే నూరో సర్జన్ తో మాట్లాడవలసిన అవసరం వచ్చింది. ఉండబట్టలేక అడిగేను.

"వారం రోజుల క్రితం పంపిన మిసెస్ చెంగ్ కేసు ఏమయింది?"

అటు నుండి సమాధానం రాలేదు. నా గుండె ఝల్లుమంది.

"అదే…సెరిబెల్లార్ బ్లీడింగుతో….."

దుర్వార్త ఎక్కడ వినవలసి వస్తుందో అని గుండె పీకుతోంది. అయినా కుతూహలాన్ని చంపుకోలేకపోయేను.

"ఓ! ఆవిడా! నిక్షేపంలా ఉంది. మీరు రోగ నిర్ణయం అంత ఖచ్చితంగా చేసి పంపబట్టి ఆవిడ బతికింది. కొంచెం కాళ్లీడుస్తూ నడుస్తోంది. అది కూడ కొద్ది రోజుల్లో సర్దుకుంటుంది."

నా నాయనే! అని నేను ఆ నూరోసర్జన్ ని మెచ్చుకుందామనుకునేలోగా,

"డాక్టర్ రావ్! ఎమర్జెన్సీ!" అంటూ లౌడ్ స్పీకర్ మీద పిలుపు వచ్చింది.

**కథ వెనుక కథ:**

రచన లో ప్రచురించబడింది. డాక్టర్ టోనీ డేహర్ రాసిన "ద టిక్ అఫ్ టైం" అనే కేసు చరిత్రని ఆధారంగా చేసుకుని రాసిన కథ. ఈకథలో జరిగిన సంఘటనలు అన్నీ నిజంగా జరిగినవే.



# పంతోపంతం

# దంతోదంతం

తెల్లారి ఎనిమిదయేసరికల్లా ఆరో అంతస్తులో ఉన్న ఆఫీసుకి చేరుకున్నాను. పొగమంచుతో దోబూచులాడుతూన్న గోల్డెన్ గేట్ వంతెన కిటికీలోంచి కనిపిస్తోంది.. పసిఫిక్ మహాసముద్రానికి, శాన్ఫ్రాన్సిస్కో అఖాతానికి మధ్యనున్న జలసంధి మీద అలవోకగా కట్టిపారేసేరు – ఈ అద్భుతమైన కట్టడాన్ని! ఎన్ని సార్లు చూసినా ఇంకా ఆశ్చర్యమే. మరొక కిటికీలోంచి చూస్తే శాన్ఫ్రాన్సిస్కో అంతర్జాతీయ విమానాశ్రయం వద్ద విమానాల రాకపోకలు కనిపిస్తూ ఉంటాయి. అంత పెద్ద విమానం అమాంతం గాలిలోకి ఎలా లేచిపోతోందో! ఇంజనీరింగు చదివి ఉండాల్సింది. అయినా ఇప్పుడు విచారించి ఏమి ప్రయోజనం?

చేతులు కాలేక ఆకులు పట్టుకుని ఏమి ప్రయోజనం అంటూ వగచి, విలపించే విధానానికీ నా ఉద్యోగ ధర్మానికీ పడదు. చేతులు కాలేకనే నా పని మొదలవుతుంది. నేనొక ప్రేతాలజిస్టుని. శవాలని కొయ్యడం, కోసి, ఆ వ్యక్తి మరణానికి కారణమేమిటో నిర్ణయించడం నా వృత్తి. ఇంగ్లీషులో పేథాలజీ అనే మాటకి నేను పెట్టిన తెలుగు పేరు ప్రేతాలజీ. నిజానికి పేథాలజీ అంటే బాధకి కారణం ఏమిటో నిర్ణయించే శాస్త్రం. దీనినే రోగనిర్ణయశాస్త్రం అని కూడ అంటారు. రోగం ఎలా పుట్టింది, ఎలా పెరిగింది, దాని పర్యవసానం ఏమిటి, వగైరాలన్నీ ఈ శాస్త్రంలో భాగాలే. ఒక పర్యవసానం చావు కనుక చచ్చిపోయిన శరీరాన్ని పరీక్షించి ఆ చావుకి కారణం నిర్ధారణ చెయ్యడం కూడ ఈ శాస్త్రంలోకే వస్తుంది.

ఇలా మేడ గదిలో కూర్చుని, కిటికీలోంచి చూస్తూ, గాలిలో వంతెనలు కడుతూ, విమానాలని ఎగరేస్తూ ఉన్న సమయంలో పనికుర్రాడు వచ్చి ఆఫీసు బల్ల మీద అడుగెత్తు కాగితాల దస్త్రం పెట్టి వెళ్లేడు. అది ఆ రోజు చూడవలసిన కేసు. ఒడుపు చూసుకోకుండా ఈ అడుగెత్తు కాగితాలని చదివి జీర్ణం చేసుకోవాలంటే ఆరు నెలలు పడుతుంది. కాని పైనున్న అరంగుళం కాగితాలలోనూ ఈ కేసు

విషయాలు సంగ్రహంగా క్రోడీకరించి ఉంటాయి. ఆ క్రోడికని తీసి చదవడం  మొదలుపెట్టేను. ఫక్క గదిలో శవం తయారుగా ఉంది.

స్థాలీపులాక న్యాయంలా – అంటే అన్నం ఉడికిందో లేదో చూడ్డానికి ఒక్క మెతుకు చిదిమి చూస్తే చాలినట్లు – మొదటి పేజీ చదివేసరికే ఇదేదో కొంచెం క్లిష్టమైన కేసులాగే అనిపించింది. చనిపోయిన వ్యక్తి పేరు – ఆ పేరు ఏదైతే మనకెందుకు కాని – మాటవరసకి మార్టిన్ అని అందాం. మార్టిన్ కి ముప్పై ఏళ్లు నిండేయేమో. మూడు నెలల క్రితం వరకు ఉక్కు పిడుగులా ఉన్న మనిషి. జిర్రున చీదెరగడు. దుర్వ్యసనాలేవీ లేవు. కండలు తిరిగిన జబ్బలు. కాయలు కాసిన చేతులు. ఏ కమ్మరి కొలిమిలోనో పనిచేసేవాడని సుళువుగా చెప్పవచ్చు. అలాగని ఆ విషయం నేనేమీ ఊహించవలసిన అవసరం  కూడ లేదు. అంతా వైద్య నివేదికలో రాసిపెట్టి ఉంది. మూడు నెలల క్రితం వరకు ఉక్కు ముక్కలా, దుక్కలా ఉన్న ఈ మనిషికి అకస్మాత్తుగా నుమోనియా వచ్చింది – రెండు ఊపిరితిత్తులలోనూ.  హరీమనిపోయాడు.

శవాలని కొయ్యని సమయాలలో ప్రేతాలజీ పాఠాలు చెప్పే ఉపాధ్యాయ వృత్తి నాది. అందుచేత ప్రాణాలు తీసే నుమోనియా అంటే ఏమిటో ఒకసారి చెప్పనియ్యండి. గ్రీకు భాషలో “ప్లుమోన్”  అంటే తేలేది అనిన్నీ, ఊపిరితిత్తి అనిన్నీ అర్థాలు ఉన్నాయి. ఈ మాట లోంచే వచ్చిన “ప్లూరసీ “ అంటే ఊపిరితిత్తులలో నీరు చేరడం. ఇదే మాట లోంచి వచ్చిన “నుమోనియా”  అంటే ఊపిరితిత్తులు వాచడం.  ఈ వాపుకి కారణం వైరస్లు కాని, బేక్టీరియా కాని, రసాయనాలు కాని కావచ్చు. ఈ వాపు వల్ల తిత్తులలోని గాలి బుడగలలో తెల్ల కణాలు, తదితర కణశకలాలు చేరుకుని చిక్కడిపోతాయి. అందువల్ల ఈ గాలి బుడగలలోకి మనం పీల్చే గాలి వెళ్లే అవకాశం తగ్గిపోతుంది. ఈ పరిస్థితి ముదిరితే మన శరీరానికి ప్రాణవాయువు సరఫరా తగ్గిపోయి, రోగికి ఊపిరి ఆడక చచ్చిపోతాడు.

మార్టిన్ కి వచ్చినది నుమోనియా అని అనుమానం రాగానే అతని వైద్యులు రోగి ఉమ్మిని, కఫాన్ని మచ్చు తీసి, ఆ మచ్చులో పోషక పదార్థాలు కలిపి పోషించి చూసేరు. ఈ రకం పరీక్షలవల్ల బేక్టీరియా,

వైరస్, ఫంగస్, వగైరాలేవీ కారణాలు కావని వైద్యులు తేల్చేరు. వాపుకి కారణం తెలియకుండా ఏ మందని వెయ్యగలరు? వేళ మించిపోకుండా కారణం తేల్చాలి. అందుకని, ఊపిరి తిత్తులలో చిన్న మచ్చు ముక్కని కోసి, ఆ కణజాలాన్ని పరీక్షించి చూసేరు. ఆ పరీక్షల వల్ల ఆ కణజాలం, లేదా టిష్యూ, బాగా దెబ్బతిని పాడయిందని రూఢి అయింది తప్ప ఎందుకు అలా పాడయిందో వైద్యులకి అర్థం కాలేదు. ఏమి చెయ్యాలో పాలు పోక  మూడు నెలలపాటు రాత్రింబవళ్లు వైద్యులు ఆ రోగంతో పోరాడేరు. రోజులు గడుస్తూన్న కొద్దీ మార్టిన్ ఊపిరితిత్తులు శ్లేష్మంతో నిండి, దళసరిగా అట్టముక్కలలా తయారయాయి. హేమాహేమీలయిన వైద్యుల సమక్షంలో మార్టిన్ ఆఖరు శ్వాస విడచి కన్ను మూశాడు.

మార్టిన్ మరణానికి కారణం ఏమిటో తేల్చి చెప్పమని అతని దస్త్రం అంతటినీ నా ఆఫీసుకి, అతని శవాన్ని నా లేబుకి పంపేరు. ఆదివారం వార్తాపత్రికలో వచ్చే గళ్లనుడికట్టులా ఈ కేసు నన్ను ఎలా అల్లరి పెట్టిందో, అలగ్జాండరు గుర్రాన్ని లొంగదీసుకున్న మాదిరి ఈ సమస్యని నేను ఎలా పరిష్కరించేనో చెబుతాను, సావధానంగా చిత్తగించండి.

ప్రతి మనిషి చిట్టాలోను చిత్రగుప్తుడు ఏమిటి రాస్తాడో ఎవరికీ తెలియదు కాని, ఈ అమెరికాలో మాత్రం ప్రతి మనిషి చిట్టాలోను  ఆఖరి సంతకం ప్రేతాలజిస్టుదే. ఆ సంతకం కొరకు ఈ కాగితాల దొంతర నా దగ్గరకి వచ్చింది. ఆ సంతకం పెట్టే ముందు నేను చేసే పని పక్కా పత్తేదారీ పని. ఇంకా మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చోవడం ఎందుకని కుర్చీలోంచి లేచేను. ఉదయం తొమ్మిదవుతోంది.

కాలి బొటనవేలికి తగిలించిన చీటీ మీద పేరు చూసుకుని, సరైన శాల్తీనే పరీక్ష చేస్తున్నానని నిర్ధారణ చేసుకుని, పనికి ఉపక్రమించేను. అసిధారని చట్రంలో అమర్చి, హస్తకాన్ని చేత్తో పట్టుకుని, బలంగా ఎముకలు తగిలేవరకు కత్తిని లోతుగా లోపలికి పోనిచ్చి, ఒక కోత కోసేను. నిజానికి అలాంటి కోతలు మూడు కోసేను. కుడి భుజం దగ్గర మొదలుపెట్టి ఉరోస్థి అధోభాగం వరకు ఒక కోత, ఎడమ భుజం దగ్గర మొదలుపెట్టి అదే రకం కోత మరొకటి, ఉరోస్థి అధోభాగం నుండి తిన్నగా పొత్తికడుపు కింద

భాగం దగ్గర కటి స్థానంలో ఉన్న వస్తికాస్తి వరకు మూడో కోత. ఇంగ్లీషు అక్షరం 'వై' ఆకారంలో ఈ మూడు కోతల తోటీ మొండెముని కప్పే చర్మాన్ని పక్కకి తప్పించ వచ్చు. తరువాత పక్క ఎముకలని తలుపు తెరిచినట్లు తెరచి, శ్వాసనాళిక పట్టు నుండి ఊపిరి తిత్తులని కోసి, వాటిని పంజరం లోంచి చిలకని తీసినట్లు బయటకి తీసేను. పీచుమిఠాయిలా, తేలికగా, దూది పింజలులా ఉండవలసిన ఊపిరి తిత్తులు, రెండూ కలిపి, ఉరమరగా ఒక కిలొ బరువు ఉన్నాయి. నా ఆశ్చర్యానికి అంతు లేదు!

శవం ఉదర కుహరంలో ఉన్న అవయవాలన్నిటిని మరొక సారి పరీక్షించి, అవసరమైన కణజాలాలని సేకరించి – వీటినే 'బయాప్సీలు' అంటారు మా పరిభాషలో – శవాన్ని కుట్టేసి, చేతులు కడుక్కుని, శవాన్ని అయినవాళ్లకి అప్పగించమని ఉత్తర్వులు జారీ చేసేసరికి దరిదాపు పన్నెండు అయింది. బయాప్సీ కొరకు సేకరించిన కణజాలపు మచ్చులని స్లయిడులుగా చేసి తయారుగా ఉంచమని ప్రయోగశాలకి పంపి, మధ్యాహ్నం పాఠం చెప్పే ప్రయత్నంలో పడిపోయేను.

కొన్నాళ్లు పోయిన తరువాత లేబుకి పంపిన స్లయిడ్లు తయారయి వచ్చేయి. శవాల దగ్గర నిలబడి కోసే కోతల కంటె, సూక్ష్మదర్శిని దగ్గర ఒంగుని చూసే చూపుల దగ్గరే మా ప్రేతాలజిస్టుల కాలం గడచిపోతుంది. కోతలన్నీ యాంత్రికంగా జరిగిపోతాయి. స్లయిడ్ని తనిఖీ చేసేటప్పుడు బుర్రకి పని చెప్పాలి. చెప్పేను. స్లయిడ్లని చూడడగా, చూడగా మార్టిన్ ఊపిరితిత్తులు అంత బరువుగా ఎందుకు ఉన్నాయో అర్థం అవడం మొదలుపెట్టింది.

మరొక పాఠం. ఆరోగ్యవంతులైన వారి ఊపిరితిత్తుల నిండా చిన్న చిన్న గాలి సంచులు ఉంటాయి. మనం గాలి పీల్చినప్పుడల్లా ఈ సంచులు గాలితో నిడుతూ ఉంటాయి. ఈ గాలి సంచులకి ఆవలి వైపున కేశనాళికలు దట్టంగా అల్లుకుని, చిక్కటి వలలా ఉంటాయి. శరీర ప్రక్రియలతో అలసిపోయి, ఆమ్లజని కోసం ఆవురావురు మంటూన్న మలిన రక్తం ఈ కేశనాళికలలో ఉంటుంది. అప్పుడు గాలి సంచులలో ఉన్న గాలిలోని ఆమ్లజని రక్తం లోకి, మలిన రక్తంలో ఉన్న బొగ్గుపులుసు వాయువు సంచులలోకీ తారుమారవుతాయి. రక్తం శుభ్రపడుతుంది. ఈ ప్రక్రియ అంతా సజావుగా జరగాలంటే

గాలి సంచుల గోడలు శుభ్రంగా, ఏ అడ్డంకులు లేకుండా ఉండాలి. కాని మార్టిన్ గాలి సంచులలో నానావిధాలైన కణజాలపు పెంటా ఉంది. (దీనినే ఇంగ్లీషులో 'టిష్యూ డెబ్రీ' అంటారు.) అందువల్ల ఊపిరితిత్తులలోకి గాలి వెళుతోంది కాని, ఆ గాలిలో ఉన్న ఆమ్లజని రక్తానికి అందటం లేదు. "అత్తారింట్లో ఎన్ని వండితే మాత్రం ఏమి లాభం, అల్లుడి నోట్లో శని ఉన్న తరువాత" అన్నట్లు అయింది మార్టిన్ పరిస్థితి. పాపం! గాలి పీల్చినా ఊపిరి అందక చచ్చిపోయాడు.

ఇంతటితో పరిశోధన ఆపేస్తే మా పత్తేదారీతనంలో పస ఏముంటుంది? పేదరాసి పెద్దమ్మా, పెద్దమ్మ కొడుకా,...అన్న కథలోలా ఊపిరి ఆడకపోవడానికి గాలి సంచులలోకి కణజాలాల పెంట చేరడం కారణమైతే ఆ కణజాలాల పెంట అక్కడికి ఎందుకు చేరింది? ఏమిటి జరిగిందో తెలిసింది కాని, ఎందుకు జరిగిందో తెలుసుకోవలసి ఉంది. ఎంత బుర్ర గోక్కునా ఈ సమస్య అంతూ, పై తేలీకుండా పోతోంది.

ఉపతాపిని ఆసుపత్రిలో చేర్చిన రోజున రోగి చరిత్రని క్షుణ్ణంగా రాసుకోవాలి. ఈ పనిని రివాజుగా విద్యార్థులకి అప్పజెబుతాం. మార్టిన్ ఆసుపత్రిలో చేరిన రోజున విద్యార్థి రాసిన చరిత్ర చదవడం మొదలుపెట్టేను.

ఆసుపత్రికి వచ్చే ముందు రోగి వంట ఇంట్లో ఏదో వంట వండుతున్నాడు ట. అకస్మాత్తుగా దగ్గు, తుమ్ములు రావడం మొదలు పెట్టాయి ట. దాంతో ఊపిరి ఆడలేదుట. వెంటనే పరిగెత్తుకుని ఆసుపత్రికి వచ్చేరు ట. ఈ విషయాలన్నీ మార్టిన్ ని ఆసుపత్రికి తీసుకువచ్చిన స్నేహితురాలు చెప్పింది ట. తనకి ఆసుపత్రుల పొడ పడదంటూ, తనని ఆసుపత్రికి తీసుకువచ్చిన స్నేహితురాలినీ, పరిచర్యలు చేస్తూన్న ఆసుపత్రి సిబ్బందినీ, నరసమ్మలనీ, ఎడాపెడా పడ తిట్టేడుట – ఒక పక్క దగ్గుతూనే. ఇన్ఫెక్షన్ ఏదో అయి ఉంటుందని వైద్యులు ఏవో మందులు ఇచ్చేరు ట. ఆసుపత్రిలో చేర్చి పర్యవేక్షణలో రెండు రోజులు ఉంచడం మంచిదని వైద్యులు ఎంత చెబుతూన్నా వినిపించుకోకుండా విసురుగా ఇంటికి

వెళ్లిపోయాడుట. మరునాడే దగ్గు, ఆయాసంతో ఆసుపత్రి ప్రాంగణంలో ప్రత్యక్షమయాడు ట. ఒళ్లంతా నీలంగా అయిపోయింది ట. ఇదీ ఆ విద్యార్థి రాసిన సంక్షిప్తం యొక్క సారాంశం.

శరీరం అంతా నీలంగా అయిపోవడంలో అంత చెప్పుకోదగ్గ వింత, విడ్డూరమూ ఏమీ లేవు. నుమోనియా వచ్చినా, ఊపిరి తిత్తులకి సోకుడు (ఇన్ఫెక్షన్) తగిలినా, ఊపిరితిత్తులకి దెబ్బ తగిలినా శరీరం నల్లగా అవొచ్చు. దాని వల్ల కొంప ములిగే ప్రమాదం ఏమీ లేదు. కాని ఈ వ్యవహారమంతా ఇంత త్వరగా, ఒక్క రోజులోనా? అసంభవం! తనకి అర్థం కానిదేదో ఉంది. ఇదేదో తికమక పెడుతూన్న ప్రహేళికే!

మార్టిన్ స్నేహితురాలికి ఫోను చేసేను. ఆమె ఇంటిదగ్గర కాదు కదా ఊళ్లోనే లేదుట. ఎమర్జెన్సీ వార్డులో మార్టిన్ ని చేర్చుకున్నప్పుడు, మార్టిన్ పని చేస్తూన్న కంపెనీ పేరు, చిరునామా, అతని యజమాని పేరు, టెలిఫోను నంబరు, మొదలైన వివరాలన్నీ మొదటి పేజీలోనే నమోదు అయి ఉన్నాయి. మొదట్లో నర్సులు ఈ ప్రశ్నలు అడిగినప్పుడు, "ఈ వెధవ యక్షప్రశ్నలు అన్నీ ఇప్పుడెందుకు? ఒక పక్క ప్రాణాలు పోతూ ఉంటేను!" అని ఉపతాపులు చిరాకు పడి విసుక్కుంటారు. కాని కాలక్షేపానికి, ఊసుపోక ప్రశ్నలు వేస్తూ కూర్చుందుకి నర్సులకి తీరుబడి ఉండదు; ముఖ్యమైన ప్రశ్నలే అడుగుతారు. ఆ ప్రశ్నలకి వచ్చిన సమాధానాలే నాకు ఇప్పుడు ఆలంబన అవుతున్నాయి.

మార్టిన్ పని చేసిన కంపెనీ యజమానికి ఫోను చేసేను. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. మార్టిన్ మరణానికి కారణం ఏమిటా అని నా ఉద్యోగ ధర్మం ప్రకారం రివాజుగా సోదా చేస్తున్నానని కూడ చెప్పేను. "కొన్ని ప్రశ్నలు అడుగుతాను. వాటికి సమాధానాలు చెప్పగలరా?" అని అడిగేను.

అటు నుండి సమాధానం రాలేదు.

టెలిఫోను కనెక్షన్ పోయిందేమోనని, "అవతల పక్క ఎవ్వరయినా ఉన్నారా?" అని రెట్టించి అడిగేను.

"అడగండి. నాకు తెలిసింది చెబుతాను." ఆచి, తూచిన మాటలులా నాలుగు మాటలు ఒలికేయి.

"మీ ఫౌండ్రీలో మార్టిన్ ఏ పని చేసేవాడు?"

"అల్యూమినం కరిగించి మూసలలో పోసేవాడు."

"అసలు మార్టిన్ గురించి మీరేమైనా చెప్పగలరా?"

"అతను సామంతుడు. అంతకంటె నాకు మాత్రం ఏమి తెలుస్తుంది?"

"అంత సామంతుడు ఎలా అయాడో!" ప్రశ్నార్థకం కాకుండా ఆశ్చర్యం ధ్వనించేలా అడిగేను.

"పుర్రెలో బుద్ధి పుట్టాలే గాని గణించడానికి మార్గాలే లేవా?"

"డిక్కీలో తొంగోపెట్టేసే రకమా?"

"ఆ ఉద్దేశంతో అనలేదు."

మాట తూచినట్లు ధ్వనించింది. మరే ఉద్దేశంతో అన్నాడో కనుక్కోవాలని మనస్సులో అనిపించింది. మరీ క్రాసు ఎగ్జామినేషన్ చేసినట్లు ప్రశ్నలు అడిగితే భయపడి ఎక్కడ బిగుసుకుపోతాడో అనుకుంటా, కొంచెం ప్లేటు ఫిరాయించేను.

"మార్టిన్ కోపిష్టి మనిషా?"

"మార్టిన్ చాల నెమ్మదస్తుడు."

"మార్టిన్ ఏదో వంట వండుతూ ఉన్న సమయంలో విపరీతంగా దగ్గు, ఆయాసం వస్తే ఎమర్జెన్సీ వార్డుకి తీసుకురావడం జరిగిందని అతని స్నేహితురాలు చెప్పింది. ఏమి వండుతూ ఉండగా దగ్గు వచ్చిందో తెలిస్తే ---" అంటూ వాక్యాన్ని అర్ధోక్తిలోనే ఆపేసేను. ప్రశ్న రూపంలో అడగలేదు కనుక ఇష్టం ఉంటే చెబుతాడు, లేకపోతే మరొక పక్కనుండి నరుక్కురావచ్చని ఆపేసేను. ఆవతల పక్క నుండి స్వచ్ఛందమైన సమాధానం ఏమీ రాలేదు.

ఆవతల వ్యక్తి మౌనంలో అంతరార్థం ఏమయి ఉంటుందా నా అంతరాత్మ అలజడి చెందడం మొదలెట్టింది. అయినా ధైర్యం చేసి సూటిగా అడిగేను.

"మార్టిన్ అంత సామంతుడు ఎలాగయ్యాడో. కమ్మరి పని చేసి ఎంతకని వెనకెయ్యగలడు?"

మరి కొంత సేపు నిశ్శబ్దం. తొందరపడ్డానేమోనని నాలిక కరుచుకున్నాను. ఇంతలో నా రొట్టె విరిగి నేతిలో పడింది.

"మార్టిన్ కి ఒక హాబీ ఉండేది. ఊళ్లో ఉన్న దంత వైద్యుల దగ్గరకి వెళ్లి, పీకేసిన పాత పళ్లు పోగు చేసి, వాటిల్లో ఉండే వెండి, బంగారం మలామాలు పోగు చేసేవాడు.

"ఆ లోహాలని ఏమి చేసేవాడో…." అడిగీఅడగనట్లు అడిగేను.

"ఏమో! నాకేం తెలుస్తుంది. అడిగితే మాత్రం చెబుతాడా? ఆ స్నేహితురాలికి నగలు చేయించేవాడేమో."

ఏమీ తెలియదంటూనే నాకు కావలసిన విషయం మరొకటి నా చెవిని పడేసేడు. గత సంవత్సరంలోనే స్నేహితురాలితో కలిసి మార్టిన్ మూడు సార్లు కొలంబియా వెళ్లి వచ్చాడుట. డబ్బుంటే విహారానికి హవాయి వెళతారు. ఇంకా ఉంటే మెక్సికో వెళతారు. బాగా ఉంటే, పేరిస్ వెళతారు. లేకపోతే పడవ మీద విహారయాత్రకి వెళతారు. కాని కొలంబియా వెళ్లడం కొంచెం ఎబ్బెటుగానే అనిపించింది. అందులోనూ ఏడాదిలో మూడు సార్లు! కొంచెం తటపటాయిస్తూనే అడిగేను.

"మార్టిన్ కి కాని మాదక ద్రవ్యాల వాడకం మీద …."

"అతను డ్రగ్గులు వాడడం నేనెప్పుడూ స్వయంగా చూడలేదు."

కర్ర విరగకుండా, పాము చావకుండా గోడ మీద పిల్లిలా వచ్చింది సమాధానం. అందులోనూ 'స్వయంగా' అన్న మాట కొంచెం నొక్కి పలికేడు. తునిలో పుట్టి, తునిలో పెరిగి, తుని తగవులు

తీర్చిన తగవరులని స్వయంగా చూసిన నేను పై సమాధానం లోని సొగుసుని గమనించలేకపోతే ఎందుకీ బతుకు? ఇంటెనక్కాల పడి చావడానికా?

మార్టిన్ మహాశయుని జీవిత సంగ్రహం  గురించి ఒక సిద్ధాంతం మెల్లిగా నా కళ్ల ముందు విడడం మొదలైంది. దంత వైద్యుల దగ్గర కాని, శవసంరక్షకుల దగ్గర కాని పాత పళ్లు పోగు చేసి, వాటిని కమ్మరి కొలిమిలో కాల్చి, వాటిల్లో ఉన్న వెండిని కాని, బంగారాన్ని కాని విడదీసి, ఆ డబ్బుతో కొలంబియాలో మాదక ద్రవ్యాలని కొని, వాటిని అమెరికాలోకి దొంగ రవాణా చేసి, ___. హోరి భడవా! హోరి భడవోయ్! వీడికి ఇన్ని తెలివితేటలు ఉన్నాయా? మార్టిన్ మస్తిష్కపు చురుకుదనానికి ముక్కు మీద వేలేసుకున్నాను.

సిద్ధాంతం అంటే లేవదీశాను కాని, మార్టిన్ మాదకపు మందులు దొంగతనంగా దిగుమతి చెయ్యడానికి, అతని అకాల మరణానికి మధ్యనున్న అవినాభావ సంబంధం ఏమిటో నాకు స్ఫురించ లేదు. ఇదేదో త్వరగా తేల్చి, ఈ కేసుని మూసెయ్యక పోతే నాకు మరణ విచారణాధికారి కచేరీ నుండి చివాట్లతో శ్రీముఖం వస్తుంది. కనుక ఈ పనేదో తొందరగా తెమల్చాలి.

మా విశ్వవిద్యాలయంలో దంతవైద్య పాఠశాల ఒకటి ఉంది. అక్కడ పని చేసే ఆచార్యుడిని ఒకతనిని టెలిఫోనులో పిలచి దంత వైద్యంలో ఉన్న మెలికలు నా బోంట్లకి అర్థం అయే రీతిలో చెప్పమని అడిగేను. ఆ సంభాషణ సారాంశం ఇది.

అమెరికాలో పుచ్చుతూన్న పళ్లని ఠపీమని పీకి పారెయ్యరు. పుచ్చిన భాగాన్ని బాగా శుభ్రం చేసి, అక్కడ మరికొంచెం దొలిచి, అప్పుడు ఆ జాగాలో కరిగించిన వెండి కాని, బంగారం కాని పోసి నింపుతారు. పరిశుద్ధమైన బంగారం కొంచెం మెత్తగా ఉంటుంది. అటువంటి బంగారాన్ని ఆ పళంగా వాడెస్తే, ఏ అప్పడాలో, జంతికలో నములుతూన్నప్పుడు ఆ బంగారం కాస్తా తన కుదుట్లోంచి ఊడి, బయటకి వచ్చి పళ్ల కింద పడిందంటే మనకి ఒక బంగారపు అప్పడం బయటకి వస్తుంది. అందుకని బంగారాన్ని ఏ పెల్లేడియం వంటి లోహంతోటో కలిపి ఆ మిశ్రమ లోహపు ముద్దని పంటి రంధ్రాలు నింపడానికి

వాడతారు. అలాగే వెండిని వాడినప్పుడు, వెండిని పాదరసంతో కలుపుతారు. ఇలా వెండి, పాదరసం కలిసిన ముద్దని రసరజతం అంటారు.

పళ్లకి ఎంత శుశ్రూష చేసి జాగ్రత్త పడ్డా ఎప్పుడో ఒకప్పుడు ఈ పళ్లు ఊడక తప్పదు. అప్పుడు వాటిల్లో ఉన్న బంగారాన్ని సేకరించవచ్చు. ఇది చాల తేలికైన పనే. ఇక్కడ ఒక చిన్న రసాయనశాస్త్రపు పాఠం. బంగారం, పెల్లేడియం కలసిన మిశ్రమ లోహాన్ని వేడి చేస్తే ముందుగా బంగారం 1165 సెల్సియస్ డిగ్రీల దగ్గర కరుగుతుంది. కాని పెల్లేడియం 1552 డిగ్రీల వరకు కరగదు. కనుక బంగారం, పెల్లేడియం ఉన్న పుప్పి పళ్లని కొలిమిలో వేడి చేస్తే ముందుగా బంగారం కరిగి బయటకి వచ్చేస్తుంది.

బజారులో అవున్సు బంగారానికి 800 డాలర్లు, అవున్సు వెండికి 15 డాలర్లు పలుకుతోంది. ఈ ధరలు పెరిగే సూచనలే కనిపిస్తున్నాయి తప్ప తగ్గుముఖం పట్టేటట్లు లేవు. అందుకని ప్రజలు బంగారం, వెండి కొని వెనకెయ్యడం మొదలు పెట్టేరు. కొనే స్థోమత లేని వాళ్లు ఏ ఏటి గట్టుకో వెళ్లి, పెనంలో నీళ్లు పోసి, గాలించి, అడుగున బంగారం నలుసులు ఏమైనా ఉన్నాయేమోనని వెతకడం మొదలు పెట్టేరు. ఎవరికి వచ్చిన విద్యతో వారు బంగారం కోసం వేట ప్రారంభించేరు. కొలిమిలో బంగారాన్ని కరిగించడం మార్టిన్కి చేతిలో ఉన్న విద్య. అందుకని కట్టుడు పళ్లల్లో ఉన్న వెండిని, బంగారాన్ని సేకరించాలనే బుద్ధి పుట్టి ఉంటుంది.

పైన చెప్పిన పద్ధతిలో మార్టిన్ బంగారాన్ని విడగొట్టి, దాన్ని అమ్ముకుని, ఆ డబ్బుని కొలంబియా పట్టుకెళ్లి, అక్కడ క్షుద్రజాతి మాదకపు మందులు కొని, వాటిని దొంగ రవాణా చేసి, అమెరికాలో నల్లబజారులో అమ్ముకుని, డబ్బు  గణించి ఉంటే ఇప్పటికీ మార్టిన్ బతికి ఉండేవాడే.

కాని పళ్లల్లో కూడ బంగారాన్ని ధరించగల భాగ్యవంతులు ఈ అమెరికాలో కూడ ఎంతోమంది లేరు. వెండి అవున్సు సాధారణంగా మూడు, నాలుగు డాలర్లకి మించదు. అందుకని పళ్లల్లో రసరజతాన్ని వాడే వ్యక్తులు కొల్లలు. బంగారం అయితేనేమిటి, వెండి అయితేనేమిటి అనుకుని, పేరాశని అదుపులో

పెట్టుకోలేక, అవివేకి అయిన మన మార్టిన్ ఆ వెండినే పోగు చెయ్యడానికి సంసిద్ధుడై, పప్పులో కాలేసి ఉంటాడు.

పాదరసం గది ఉష్ణోగ్రత దగ్గర ద్రవ పదార్థమని మనందరికీ తెలుసు. కాని పాదరసం 674 డిగ్రీల ఉష్ణోగ్రత దగ్గర మరిగి కావిరి అవుతుందని మనలో చాలమందికి తెలియదు. కనుక రసరజతాన్ని మూసలో వేసి వేడి చేసినప్పుడు ముందుగా పాదరసం కావిరి  అయిపోయి బయటకి వచ్చేస్తుంది, మూసలో  వెండి మిగిలిపోతుంది. తమాషా ఏమిటంటే పాదరసం ద్రవ రూపంలో ఉన్నంత సేపు విష పదార్థం కాదు. అదే పాదరసం కావిరి అయినప్పుడు అది   రంగు, రుచి, వాసన లేని విషవాయువు; పీల్చితే  ప్రమాదం. ఈ వాయువు రక్తం లోని జీవకణాలతో సంయోగం చెందినప్పుడు – బాంబు పేలితే భవనాలు శిథిలమైనట్లు – ఆ జీవకణాలు, ఛిన్నాభిన్నమయి, శిథిలం అయిపోతాయి. (ఈ రకపు లోతైన విద్యాగంధం ఒక్క మార్టిన్లోనే కాదు, బులబులాగ్గా శాస్త్రం చదివిన చాల మందిలో ఉండదు.) ఇదెలా జరుగుతుందో చెబుతాను.

రక్తంలో ఎర్ర కణాలకి ఎరుపు రంగునిచ్చే రంజన పదార్థాన్ని రక్తచందురం అంటారు. ఈ రక్తచందురం లోని అణువుల నిర్మాణక్రమం ఆమ్లజనిని మోసుకు వెళ్లడానికి అనుకూలంగా  ఉంటుంది. ఇలా ఆమ్లజనిని మోసుకెళ్లే  కార్యక్రమం అంతా సజావుగా జరగడానికి రక్తంలో అజములు అని కాని, ఫేనకప్రాణ్యములు అని కాని పిలవబడే కొన్ని రసాయన పదార్థాలు ఉన్నాయి. వీటినే ఇంగ్లీషులో 'ఎంజైములు'  అంటారు. పాదరసపు కావిరులు ఊపిరి తిత్తులలోకి వెళ్లగానే ఈ అజములు ఆమ్లజనిని గ్రహించడానికి బదులు పాదరసపు అణువులతో ఢీకొని వాటిని అణుశకలాలుగామార్చేస్తాయి. ఈ పాదరసపు అణుశకలాలు, లేదా 'అయానులు'  చాల చురుకైనవి. అందువల్ల ప్రమాదమైనవి కూడ. శరీరంలోని కణజాలాలని ధ్వంసం చేసి, పెంట  పోగులుగా మార్చగల సామర్థ్యం కలవి. ఈ పాదరసపు అణుశకలాలు మెదడులోకి వెళ్లేయంటే  అక్కడ నానా

అల్లరి పెట్టగలవు. అందువల్లనే  మార్టిన్ మొదటి  రోజున నర్సుల మీద రయ్, రయ్ అని ఎగిరి ఉంటాడు.

ఇంతవరకు చేసిన పత్తేదారీ పని అంతా శుద్ధ సిద్ధాంతం మాత్రమే. ఇప్పుడు ఈ సిద్ధాంతం సరి అయినదే అని నిర్ధారణ చెయ్యాలి. శవపరీక్షలో సేకరించిన మచ్చులు ఇంకా నా దగ్గర ఉన్నాయి. వాటిని మళ్లా పరిశోధనశాలకి పంపేను. కణజాలంలో పాదరసపు అవశేషాలు ఏమైనా ఉన్నాయేమో ప్రత్యేకించి చూడమని చిన్న చీటీ రాసి పంపేను. మర్నాటికి నా అనుమానం నిజమేనని రూఢి అయింది. మార్టిన్ పాదరసపు విషవాయువులు పీల్చిన కారణంగానే చచ్చిపోయాడు.

నా సిద్దాంతం కొంతవకు రుజువు అయింది. ఆతని చావుకి కారణం తెలిసింది. కారకులు ఎవ్వరో కూడ తెలుసుకోవాలి. అందుకని ఈ పాదరసపు విషవాయువులు మార్టిన్ ఎక్కడ పీల్చేడో కూడ నిర్ధారించాలి. ఈ విషవాయువులు మార్టిన్ పని చేసే కమ్మరి కొలిమి దగ్గర పీల్చి ఉంటే ఆ కొలిమి యజమాని మీద మార్టిన్ వారసులు కాని, ప్రభుత్వం వారు కాని దావా వెయ్యవచ్చు. ఈ ప్రమాదమేదో మార్టిన్ ఇంట్లో వంటగదిలో జరిగి ఉంటే తను తవ్వుకున్న గోతిలో తనే పడ్డాడని సంజాయిషీ చెప్పుకుని ఊరుకోవచ్చు. ఏది ఏమయినా తదుపరి విచారణ నా పదవీ ప్రభావపు పరిధికి మించిన పని.

అమెరికాలో ‘ఓషా’  అనే సంషిప్త నామధేయంతో, ‘ఆక్కుపేషనల్ సేఫ్టీ అండ్ హెల్త్ ఎడ్మినిస్ట్రేషన్’ అనే ప్రభుత్వ శాఖ ఉంది. వృత్తిరీత్యా జరిగిన ప్రమాదాలని పరిశీలించి తగిన చర్యలు తీసుకోవలసిన భాధ్యత వారిది. ఇటుపైన ఈ సమస్య  వారి అధికార మండలంలోకి వెళుతుంది. అందుకని తరువాయి పరిశోధనా  తతంగాన్ని వారికి అప్పచెప్పేను. వారి సిబ్బందిలో కొందరు మార్టిన్ ఇంటికి, మరికొందరు మార్టిన్  పని చేసిన కార్ఖానాకి వారంట్లు పుచ్చుకుని తరలి వెళ్లేరు. మార్టిన్ చచ్చిపోయి మూడు నెలలు కావస్తోంది. అయినప్పటికీ మార్టిన్ వంటింటి నేల కిందా, నేలమాళిగలోనూ పాదరసపు అవశేషాలు విపరీతంగా కనిపించేయి. మార్టిన్ తన సొంత ఇంట్లోనే దంతాల వంట చేసేడనడానికి ఇంతకంటే దాఖలాలు ఏమిటి కావాలి?

శల్యపరీక్షగా మారిన శవపరీక్ష మార్టిన్ చచ్చిపోయిన మూడు నెలలకి పూర్తి యింది. పాదరసపు విషవాయువులు ఊపిరితిత్తులలోని గాలిబుడగలని ధ్వంసం చేసిన కారణంగా ఊపిరి ఆడక మార్టిన్ చచ్చిపోయాడని తీర్పు రాసి, సంతకం పెట్టి, కాగితాల దస్త్రాన్ని మరణవిచారణాధికారి కచేరీకి పంపేను. అలా రాసి, సంతకం పెట్టి పంపేనే కాని మార్టిన్ మరణానికి అసలు కారణం అతని అవిద్య, అవివేకం, అత్యాస అని నాకు తెలుసు.

ఇంతటితో నా భాధ్యత తీరింది కాని కథ ఇంకా కంచికి వెళ్లలేదు. అమెరికాలో 'డ్రగ్ ఎంఫోర్స్మెంట్ అథారిటీ' అనే పేరు గల మరొక ప్రభుత్వ సంస్థ ఉంది. తరువాయి దర్యాప్తు వారిది. కొలంబియాలో మార్టిన్తో చెయ్యి కలిపిన వారెవరో ఆచూకీ తీసి, ఆ బృందం అంతటినీ పట్టుకుని, కోర్టుకి ఈడ్చి, శిక్ష పడేటట్టు చూడవలసిన భాద్యత వారిది. అందుకని వారు చేసే దర్యాప్తులన్నీ పరమ రహశ్యం. కనుక తరువాయి కథ నాకు తెలియదు.

చివరి మాట: మార్టిన్ కేసుని దృష్టిలో పెట్టుకునో, ఏమో – అసలు కారణం తెలియదు కాని – అమెరికాలో ఇప్పుడు రూల్సు మార్చేసేరు. ఈ రోజుల్లో పీకేసిన పాత పళ్లు కావాలని అడిగితే దంతవైద్యులు ఇవ్వరు. ఈ వ్యవహారం ఎంతవరకు ముదిరిందో మనవి చేసుకొని ఈ ఉదంతాన్ని ఉపసంహరించుకుంటాను. మన దేశంలో పాల పన్ను ఊడినప్పుడు ఆ పన్నుని పిల్లలు ఎలక కన్నంలో వేసి, "ఎలకా! ఎలకా! ఈ పాల పన్ను తీసుకుని నీ గట్టి పళ్లు నాకివ్వవా?" అని అడుగుతారు. దీనిలాంటిదే అమెరికాలో ఒక సంప్రదాయం ఉంది. ఊడిన పాల పంటిని పిల్లలు దిండు కింద పెట్టి పడుక్కుంటారు. రాత్రి దంత దేవత ('టూత్ ఫేరీ' ) వచ్చి ఆ పంటిని తీసుకొని వాళ్ల దిండు కింద ఒక బహుమతిని పెడుతుందని ఆ పిల్లల నమ్మకం. (నిజంగా ఈ బహుమతులు పెట్టేది తమ తల్లిదండ్రులో, అవ్వతాతలో అని గడుగ్గాయలైన పిల్లలకి తెలుసనుకొండి.) అప్పుడప్పుడు కొంచెం ఒదులుగా ఉన్న పంటిని ఊడీ వరకు ఆగకుండా దంతవైద్యులు పీకెస్తారు. పూర్వం అలా పీకేసిన పంటిని పొట్లం కట్టి

పిల్లలకి  ఇచ్చేసేవారు. ఈ రోజుల్లో అలా పీకేసిన పళ్లని  పిల్లలు అవనివ్వండి, పెద్దలు అవనివ్వండి, కావాలని అడిగినా ఇవ్వడానికి వీలు లేదని చెప్పేస్తున్నారు.

**కథ వెనుక కథ:**

రచన సెప్టెంబరు 1993 సంచికలో ప్రచురించబడింది. డాక్టర్ డేనియల్ వీవర్ రాసిన కేసు చరిత్ర దీనికి ఆధారం.



కించిత్ భోగో భవిష్యతి

# కించిత్ భోగో భవిష్యతి

1

త్రిభువన సంచారి అయిన నారదుడు విశాఖపట్నం సముద్ర తీరంలో ఒకనాడు తిరుగుతూ ఉండగా ఆయన కాలికి ఏదో తగిలింది. ఏమిటా అని చూస్తే అది ఒక పుర్రె! ఒంగి దానిని చేతిలోకి తీసుకున్నాడు. మనస్సులోకి చిన్న చిలిపి ఆలోచన వచ్చింది. కుతూహలంతో ఆ కపాలపు లలాట భాగాన్ని చేతితో తుడిచి అక్కడ ఏమి రాసుందో అని కుతూహలంతో పరీక్షించి చూసేడు. బ్రహ్మ రాసిన రాత మసక మసకగా ఆయన దివ్య చక్షువులకి కనిపించింది.

'... ... ... ... ..."

... ... ... ... సంచారే

సముద్ర తీరే మరణం

కించిత్ భోగో భవిష్యతి'

"కించిత్ భోగే భవిష్యతి? సందేహం లేదు. ఇది విరించి రచించిన రాతే! వికటించిన విరించి రాత! ఈ చతుర్ముఖుడు తన భుజస్కంధాల మీద ఉన్న సృష్టి కార్యపు భారాన్ని మొయ్యలేకపోతున్నాడా? వార్ధక్యంతో సామర్ధ్యం తగ్గిపోతోందా? కాకపోతే ఏమిటీ పిచ్చి రాతలు? ఒక అభాగ్యుడిని కీర్తి కాంక్షతో జీవితమంతా వేధించి, పాప భూమి అయిన ఈ సముద్ర తీరంలో జీవితం అంతమొందించి, మరణానంతరం కించిత్ భోగం ప్రసాదిస్తాడా?

బ్రహ్మ మానసపుత్రుడైన నారద మహాముని నిశితమైన కుశాగ్ర బుద్ధికి ఈ కుతర్కం అర్థం కాలేదు. కించిత్ భోగో భవిష్యతి ట! చచ్చిన తరువాత భోగం ఏమిటి? బుర్ర లేక పోతే సరి. నాలుగు బుర్రలలో ఒక్కటీ సరిగ్గా పని చేసినట్లు లేదు. ఇదేదో ముఖాముఖీ తేల్చుకోవలసిన విషయం.

వైజాగు బీచి నుండి హుటాహుటీ సత్యలోకానికి ప్రయాణం కట్టేడు, నారదుడు.

## 2

భక్తితో యాత్ర పూర్తి చేసుకుని కార్యసిద్ధికి ఎదురు చూస్తున్నాడు లక్ష్మణరావు. తల నీలాలు స్వామికి సమర్పించేసేడేమో తలకి పాగా చుట్టేడు.

"సి. వీ. రామన్ లా ఉన్నావోయ్" అన్నారు సహోద్యోగులు. మురిసిపోయాడు లక్ష్మనణరావు. పోలిక కుదిరింది కనుక అదృష్టం పడితే నోబెల్ బహుమానం కాకపోయినా కనీసం భట్నగర్ ఎవార్డ్ అయినా రాకపోతుందా అనుకున్నాడు.

ప్రముఖులతో తనని పోల్చి చూసుకోవడం లక్ష్మణరావు అలవాట్లలో ఒకటి. సంస్కారం లేకుండా ఉడతలు పీకిన తాట్టెంకలా ఉన్న జుత్తుని చూసి ఎవ్వరో అయిన్స్టయిన్ క్రాఫింగులా ఉందన్నారుట. అంతే! నాటి నుండి కేశ సంస్కారానికి స్వస్తి వాచకం పలికేడు లక్ష్మణరావు.

తెరచాప ఎత్తి పడవ నడపడం అంటే అయిన్స్టయిన్ కి వల్లమాలిన సరదా. అత్తారింటికి అమలాపురం వెళ్లినప్పుడల్లా – గోదావరి కాలవ లో కాదు – గోదావరిలోనే పడవని నడపడం ప్రేక్టీసు చేసేవాడు. ఒక సారి సుడిగుండంలో పడగా చావు తప్పి కన్ను లొట్టపోయినంత పని అయింది.

పోనీ ఫిడేలు వాయిద్యంలో ప్రావీణ్యం సంపాదిద్దామని ప్రయత్నం చేసేడు. ఆయిన్స్టయిన్ కి మల్లే 'బాక్' వాయించలేకపోయినా అపస్వరాలతో సరళీస్వరాలు వాయించేవాడు. ఆతను సాధకం చేస్తూన్నప్పుడల్లా అతని భార్యామణి వీధిగుమ్మంలో మెట్ల మీద కూర్చునేది. సైంటిస్టు కదా. ప్రతి విషయానికీ కారణం తెలుసుకోకుండా ఉండలేకపోయేవాడు. అందుకని ఉండబట్టలేక అడిగేసేడు:

"నేను ఫిడేలు వాయించినప్పుడల్లా వీధి గుమ్మంలో కూర్చుంటావెందుకు?"

"ఆఁ! మరేం లేదు. పెళ్లాం కొట్టడం లేదని ఊరు వాళ్లకి తెలియాలని."

పురిట్లోనే సంధి కొట్టినట్లు ఫిడేలు వాయిద్యం ఇలా బెడిసికొట్టింది.

ఏకలవ్యుడిలా గురువు గారి ఫొటో ఎదురుగా పెట్టుకుని పైపు తాగడం ప్రేక్టీసు చెయ్యడం మొదలు పెట్టేడు. సిరి అబ్బకపోయినా చిదుం అబ్బుతుందంటారే అలాగ లక్ష్మణరావుకి పైపు తాగడం అలవాటు మిగిలింది.

## 3

ఈ కీర్తి కండూతి లక్ష్మణరావుకి పుట్టుకతో పుట్టిన బుద్ధే! పరశురామా లయన్ సర్కస్ వారు బంతుల బీడులో వేసిన డేరాలు ఎప్పుడు ఎత్తేస్తారా అని చూసేవారట లక్ష్మణరావు తల్లిదండ్రులు. ఊళ్లో ఉన్న ఊరకుక్కలు, పిల్లులు, అన్నీ వాకిట్లోనే సర్కస్ చేస్తూ ఉంటే ఎంతకని భరిస్తారు – కొడుకు మీద ఎంత మమకారం ఉన్నా. ఏ నాగేశ్వర్రావు లాగో, యంటీయార్ లాగో అయిపోదామని ఎంతగానో కలలు కన్నాడు. చదువు మానేసి ఇలాంటి పిచ్చి వేషాలు వేస్తే మక్కెలు విరగ్గొట్టి పులుసులోకి ముక్కలు లేకుండా చేస్తానని తండ్రి బెదిరించేసరికి చదువు మీదకి దృష్టి మరలింది.

థర్డ్ ఫారంలో ఉన్నప్పుడు 'యమాతారాజభానస' అని తెలుగు మేష్టారు బోర్డు మీద రాసేసరికి మన లక్ష్మణరావుకి కవిత్వం ఆశువుగా పెల్లుబికి వచ్చిందనడానికి దాఖలాలు లేవు కాని అతని సృజనాత్మక దృక్పథంలో కొంత మార్పు వచ్చింది. చదువు మీదకి దృష్టి మరలింది. పద్యాల మీద ప్రయోగాలు చేసేవాడు. సర్కస్లో ఏనుగు మీద పెద్దపులి సవారీ చేస్తూన్న దృశ్యాన్ని వర్ణించడానికి మత్తేభ, శార్దూలాల ఛందస్సులని మేళవించి 'మత్తశార్దూలం' అనే కొత్త రకం పద్యాన్ని సృష్టించేడు. తనకి వచ్చీ రాని ఇంగ్లీషులో కంద పద్యాలు రాసేవాడు. సనాతనుడయిన తెలుగు మేష్టారు, "ప్రయోగం పేరిట శుద్ధ ఛందస్సుని మంటగలుపుతావుట్రా! రావూ! ఒరేయ్ రావూ! నీకు పద్యాలు రావురా!" అని ప్రాస కోసం పాకులాడుతూ లక్ష్మణరావుని తల వాచేలా తిట్టేరు. "ద అన్ పబ్లిష్డ్ వర్క ఆఫ్ ద లేట్ గ్రేట్ లక్ష్మణరావ్" అని ఎప్పుడైనా, ఎవ్వరైనా ప్రచురించకపోతారా అని తను ఖరాబు చేసిన కాగితాలన్నీ జాగ్రత్తగా కట్టగట్టి, భావి తరాల వారి కొరకు అటక మీద భద్రపరచేడు.

లక్ష్మణరావు దృష్టి బాహ్య ప్రపంచం నుండి కొద్దిగా లోపలికి మళ్లడం మొదలు పెట్టింది. బాదవ తోటలో కొబ్బరి చెట్టు కింద పద్మాసనం వేసుకుని, "బుద్ధం శరణం గచ్ఛామి" అన్నాడు. మనస్సు నిలకడగా నిలవలేదు. కొబ్బరికాయ నెత్తి మీద పడుతుందేమోనని ఒక భయం. ఆ పక్కనే నేరేడు చెట్ల మీద ఉన్న ఋషి పక్షులు మీద రెట్ట వేస్తాయేమోనని మరొక భయం. ఇటువంటి భయాలతో మనస్సులో ఆలోచనలు పరిపరి దిశలలో పరిగెట్టేయి.

పసందయిన పొడి అక్షరాల పేరు లేకపోబట్టే తన రాతలన్నీ బుట్టపాలు అవుతున్నాయేమోనని అతనిలో ఒక ఆరాటం మొదలయింది. శ్రీశ్రీ, సినారె, కరుణశ్రీ, మొదలయినవారంతా అంత పేరు ప్రఖ్యాతులు

గణించేరంటే అదంతా వారి కవిత్వపు గొప్పతనమేనా? శ్రీశ్రీకి వాళ్ల నాన్న 'పెంటబ్బాయి' అని పేరు పెట్టకపోయినా 'శ్రీరంగం అప్పారావు' అని పేరు పెట్టుంటే మనకి శ్రీశ్రీ ఉండేవాడా? బాపు, ఆరుద్ర వాళ్ల అసలు పేర్లు అట్టేపెట్టుకుని ఉంటే వాళ్లు దమ్మిడీకి చెలామణీ అయేవారా? ఆమాత్రం ముందు చూపు లేని తల్లిదండ్రుల మీద కించిత్తు కోపం వచ్చింది లక్ష్మణరావుకి.

కనీసం 'రామారావు" అనేనా పేరు పెట్టేరు కాదు. లక్ష్మణుడు ఎప్పుడూ రెండవవాడే. ఇలా ద్వితీయ స్థానంలో పడి 'రాట' వమని తన తల్లిదండ్రులు ఇలా పేరు పెట్టి శపించేరా? పేరంటే నచ్చలేదని తల్లిదండ్రుల మీద విరుచుకు పడొచ్చు. ఇంటిపేరు సంగతి? మందపాటి? ఇంకా నయం! మందకొడి కాదు కనుక గుడ్డిలో మెల్ల. ఇటువంటి దీనావస్థలో ఉన్న తన పేరుని సుందరీకరించడం ఎలా? కరుణశ్రీ నుండి వెధవశ్రీ వరకు శ్రీ పేర్లన్నీ గాలించి చూసేడు. మందపాటి ని మందశ్రీ చేస్తేనో? ఛా! "డల్' గా ఉంది. పోనీ పేరు లోని పొడి అక్షరాలకి శ్రీ చేర్చితే? మలశ్రీ వచ్చింది. హతవిధీ! పోనీ మందపాటి లక్ష్మణరావుని 'మలరా' అంటేనో? కలరా లా మలరా ఏంటి? ఒళ్లు మండింది.

ఇలా కొబ్బరి చెట్టు నీడలో కూర్చుని ఆత్మ ప్రక్షాళనం చేసుకుంటూన్న లక్ష్మణరావుని బాహ్య ప్రపంచంలోకి ఈడ్చుకొచ్చినది పైనుండి పక్కనే పడ్డ నారికేళం. చుక్కలో తప్పిపోయింది కనుక సరిపోయింది కాని ఏకపోతే కపాలమోక్షం అయిపోయి ఉండేది. శరీరం గగుర్పొడిచింది. లక్ష్మణకవి తెలిగించిన భర్తృహరి సుభాషితాలలోని పద్యం తళుక్కున మనస్సులో మెరిసింది. దైవోపహతుడు సేద తీర్చుకునేందుకు తాటి చెట్టు నీడని చేరితే తాటి పండు నెత్తి మీద పడిందిట. ప్రస్తుతం నారికేళం నెత్తి మీద పడలేదు కనుక తను దైవోపహతుడు కాదు. లక్ష్మణరావుకి మనో వికాసం కలిగింది. అతని జీవితం ఒక మళుపు తిరిగింది. కొబ్బరిచెట్టు కిందనుండి లేచేడు. నిర్మాణాత్మకంగా ఆలోచించడం మొదలు పెట్టేడు.

కొబ్బరి కాయ కిందకే ఎందుకు పడాలి? ఇది భగవదేచ్ఛ అనేసి ఎలా ఊరుకోవడం? కాయ ఆకాశంలోకి ఎందుకు ఎగిరిపోలేదు? ఆకాశం లోకి ఎగిరిపోకుండా భూమి మీద పడిందంటే దానికి రెండు కారణాలు స్ఫురించేయి. అత్తింటికి వెళ్లిన ఆడకూతురు తిరిగి పుట్టింటికి వచ్చినట్లు కొబ్బరికాయ తన స్వస్థానం చేరుకుందా? లేక బాడవతోటలో ఉన్న భూమికి ఏదైనా ప్రత్యేకమైన శక్తి ఉండి అది కొబ్బరికాయని ఆకర్షిస్తోందా? ఈ రెండవ సిద్ధాంతమే నిజమైతే ఇదే సిద్ధాంతం ప్రకారం భూమి

చంద్రుడిని ఎందుకు ఆకర్షించడం లేదు? ఇలా ఆలోచించి, సంబరపడిపోయి నలుగురితోటీ చెప్పేడు. ఎవ్వరూ నమ్మలేదు. సిద్ధాంతాన్ని కాదు, లక్ష్మణరావుని! ఇదంతా గెలిలియో, కెప్లర్, నూటన్ మొదలయిన వారు అంతా కలసి ఎప్పుడో శతాబ్దాల క్రితమే కనిపెట్టేసేరుట! ఆ సమాచారం ఏమీ తాను చదువుకోకుండానే, ఈ సిద్ధాంతం తన బుర్రలోనే పుట్టిందని ఎంత చెప్పినా ఎవ్వరూ ఖాతరు చెయ్యలేదు. మరీ మాట్లాడితే పిచ్చాసుపత్రిలో పడేస్తామని బెదిరించేరు.

తను ఇలా నలుగురిలోనూ నవ్వుల పాలు కాడానికి కారణం తను ఇంటరులో చేరి, భౌతికశాస్త్రం చదివే వరకు అర్థం కాలేదు. తెలుగులో కవిత్వం చెప్పడం అబ్బలేదు కాని, ఇంటరులో లెక్కలు, భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం బాగా అబ్బేయి. ఆర్కిమిడీస్, ఎవగాడ్రో, గే లుసాక్, బెర్జీలియస్, నూటన్,..., ఇలా ఎంతో మంది హేమాహేమీల గురించి తెలుసుకున్నాడు. ఇంటరు మంచి మార్కులతో పేసయేడు. ఆంధ్రా యూనివర్సిటీలో చేరేడు. సద్ధర్మ సదనంలో మకాం పెట్టేడు.

విశ్వవిద్యాలయపు వాతావరణంలో లక్ష్మణరావు వైజ్ఞానిక విజ్ఞానం మొగ్గ తొడిగి, వికసించి పరిమళించడం మొదలు పెట్టింది. ఊహా శక్తి విస్తరించింది. ప్రపంచజ్ఞానం పెంచుకున్నాడు. కాలం, కర్మం కలసి వస్తే కక్కు వచ్చినట్లు వద్దనుకున్నా కీర్తి వస్తుందనే నీతి పాఠం నేర్చుకున్నాడు. ఉదాహరణకి కెప్లర్ వేసిన లెక్కలలో కనీసం అరడజను తప్పులు కనిపించేయి – లక్ష్మణరావు నిశిత దృష్టికి. కెప్లర్ అదృష్టం తన్నుకొచ్చింది కనుక ఆ తప్పులు ఒకదానిని మరొకటి రద్దు చేసేసుకున్నాయి. కెప్లర్ గొప్పవాడని ప్రపంచం అంతా ఒప్పేసుకుంది.

'అయిన్స్టీనియం,' 'ఫెర్మియం' లలా తన పేరు ఒక రసాయన మూలకానికి పెడితే? నూట అయిదవ మూలకానికి తన పేరు మీద 'మలేరియం' అని పెడితే ఎలాగుంటుందో? సైక్లోట్రానులు, ఏక్సిలిరేటర్లు వంటి ఖరీదైన పరికరాలు లేకుండా అటువంటి పనులు సాధించడం తన తరమా? పోనీ ఒక తోకచుక్క ఉనికి కనిబెడితే? పెద్ద హడావుడి చేసి చివరికి చీదేసిన సిసింద్రీలా తుస్సుమన్నా కహూటెక్ పేరు ప్రపంచం అంతా మోగిపోయిందే!

పేరు చిరస్థాయిగా నిలచిపోవాలంటే మరొక మార్గం ఉంది. ఒక సిద్ధాంతాన్ని లేవదియ్యాలి. ఆ సిద్ధాంతం ఎలా ఉండాలంటే అది తప్పో, ఒప్పో ఎటూ తేల్చడానికి వీలు కాకుండా ఉండాలి. ఉదాహరణకి 'దేవుడు లేడని వాదించే నాస్తికులు ఏమంటున్నారు? "ఏదీ దేవుడు ఉన్నాడని నువ్వు

రుజువు చెయ్యి" అంటున్నారు కదా. దేవుడు లేడని వాళ్లు మాత్రం రుజువు చెయ్యగలరా? అలాగన్నమాట. లక్ష్మణరావు ఈ ఊహనాన్ని మథించి, మథించి చూసేడు. ఇలాంటి ఊహనాలు, ప్రతిపాదనలు, సిద్ధాంతాలు సామాన్యులు ప్రతిపాదిస్తే పుంజుకోవు. అదే ఏ అయిన్స్టయినో ప్రతిపాదిస్తే అది తప్పయినా సరే వేదం అయి కూర్చుంటుంది — కాస్మలాజికల్ కాన్స్టెంట్ లా! శ్రీకృష్ణుడు చేసే రాసక్రీడ, మా ఊళ్లో రంగశాయి చేస్తే....?

4

చదువు పూర్తయి, పట్టా చేతికి రాగానే లక్ష్మణరావు ఎదురు చూస్తూన్న స్వతంత్రం వచ్చింది. హోం వర్కులు, పరీక్షలు, వంటి బాదరబందీలు ఇటుపైన లేవు. పంజరం నుండి బయటపడ్డ పిట్టలా ఉంది అతని జీవితం. ఇటుపైన తనకి ఇష్టం వచ్చిన సిద్ధాంతాలు లేవదియ్యవచ్చు, ప్రయోగాలు చేసుకోవచ్చు.

ఆంధ్రా యూనివర్శిటీలో చిన్న లెక్చరర్ పదివిలో చేరేడు. అంతకంటె చిన్న ప్రయోగశాలని నెలకొల్పేడు. 'వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం' అన్నట్లు లక్ష్మణరావు చవి చూడని సబ్జక్ట్ లేదు. 'కావేవీ కవితకనర్హం' అని శ్రీశ్రీ అన్నట్లు ఎన్నెన్నో విషయాల మీద పరిశోధనలు చేసేడు. భారతదేశాన్ని జంబూద్వీపం అని మనవాళ్లు ఎందుకు అన్నారు? ఆర్యులు ఆర్యావర్తానికి వచ్చిన కొత్త రోజుల్లో ఆవు మాంసం తినేవారట? నిజమేనా? ఎక్కడో ఉత్తర దేశంలో అడవిలో కూర్చుని ఆసేతుహిమాచలపర్యంతం కళ్లకి కట్టినట్లు వాల్మీకి రామాయణంలో ఎలా వర్ణించగలిగేడు? ఆ రోజులలో రహదారులు, ప్రయాణ సౌకర్యాలు లేవు కదా! అర్జునుడు గంగానదిలో మునిగి పాతాళలోకానికి వెళ్లేడంటారు. ఇక్కడ పాతాళలోకం అంటే అమెరికా ఖండం అనిన్నీ, మధ్య అమెరికాలోని 'మాయ' రాజ్యం వాడే భారతంలోని మయుడని ఒక సిద్ధాంతం లేవదీసేడు. పునర్జన్మ సిద్ధాంతమే నిజం అయితే ఈ ప్రపంచంలో ఇలా పాపం పెరిగినట్లు పెరిగిపోతూన్న ప్రజానీకం ఎక్కడనుండి పుట్టుకొస్తూన్నట్లు? వీళ్లంతా వారి పూర్వ జన్మలో ఎక్కడ ఉండేవారు? అధర్వణ వేదంలో నిజంగా అణుబాంబుల గురించి రాసిపెట్టి ఉందా? పురాణాలలో ఉన్న పాతని, పాశ్చాత్యులు ప్రవేశపెట్టిన కొత్తని ఒక తాటి మీదకి తీసుకురావాలని తాపత్రయం పడ్డాడు, పాపం. ఇటూ, అటూ ఎవ్వరినీ మెప్పించలేకపోయాడు.

ఇన్ఫర్మేషన్ థియరీలోని 'ఎంట్రోపీ' అనే ఊహనాన్ని ఉపయోగించి ప్రపంచ భాషలన్నిటికి సంస్కృతమే మాతృభాష అని సిద్ధాంతీకరిస్తూ ఒక వ్యాసమూ, 'సెకండ్ లా అఫ్ థర్మోడైనమిక్స్'

ఉపయోగించి పరకాయప్రవేశము సాధ్యమే అని వాదిస్తూ ఒక వ్యాసమూ, చంద్రుడు గుడి కట్టడానికీ, కీచురాయి కూతకీ, సముదరపు హోరుకీ ఒక పక్కా, వర్షం పడడానికి ఒక పక్కా కారణ కార్య సంబంధాలని సంఖ్యాశాస్త్రపరంగా విశ్లేషిస్తూ ఒక వ్యాసమూ, ఇలా ఎన్నో పరిశోధనాపత్రాలని అనేక రంగాలని స్పర్శిస్తూ ప్రచురించేడు. ఇదంతా జనరంజక విజ్ఞానం అనేవాడు.

విజ్ఞుల మన్ననలు పొందాలంటే 'హార్డ్' సైన్సులో కూడ ప్రచురించాలి కదా. జీవి ఎలా పుట్టిందో, ఎలా పరిణతి చెందిందో అనే విషయాలు జీవశాస్త్ర పరిధిలోకి వచ్చేవే అయినా వీటిని భౌతికశాస్త్రంలోని క్వాంటం గమన శాస్త్రం ఉపయోగించి విశ్లేషించవచ్చని మొట్టమొదట ఈయనే ప్రతిపాదన చేసేడు. అదే బాణీలో అభివృద్ధి చెందాలని తహతహలాడే బడుగు దేశాలని క్వాంటం కూపంలో ఉన్న ఎలక్ట్రానుతో పోల్చి, ఆయా దేశాల ఆర్థిక, రాజకీయ స్థోమతలని 'పొటెన్షియల్' తో పోల్చి, ఈ రెండింటిని ష్రోడింగర్ సమీకరణంలో ప్రతిక్షేపించి, బడుగు దేశాలు కుప్పిగంతులు వేసుకుంటూ ప్రగతి పథంలో ఎలా పైకి లేవగలవో చూపిస్తూ ఒక పరిశోధన పత్రం ప్రచురించేడు.

ఇలా రోజుకో కొత్త ఊహ, కొత్త స్ఫురితం. కొత్త పుంత తొక్కడం అంటే సామాన్యమైన వ్యవహారమా? 'కౌపీనసంరక్షణార్థం హయం పటాటోపః' అన్నట్లు పనులు చెయ్యడానికి విద్యార్థులు కావాలి, వాళ్లని పోషించడానికి 'ఫండింగు' కావాలి, ప్రయోగాలు చెయ్యడానికి సరంజామా కావాలి, ఈ సరంజామాని పెట్టడానికి స్థలం కావాలి. ఇలా ఒకడు బాగుపడిపోతూ ఉంటే చూడలేక అసహనంతో కళ్లు కుట్టుకు పోయిన వాళ్లు ఫేకల్టీ మీటింగులో అడ్డు పుల్లలు వేస్తూ ఉంటే వాటిని అడ్డుకోడానికి కాలం ఖర్చు పెట్టాలి. అయినా సరే ఏకాగ్రతతో గమ్యం మీదనే దృష్టి నిలిపి, తాబేలు–కుందేలు కథలో తాబేలులా నెమ్మదిగా పరిశోధనా పత్రాలు ఒకటీ ఒకటీ ప్రచురిస్తూ కొంచెం పేరు తెచ్చుకున్నాడు.

ఒకనాడు వి. సి. గారి ఆఫీసు నుండి లక్ష్మణరావుకి పిలుపు వచ్చింది. "మంత్రాలకి చింతకాయలు రాలతాయా" అనుకుంటూ ఎదురొచ్చిన అపశకునాన్ని లెక్క చెయ్యకుండా వి. సి. ఆఫీసుకి వెళ్లి, బయట పహరా కాస్తూన్న దవాలీ బంట్రోత్తుకి నమస్కారం చేసినంత పని చేసి, 'స్వింగింగ్ డోర్' తెరుచుకుని లోపలికి వెళ్లేడు.

"మీ టేలెంటు నివురు కప్పిన నిప్పులా ఇలా ఆంధ్రా యూనివర్శిటీలో 'రాట'వడం ఏమీ బాగా లేదండీ."

కులపతి గారి మాటలలోని అంతరార్థం అర్థం కాలేదు, లక్ష్మణరావుకి. చూపుడు వేలితో పైపు లోని పుగాకుని నెమ్మదిగా నొక్కి, అగ్గిపుల్ల గీసి పుగాకుని ముట్టిస్తూ, ప్రశ్నార్థకంగా వీసీ వైపు చూసేడు లక్ష్మణరావు.

"ఎటామిక్ రిసెర్చి సెంటరు కి మీ బేగ్రౌండు ఉన్న మనిషి కావాలిట" అంటూ ఉద్యోగాలున్నాయంటూ వచ్చిన విజ్ఞప్తి పత్రాన్ని లక్ష్మణరావుకి అందజేసేరు వైస్ ఛాన్సలర్.

పని, జీతం ఆకర్షణీయంగానే ఉన్నాయి.

"ఈ ఉద్యోగం నాకు వస్తుందంటారా?"

"ఆ విషయాలన్నీ ఆలోచించకుండా కబురెందుకు పంపుతాను," అంటూ చిన్న నవ్వు నవ్వి, "ఇది మంచి ఆపర్టూనిటీ. ఆలిండియా ఫేము వచ్చే ఛాన్సు. తెలుగువాడు వరిమొక్క లాంటి వాడు. 'ట్రాన్స్ప్లాంట్' చేస్తే కాని రాణించడు. పుట్టిన దేశం వదలి పైకి పోతేకాని ఎదగడు. 'బార్క్' లో చాల మంది తెలుగువాళ్లు పెద్ద పెద్ద పొజిషన్స్ లో ఉన్నారు. మీ కేండీడసీని సిఫార్సు చేస్తూ సేత్నాకి నేను పెరసనల్గా లెటర్ రాస్తాను. ఏమంటారు?

భాభా, సరాభాయ్, సేత్నా, తరువాత లక్ష్మణరావు? సిరిరా మోకాలొడ్డువారు ఎవరుంటారు. అదృష్టం పిలిచినప్పుడు పలకకపోతే మళ్లా పిలవదుట. 'సరే' అన్నాడు లక్ష్మణరావు.

బొంబాయికి బయలుదేరే ముందు సింహాచలం కొండ ఎక్కి, స్వామికి మొక్కి, నున్నగా చెక్కించిన గుండుకి సి. వి. రామన్ లా తలపాగా చుట్టేడు. మామ్మ ఇచ్చిన మాగాయ జాడీ జాగ్రత్తగా మూటలో సర్దుకుని మెద్రాసు మెయిల్ ఎక్కేడు. బండెక్కించడానికి వచ్చిన విసీ గారు పక్కనున్న పి. ఎ. తో, "అమ్మయ్య! వీడి బెడద ఒదిలింది. వీడు ఖాళీ చేసిన పొజిషన్లో 'మన' వాడిని ఎవ్వరినైనా వేయించవోయ్!" అన్న మాటలు రైలు కూతలో, రైలు మోతలో, లక్ష్మణరావుకి వినిపించలేదు.

## 5

బొంబాయిలో కాలు మోపింది మొదలుకొని లక్ష్మణరావు నసీబులో మార్పు కనిపించడం మొదలు పెట్టింది. ఆంధ్రా యూనివర్శిటీలో ఉన్న వసతులతో పోల్చి చూస్తే – నక్కెక్కడ నాగలోకం ఎక్కడ

అనిపించింది. నువ్వు వైదీకివి అంటే నువ్వు నియ్యోగివి అనీ, నువ్వు కమ్మ అంటే నువ్వు కాపు అనీ నిత్యం జరిగే ముసుగులో గుద్దులాట ఇక్కడ కనిపించలేదు. ఏడాది తిరిగే లోగా రెండు పరిశోధనా పత్రాలు ప్రచురించేడు. తరువాత పంపిన పత్రాలు పై అధికారి బల్ల దగ్గర ఆగిపోయాయి. జీతం పెరిగింది. పదవి పెరిగింది. పరపతి పెరిగింది. పరిశోధనా పత్రాల ప్రచురణకి పెర్మిషన్ మాత్రం రాలేదు.

- - - - - - - - - ...

ప్రధానమంత్రి కార్యాలయం నుండి బయటకి నడుస్తూన్న లక్ష్మణరావు రెండంగుళాలు ఎత్తు పెరిగినట్లు ఫీలయ్యాడు.

... ... ... ...

గ్రౌండ్ జీరో దగ్గర కౌంట్ డౌన్ విజయవంతంగా పూర్తయితే పక్కనున్న ఎర్ర టెలిఫోను తీసి "బుద్ధుడు నవ్వేడు" అనాలి. ఏదైనా తేడా వస్తే "బుద్ధం శరణం గచ్ఛామి" అనాలి. అన్నీ మనస్సులో పదే పదే మననం చేసుకున్నాడు. మూడవ నంబరు టెస్ట్ టన్నెల్లో తను రహశ్యంగా దాచిపెట్టిన మామ్మిచ్చిన మాగాయ సీసా సంగతి ఎవ్వరికీ తెలియకూడదు.

"పది, తొమ్మిది, ఎనిమిది, ఏడు, ఆరు, ఆయిదు, నాలుగు, మూడు, రెండు, ఒకటి."

కాలి కింద భూమి కొద్దిగా కంపించింది. 'గ్రవుండ్ జీరో' దగ్గర చిన్నగా గాలి దుమారం రేగింది. ఆపెన్హైమర్లా లక్ష్మణరావు కూడ గీతలో ఒక శ్లోకాన్ని చదవడానికి ప్రయత్నించేడు. కాని ఇక్కడ "దివి సూర్య సహస్రస్య..." నప్పదాయె! సందర్భానికి నప్పే శ్లోకం వేళకి తట్టదాయె! ఒణుకుతూన్న చేతులతో ఎర్ర టెలిఫోను తీసి ఢిల్లీకి వార్తని అందించేడు లక్ష్మణరావు.

భూగర్భంలో ప్రయోగాత్మకంగా పేల్చిన అణుబాంబు అన్ని విధాలా దిగ్విజయం అయిందనే ఒప్పుకోవాలి. ఈ సందర్భం పురస్కరించుకుని పాశ్చాత్య దేశాలలో ప్రావీణ్యం సంపాదించిన పెద్దలు సంప్రదాయానుసారంగా షేంపెయిన్ సీసాలు ఊదేసేరు. సనాతనుడయిన లక్ష్మణరావు మాత్రం మామ్మ చేసిన మాగాయ ముక్క నంచుకుని మజ్జిగా అన్నం తిన్నాడు. ఏమయినా ఆంధ్రుడుకీ ఆవకాయ డొక్కకీ అవినాభావ సంబంధం ఉంది.

ప్రాజెక్టులో అహర్నిశలూ పని చేసిన సిబ్బంది అందరికీ సెలవు ప్రకటించేరు. అందరూ ఎవరి ఇళ్లకి వారు వెళుతున్నారు. లక్ష్మణరావు రాయపూరు మీదుగా వైజాగు వచ్చే బండి ఎక్కేడు.

సింహాచలం కొండ దిగువని రైలు బండి పరిగెడుతూ ఉంటే లక్ష్మణరావు గుండెల్లో ఏదో రైలు పరిగెడుతోంది. ఒంటికి ఏదో వచ్చింది. చలిజ్వరం వచ్చినవాడిలా వణుకు, గాభరా! స్వామికి కోపం వచ్చిందేమోనని బండిలోంచే దండం పెట్టుకున్నాడు. కడుపులో దేవినట్లయింది. ఓక్క పరుగున లేవటరీకి వెళ్లేడు. విరేచనం అయింది. భళ్లున వాంతి చేసుకున్నాడు.

గోపాలపట్నం ఔటరు దగ్గర బండి ఆగిపోయింది. ఒళ్ళంతా నీరసం వచ్చేసింది. కళ్లు చీకట్లు కమ్ముతున్నాయి. గొంతుక పిడచ కట్టుకు పోతోంది. వెధవ బండి కదలదేం? మరిడి వ్యాధి ఏమోనని భయపడి దగ్గరకి వచ్చి ముట్టుకోడానికి కూడ భయపడుతున్నారు తోటి ప్రయాణీకులు. నెమ్మదిగా కాళ్లీడ్చుకుంటూ బండి వాల్తేరు స్టేషన్ చేరుకుంది. బండి దిగి, ప్లేట్ఫారం మీద కాలు పెట్టేడో లేదో కుప్పలా కూలిపోయాడు లక్ష్మణరావు. జీవితాంతం కలలు కన్న గమ్యం అందుబాటులోకి వచ్చే వేళకి నూనె నిండుకున్న దీపంలా లక్ష్మణరావు ఒక్క వెలుగు వెలిగి ఆరిపోయాడు. తెలుగు గడ్డ గాలి తగిలేసరికి ఏదో మహామారి నిండు వయస్సులో ఉన్న మనిషిని పొట్ట పెట్టుకుంది.

లక్ష్మణరావు మరణవార్త విద్యుత్ఘాతంలా తగిలింది నయాదిల్లీకి. మిలటరీ వారు నిమిషాల మీద మృతదేహాన్ని తమ అధీనంలోకి తీసుకున్నారు. ప్రభుత్వం వారి పర్యవేక్షణలో మిలటరీ వైద్యులు శవపరీక్ష చేసేరు. రేడియేషన్ వల్ల సంభవించిన మరణం కాదని తేలిన తరువాతనే లక్ష్మణరావు మరణ వార్త దేశానికి తెలిసింది. మనవారి ప్రయత్నం లేకుండానే అమెరికాలో కూడ — ప్రభుత్వ, మిలటరీ వర్గాలకి – ఈ వార్త తెలిసింది.

ఎంత బుర్ర బద్దలు కొట్టుకు చచ్చినా ఈ చావు ఎలా సంభవించిందో వైద్యులకి అర్థం అయి చావ లేదు. కారణం ఇదమిత్థంగా తేలేవరకూ శవాన్ని దహనం చెయ్యడానికి ప్రభుత్వం ఒప్పుకోలేదు. పేథాలజీ వారు ప్రేతాన్ని ఏ కీలుకాకీలు విడగొట్టి కంచు కాగడాతో కారణం కోసం వెతుకుతున్నారు.

రెండు రోజులు తిరిగేసరికి లక్ష్మణరావు సహోద్యోగి ఒకడు మెద్రాసులో హరీ మన్నాడుట. చలి, వణుకు, వాంతులు, విరేచనాలు. శరీరం అతి త్వరగా ఎండిపోయిందిట. లక్షణాలు పొడచూపిన కొద్ది నిమిషాలలో ప్రాణం పోయిందిట.

రెండు సార్లు కోకిల కూసినంత మాత్రాన వసంతం వచ్చేసినట్లేనా? ఇద్దరిలో ఒకే రోగ లక్షణాలు కనిపించినంత మాత్రాన్న బాణీ అయిపోదు కాని, మరణించిన వారిద్దరూ సహోద్యోగులు కావడంతో ఇదేదో విషప్రయోగమో, అంటు రోగమో అయి ఉండాలని అనుమానించేరు. విషప్రయోగం అవునో కాదో తేల్చుకుందుకి పోలీసు దర్యాప్తు మొదలయింది. అంటు రోగమో కాదో తేల్చుకుందుకి ఒక వైద్య బృందాన్ని నియమించేరు. ఈ పత్తేదారీ పనులు ఇలా ఒక పక్క జరుగుతున్నాయి, మరణిస్తూన్న వారి సంఖ్యా బలం మరొక పక్క నుండి పెరుగుతోంది.

ఈ తాజా వ్యాధికి "ఎం. ఏల్. ఆర్. సింద్రోం" అని తాత్కాలికంగా పేరు పెట్టేరు. అంటే "మందపాటి లక్ష్మణరావుకి వచ్చిన జబ్బు లాంటి జబ్బు" అని అర్థం. మలేరియా, కలరా లక్షణాలు కనిపిస్తున్నాయి కనుక దీనికి "మలరా" అంటే బాగుంటుందని ఒక పాత్రికేయుడు సూచించేడు. దివంగతుడైన వ్యక్తి పేరులోని పొడి అక్షరాలని పేర్చితే "మలరా" వస్తోంది అని మరొక సద్యోజాత శాస్త్రవేత్త సూచించేడు.

కార్చిచ్చులా మలరా భారతదేశం నుండి బంగ్లాకి, పాకిస్తాన్ కి కూడ పాకురుతోంది. ఇరుగు పొరుగు దేశాలు ఆరాట పడడం మొదలెట్టేయి. కల్లు తాగిన కోతి నిప్పు తొక్కినప్పుడు గెంతినట్లు గెంతేడు పాకిస్తాన్ ప్రధాని భుత్తో. "ప్రతి 'ప్రాచ్యుడూ' తగుదునమ్మా అంటూ అణుబాంబులు పేలుస్తానంటే ప్రపంచం ఇలానే తగలడి పోతుంది" అని గురువింద గింజ సామెత తెలియని నిక్సన్ రుసరుసలాడేడు. ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో దర్యాప్తు జరిపించి ఈ మాహామారికి కారణభూతమైన దేశాన్ని శిక్షిస్తానని పత్రికా విలేకరుల సమావేశంలో ఉద్ఘాటించేడు.

ఇలా అంతర్జాతీయ రంగంలో అల్లరి పెరిగేసరికి ఇంతకు ముందు ఎన్నడూ కని, విని, ఎరగని మలరా ఎలా ఉద్భవించిందో తెలుసుకోవలన్న పట్టుదల దేశంలో అధికారులకి పెరిగింది. బాంబు పేలిన స్థలం అంతా శోదా చేసి చూసేరు. మూడవ నెంబరు టెస్ట్ టనెల్లో కీ. శే. మ. ల. రా రహశ్యంగా దాచి పెట్టిన మాగాయ సీసా కనిపించింది. కాని ఆ సీసాలో సరుకు ఏ విధంగానూ పాడవలేదు, బొంబాయిలో లక్ష్మణరావు పని చేసే ఆఫీసుని అంతా గాలించి, శోదా చేసేరు. మొదటి దఫాలో మరణించిన

వారంతా లక్ష్మణరావు ఆఫీసు చుట్టుపక్కల ఉన్న గదులలో పని చేసినవారే అని తేలగానే ఆ భవనంలో ఆ భాగాన్ని బాగా గాలించి చూసేరు. అక్కడ మరొక మాగాయ సీసా కనిపించింది.

ఆఖరికి తేలిన విషయం ఇది. బొంబాయిలో లక్ష్మణరావు పని చేసే ఆఫీసు గదిలో ఒక పాత టెలివిషన్ సెట్ ఉంది. ఆ సెట్ లో ఉన్న ఫ్లై బేక్ ట్రాన్స్ఫార్మర్ సరిగ్గా పనిచెయ్యక దానికి సంబంధించిన శూన్య నాళిక ఒకటి ఎక్స్ కిరణాలని నిష్యందిస్తోందిట. ఈ టెలివిషన్ సెట్ ఉన్న బల్ల పక్క బీరువాలోనే లక్ష్మణరావు బామ్మ ఇచ్చిన మాగాయ సీసా ఉందిట.  చెమ్మ తగిలిన మాగాయకి చిన్నగా బూజు పట్టిందిట. ఈ రకం బూజు అంత ప్రమాదకరమైనది కాదుట. కొద్ది సేపు ఎండలో పెడితే మాగాయ బాగుపడిపోతుందిట. నిరపాయమైన ఈ బూజుకి ఒక నియతమైన శక్తి ఉన్న ఎక్స్ కిరణాలు తగిలేసరికి కొంపలు అంటుకున్నాయిట.

అన్ని కణాలలో లాగే బూజు లోని జీవకణాలలో కూడ వారసవాహికలు ఉంటాయి. ఈ వారసవాహికలలోని జన్యువుల పర్యవేక్షణలోనే ప్రాణ్యములు తయారవుతాయి.  ఈ పద్ధతి ప్రకారం బూజు తయారు చేసే ఒక ప్రాణ్యపు బణువులో ఒక చోట సిస్టీన్ అనే నవామ్లం ఉందిట. ప్రాణ్యపు బణువుని ఒక పూసల గొలుసులా ఊహించుకుంటే ఈ సిస్టీను ఆ గొలుసులో ఒక "జంట పూస" లాంటిది.  అంటే ఒకే పూస గొలుసులో రెండు చోట్ల వస్తుంది. ఇది సాధ్యం అవాలంటే ఆ గొలుసు మెలికలు తిరగాలి. టెలివిషన్ సెట్ నుండి స్రవించిన ఎక్స్ కిరణాల ప్రభావం వల్ల వారసవాహికలు దెబ్బ తినడంతో ఈ జంట పూస లోని ద్విగంధక బంధం కూడ దెబ్బతిని విడిపోయి, చుట్టూ ఉన్న చెమ్మలోని ఉదజని అణువులతో సంయోగం చెంది థయోల్ గుంపులుగా మారిపోయిందిట. ఈ మార్పు వల్ల సిస్టీన్ కాస్తా సిస్టయిన్ గా మారడం వల్ల మన ప్రాణ్యపు బణువులో ఉండవలసిన చోట మెలిక పడలేదుట. ఈ ఒక్క మార్పు వల్లా గొలుసుకట్టుగా అనేక  మార్పులు పుంఖానుపుంఖంగా వచ్చి నిరపాయకరమైన బూజు కాస్తా మహమ్మారిగా మారిందిట.

ఎక్స్ కిరణాల శక్తిలో ఏమాత్రం తేడా వచ్చి ఉన్నా జన్యువులలో ఇటువంటి ప్రతివర్తిత వచ్చి ఉండేది కాదుట. ఎందుకంటే సిస్టయిన్ లోని థయోల్ గుంపుకి వికిరణపు మోతాదు (రేడియేషన్ డోసు) ఏమాత్రం ఎక్కువయినా నిశ్చలత్వం పోగొట్టుకుని నశించిపోతుందిట. బాంబు పేలినప్పుడు పుట్టిన మహా శక్తిమంతమైన ఎక్స్ కిరణాలు మూడవ నంబరు టెస్ట్ టన్నెల్లో కి జొరబడి అక్కడ ఉన్న

బామ్మగారి మాగాయకి పట్టిన బూజుని – ప్రతివర్తితలతో ఆగకుండా – సమూలంగా చంపేసింది ట. అందువల్ల ఆ సీసాలోని మాగాయ తిని ఉంటే – అందులో రేడియాషన్ దోషం ఉండొచ్చేమో కాని – దాని వల్ల మహామారి రోగం వచ్చే ప్రమాదం ఉండేది కాదుట.

ఇలా ప్రతివర్తితలు చెందిన బేక్టీరియా మనిషి శరీరంలో చేరి అతి శీఘ్రంగా ప్రాణం తియ్యగలదుట. ఈ సూక్ష్మజీవులు రోగి శరీరం నుండి ఉమ్మి, వాంతి, విరాచనాల రూపంలో బయటకి వచ్చి, ఎండిపోయి, 'స్పోరు' లుగా తయారయి, గాలిలో తేలి, సునాయాసంగా ఆమడల దూరం ప్రయాణం చేసి, చెమ్మ తగిలినప్పుడల్లా చేవ పుంజుకుని చంపుతున్నాయిట.

"కనుక దక్షిణ ఆసియాలో ఈ మహామారి విజృంభించడానికి కారణం అణు బాంబు ప్రయోగంలో భారత దేశపు అప్రమత్తత కానే కాదు. ఈ ప్రమాదానికి మూల కారణం చెత్తగా తయారు చెయ్యబడ్డ టెలివిషన్ సెట్," అని నివేదిక సమర్పించేరు కమిటీ వారు.

ఈ టెలివిషన్ సెట్ ఎవ్వరు తయారు చేస్తే ఆ కంపెనీ, ఆ దేశం కూడ ఈ ప్రమాదానికి కారకులు అని ప్రతిపాదిస్తూ ఒక పత్రికా విలేకరి ఒకామె మరి కొంచెం కూపీ లాగిందిట. ఇదేమీ అంత కష్టమైన పత్తేదారీ పని కాదు. ఎందుకంటే ఆ టెలివిషన్ సెట్ మీదనే పెద్ద పెద్ద తాటికాయంత అక్షరాలతో, "అమెరికా ప్రభుత్వం పి. ఎల్. 480 ప్రణాళికలో భారత దేశనికి ఇచ్చిన కానుక" అని ఉందిట.

కమిటీ వారి నివేదిక, పత్రికా విలేకరి సమగ్రంగా పరిశోధన చేసి పత్రికలలో ప్రచురించిన పాఠం అమెరికా ప్రభుత్వానికి ఒక కాపీ, ఐక్యరాజ్య సమితికి ఒక కాపీ భారత ప్రభుత్వం పంపించింది. కారణాంతరాల వల్ల ఈ విషయం జనరల్ ఎసెంబ్లీలో చర్చకి రాలేదు.

## 6

చిరునవ్వుతో చేతిలో ఉన్న కపాలాన్ని దీక్షగా చూస్తూ, "నిజమే నాయనా! నాది పొరపాటే. 'బృహత్ భోగో భవిష్యతి' అని రాయవలసింది" అన్నాడు బ్రహ్మ.

తండ్రి వాక్యంలోని వ్యంగ్యాన్ని గమనించేడు నారదుడు. విధాత తన రాతలోని ఆంతర్యాన్ని ఇలా వివరించేడు.

“సింహాచలంలొ నృసింహస్వామి ఆలయ ప్రాంగణం నుండి  పిఠాపురంలో ఉన్న కుక్కుటేశ్వరుడి ప్రాంగణంలో ఉన్న పాదగయ వరకు ఉన్న భూభాగం గయుడు అనే రాక్షసుడి మృతదేహంతో కల్మషమైంది. ఆ భూమిలో పుట్టి, పెరికి జీవితాంతం కీర్తి కాంక్షించిన అభాగ్యుడి కపాలం ఇది. విధినీ, విధాత రాతనీ ఎవ్వరూ అధిగమించలేరు. దేశం అంతా తిరిగి తిరిగి ఈ పాపభూమిని తాకిన తరువాతనే ఇతనికి మరణం సిద్ధించింది. మరణానంతరమే లక్ష్మణరావు ప్రతిభ ప్రపంచానికి తెలిసింది. అందుకనే ‘కించిత్ భోగో భవిష్యతి’  అని రాసేను.

“మరయితే ‘బృహత్భోగో భవిష్యతి అని రాయవలసింది’  అనడంలో.....”

విచార వదనంతో ఉన్న కుమారుడిని ఊరడించదానికా అన్నట్లు విరించి ధరహాసంతో ఇలా అన్నాడూ:

“ఈ కపాలం కాలచక్రంతో పాటు పంచభూతాలలో కలసిపోదానికి బదులు నీవంటి దేవర్షి హస్తాలలో పడి సత్యలోకంలో ఉన్న నా చేతిలోకి వచ్చిందంటే అది కించిత్ భోగం ఎలా అవుతుంది?”

“నారాయణ! నారాయణ! అంటూ నారదుడు బ్రహ్మ దగ్గర శలవు తీసుకున్నాడు..”

**కథ వెనుక కథ:**

ఆంధ్ర పత్రిక సచిత్ర వారపత్రిక, 13 సెప్టెంబరు 1974 లో ప్రచురితం. అక్కడక్కడ చిన్న చిన్న తప్పులని సవరించడం మినహా ఈ కథలో పెద్ద మార్పులు ఏమీ చెయ్యలేదు.

ఈ కథ మొదటి భాగం, చివరి భాగం మా నాన్నగారు, శ్రీ వేమూరి సోమేశ్వరరావు గారు, తరచు చెప్పే కథలలో ఒకటి. మధ్య భాగం నా కల్పన.

# బ్రహ్మాండం బద్దలైంది

కోటు కొక్కేనికి తగిలించి, ఆఫీసు తలుపుకి లోపల గెడ పెట్టి, కాళ్లు రెండూ బల్ల మీదకి బారజాపి, కుర్చీలో కూర్చున్నారు, మిడతంభొట్లు మేష్టారు. అక్కడక్కడ పలచబడుతూన్న జుట్టు గుండా చేతి వేళ్లు పోనిచ్చి, ఎదురుగుండా ఉన్న గాజద్దాల కిటికీలోంచి శూన్యంలోకి చూస్తూ కూర్చున్నారాయన. గదిలో వాతనియంత్రణ ఉన్నప్పటికీ ఎప్పుడూ నిశ్చలంగా ఉండే ఆయన విశాలమైన నుదుటి మీద ఘర్మ బిందువులు ఆయన మనస్సులో చెలరేగుతూన్న తుఫానుకి ప్రత్యక్ష తార్కాణంగా నిలిచేయి. అప్పుడే ఇంటి వద్ద తాగి వచ్చినా, ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసుకుని మళ్లా తాగేరు. కుర్చీలోంచి లేచి, ఆఫీసు గదిలోనే బోనులోని పులిలా పచార్లు చేసేరు. తక్షణ కర్తవ్యం ఏమిటో తేల్చుకోలేక, దిగాలుగా మళ్లా కుర్చీలో కూలబడ్డారు.

ఆ రోజు ఆఫీసుకి బయలుదేరే సమయం అది. అద్దం ముందు నిలబడి తల దువ్వుకుంటున్నాడు తను. కాఫీ కుంపటి దగ్గర ముక్కాలి పీట మీద కూర్చుని, రాధతో కబుర్లు చెబుతూ··· గుంటవెధవ··· ఊరుకున్నాడా? ఏటం బాంబులా ఒదిలేడు. మరొకడూ, మరొకడూ అయితే, ఏదో ఈ రోజుల్లో కుర్రకుంకలు కూసే అర్థంలేని ఊత పదాల్లో ఇదొహటని సర్దుకుని ఊరుకునేవాడు తను. కాని మిడతంభొట్లు ఏదో సామాన్యమైన ఉల్ఫాగాడైతే భారత ప్రభుత్వం ప్రత్యేకంగా ఆహ్వానించి, రక్షణ శాఖలోని శాస్త్రవేత్తల సిబ్బందికి ఈయనని నాయకుడిగా నియమించేవారా? ఆంధ్రా యూనివర్శిటీలో అలా రాటవుతూ ఉండేవాడు. దైనందిన జీవితంలో ఏవో సామాన్యమైనవని అందరూ నిర్లక్ష్యం చేసే చిన్న చిన్న సంఘటనలలో ఏదో అసమాన్యత కనిపిస్తుంది మిడతంభొట్లు నిశితమైన దృష్టికి. ఈ సమర్ధతని దొరతనం వారు వాడుకోదలిచేరు.

ఈ విశ్వానికి అయిదవ కొలత ఉందంటూ ఈయన ఒక ప్రతిపాదన చేసి, దానిని సమర్ధిస్తూ వ్యాసాలు రాసి ప్రచురించేరు. ఆంధ్రా యూనివర్శిటీలో బ్రిడ్జి ఆడకుండా ఒక మూలని పడి ఉన్న ఇతగాడి రచనలు సముద్రాలు దాటి ఆవలికి వెళ్లేయి. సమర్ధులు, శ్వేతవర్ణులు అయిన శాస్త్రవేత్తలు కొందరు "ఔరా!" అన్నారుట. అని ఊరుకున్నారా? లేదే. "మిడతంభొట్లు రాసిన సిద్ధాంతాలు చదివి అర్థం చేసుకోడానికి పంచేంద్రియాలు చాలవు. దివ్యదృష్టి వంటి ఆరవ ఇంద్రియం కూడ ఉండాలి" అని రాశాట్ట ఒక దొర.

రాసి ఊరుకున్నాడా? లేదే. " ఎ సిక్స్త్ సెన్స్ ఈజ్ రిక్వైర్డ్ టు ఎప్రీషియేట్ ద ఫిఫ్త్ డిమెన్షన్" అని ఇంగ్లీషులో చమత్కరించేడుట.

"మీ తెలుగు ఇటాలియన్లా ఉందిస్మీ" అని ఒక దొరగారు అబ్బుర పడేసరికి అది పొగడ్తా, గిగడ్తా అని కూడ ఆలోచించకుండా తుళ్లిపడి ఆనందించిన తెలుగువాడిలా అదరి పడింది నయా దిల్లీ. పడి, పదవినిచ్చి పట్టం గట్టింది.

పులి కడుపున పిల్లి పుడుతుందా? మిడతంభొట్లు గారి వంశోద్ధారకుడు పసితనంలోనే పరిమళించడం మొదలెట్టేడు. "ఏమండీ దివ్యదృష్టి గారూ" అని తనని సరదాకి ఎవ్వరైనా పలకరించినప్పుడు, తేలికగా నవ్వి పారేసేవాడు కాని తన కుమార రత్నానికి ఆ శక్తి ఉందేమోనని అప్పుడప్పుడు అనుమానించకపోలేదు.

ప్రతి తండ్రి తన కొడుకుకి నోబెల్ బహుమానం రావాలని కోరుకోవడంలో తప్పు లేదు. తను సాధించలేని పనులన్నీ తన కొడుకైనా సాధించాలని అనుకోవడంలోనూ వింత లేదు. మిడతంభొట్లు ఇటువంటి మానవ దౌర్బల్యాలకి అతీతుడు కాదు. కాని చిరంజీవికి దివ్యదృష్టి ఉందేమోనని అనుమానపడడానికి, పుత్రవాత్సల్యానికి అతీతమైనవి, బలమైనవి అయిన ఆధారాలు ఉన్నాయి. ఏడాది క్రితం సంగతి. ప్రభుత్వపు పని మీద తను గ్రామాంతరం వెళుతూ ఉంటే, "వర్షం పడుతుంది. రెయిన్ కోటో, గొడుగో పట్టుకెళ్లండి నాన్నా" అన్నాడు వాడు. వెళ్లేది ఎడారి లోకి. అక్కడ దశాబ్దానికొక జల్లు పడితే అది పత్రికలలో పతాక శీర్షిక నధిష్టించే వార్త. అటువంటి ఎడారిలో కుండపోతగా వర్షం కురిసిందారోజు. ఇటువంటి చిన్న చిన్న సంఘటనలు ఎన్నో జరిగేయి. మిడతంభొట్లు తార్కిక బుద్ధికి ఇలా చెదురుమదురుగా జరిగిన సంఘటనలలో రాను రాను ఒక బాణీ కనిపించసాగింది. అనుమానం పుట్టింది. పెను భూతమై కూర్చుంది. ఆయన మస్తిష్కంలో కుమ్మరి పురుగై గొలకడం మొదలు పెట్టింది.

చంద్రుడు గుడి కట్టినా, కీచురాయి కూత కూసినా, సముద్రం హోరు పెట్టినా వర్షం పడుతుందని మామ్మ జోశ్యం చెప్పేది. ఆకాశవాణి వారు చెప్పినప్పుడు భరోసా ఏమీ లేదు కానీ, మామ్మ చెబితే వరుణదేవుడు టెంకలు కొట్టుకుంటూ వచ్చేవాడు. అంతమాత్రం చేత మామ్మకి దివ్యదృష్టి ఉందని తనెప్పుడూ అనలేదే. చిరంజీవి పద్ధతికీ, మామ్మ పద్ధతికీ చాల తేడాలు ఉన్నాయి. మామ్మగారిని అడగని వాళ్లది పాపం. అడిగినవాళ్లందరికీ, కుల మత బేధాలు చూపించకుండా, తన జోశ్యాన్ని ఉచితంగా

పంచిపెట్టేది. ఉత్త జోశ్యం చాల మంది చెబుతారు. భవిష్యత్తుని తెలుసుకున్న తరువాత, భవిష్యత్తు కళ్ల ముందు విడుతూ ఉంటే, నాటకాన్ని చూస్తూన్న ప్రేక్షకుల్లా, స్థబ్దుగా కూర్చోవడం ఆవిడకి ఇష్టం లేదు. వర్షం పడదని తెలిస్తే, అవసరం వెంబడి అవధానికి కబురంపి, ఈశ్వరుడికి సహస్ర ఘట్టాభిషేకం చేయించేది. వేసవి కాలంలో చెట్లన్నీ సిపాయిల్లా కదలిక లేకుండా నిలబడి ఉంటే, గుమాయింపు తగ్గడానికని, "దూ గాలీ, దుప్పన్న గాలీ, పాటి మీద గాలీ, పా(రా గాలీ" అని వాయుదేవుణ్ణి బుజ్జగించేది. టూకీగా చెప్పాలంటే భవిష్యత్తుని లోకకల్యాణార్థం మరమ్మత్తు చెయ్యడానికి వెనకతీసేది కాదు ఆమె. ఈ అంశే మిడతంభొట్లు నాన్నగారిలోనూ ఉండేది. ఆయన జాతకాలు మరమ్మత్తు చేసేవారు. ఆయనలో ఉన్న ప్రత్యేకత జాతకాలనీ హోమియోపతీ వైద్యాన్నీ అనుకూలమైన పాళ్లల్లో మేళవించడం. లేకపోతే ఏమిటి? బంగారాన్ని ముట్టుకుంటే మట్టవుతూన్న ఒక దైవోపహతుడి జాతకంలో శని మహాదశని మరమ్మత్తు చేసి జాతకుడిని అమెరికా ఎలా పంపగలిగేరాయన? చాల మంది దీన్ని "ఆటో సజషన్" అని వ్యాఖ్యానించేరు. మరికొంతమంది "సైకలాజికల్ ట్రీట్మెంట్" అన్నారు. ఏది ఏమైనా ఇదేదో వంశపారంపర్యంగా వస్తూన్న అంశలా ఉంది కానీ…

"పోలికలు ఎక్కడికి పోతాయి?" అనుకుంటూ మిడతంభొట్లు చాల కాలం సమర్థించుకుని ఊరుకున్నారు. కానీ కుర్రాడి బాణీ కొట్టొచ్చినట్లు కనిపిస్తూ ఉంటే. "ఒరేయ్ నాన్నా, నైన్ డౌన్ ఎంత లేటవుతుందిరా?" అని అడగండి. ఆ విషయం రైల్వే వారికెంత తెలిసేదో వీడికీ అంతే తెలిసేది. బిక్కమొహం మాత్రం జవాబుగా మిగిలేది. లేకపోతే ఏ మహాలక్ష్మీ లోనో గుర్రాల మీద కాసి ఈ పాటికి బంగారపు ఇటికలతో… ఎప్పుడో మూడు ముక్కలు చెబుతాడు. అది భవిష్యత్ పురాణమో ఉత్త ఊకదంపుడో మిడతంభొట్లు గారికి తెలిసిపోయేది.

"బ్రహ్మాండం బద్దలవుతోంది నాన్నా" అన్నాడు కుంక ఆ ఉదయం. వెంటనే తను ఆ మాటని అంతగా పట్టించుకోలేదు. కాని రాను రాను ఆ మాటలు పదే పదే జ్ఞాపకం వచ్చేయి. ఆ మాటలలో ఏదో అంతరార్థం ఉన్నట్లు ఆయన అంతర్వాణి చెప్పసాగింది. ఎంత వద్దనుకున్నా ఆ విషయం తలుచుకోకుండా ఉండలేకపోతున్నారాయన. డ్రైవరు కారు తోలుతూ ఉంటే వెనక సీట్లో కూర్చుని అలా మథన పడుతున్నారు.

మనస్సు కలవరపడ్డప్పుడల్లా శూన్యంలోకి దృష్టిని కేంద్రీకరించడం ఆయనకి అలవాటు. ఈ రోజూ అదే పని చేశారు. ముందస్తుగా కంటి ముందు ఏదో నలకలాంటి వెలుగు కనిపించింది. ఆయన కళ్లు నులుముకున్నారు. ఆ నలక అక్కడే ఉంది. మధ్య వేలుని కంటి రెప్ప మీద ఉంచి నెమ్మదిగా నొక్కేరు. ఆశ్చర్యం. ఆ నలక కదల లేదు; అక్కడే ఉంది. పైపెచ్చు "ఇంతింతై, వటుడింతై" అన్నట్లు ఆ నలక పెరగడం మొదలు పెట్టింది. శంఖాకారం పొందింది. ఆ శంఖం పెరుగుతూ, సాగుతూ, అలా అనంతాకాశంలోకి వెళ్లిపోయింది. శూన్యమనే నల్లటి కొండలో వెలుగుతో దొలిచిన సొరంగంలా అనిపించింది. తను మాత్రం ఆ సొరంగానికి ఈవలి దరిని ఉన్నాడు. నూతిలోనుండి వస్తూన్నట్లు ఆ సొరంగపుటద్దరి నుండి అవ్యక్తమైన శబ్దం ఒకటి వినిపించసాగింది. ఒకసారి తలలో పోటు వచ్చినట్లయింది. శరీరంలోని శక్తినంతటినీ కూడగట్టుకుని ఆ శబ్దం మీదే మనస్సుని లగ్నం చేసేరు మిడతంభొట్లు. గళబిళ ధ్వనిగా మొదలయిన ఆ శబ్దం క్రమేపీ తేటబారింది. ఏవో మాటలు వినిపిస్తున్నాయి…. "మీ లోకం…మీ నక్షత్రం… నవ ..నొవ…" మాటలు ఖణిగా వినిపించలేదు. భావం ఏమిటో అవగాహన కాలేదు. తమాషా ఏమిటంటే ఆ మాటలు ఎక్కడో ఆకాశం నుండి వచ్చిన – సినిమాల్లో చూపించే అశరీరవాణి – మాటలులా లేవు. తన అంతర్వాణే తనని దేని గురించో హెచ్చరిస్తూన్నట్లు అనిపించింది. ఇంకా మనస్సుని ఆ శబ్దం మీద కేంద్రీకరించి వినాలి….

"బాబుగారూ, ఆఫీసుకి వచ్చేశాం," అన్న డ్రైవరు మాటలు మిడతంభొట్లు ఆలోచనలకి అంతరాయం కలిగించి అనంతపుటవధులనుండి ఈ లోకానికి తీసుకు వచ్చేయి.

## 2

ఆఫీసులో అడుగు పెట్టేరన్నమాటే గాని మిడతంభొట్లు గారి మనస్సు మాత్రం ఈ లోకంలోకి రాలేదు. కళ్లెం లేని గుర్రంలా పరిపరివిధాల పరిగెడుతోంది. ఏదో కుర్రవాడి కొంటె కూతలనే పునాదుల మీద తను నిర్మించిన ఊహాసౌధాలని తలుచుకుంటే తనకే నవ్వు వస్తోంది. కాని నుదిటి మీద చిరు చెమటల సంగతి? కాళ్లల్లో నీరసం సంగతి? హృదయ ఘాతం కాదు కదా? మరో కప్పు కాఫీ తాగి వైద్యుడికి ఫోను చేసేరు.

"హృద్రోగం ఎవ్వరికి వస్తుందో చెప్పలేను కాని, మీకు రాదని హామీ ఇవ్వగలను." బిగ్గరగా నవ్వేరు డాక్టరు. "బక్కపలచని శరీరం. రోజూ వ్యాయామం చేస్తారు. ధూమపానం చెయ్యరు. మాదక ద్రవ్యాలు

పుచ్చుకోరు. ముక్క తినరు. చుక్క తాగరు. మీ వంశంలో గుండెపోటు వచ్చిన దాఖలాలు లేవు. మీకు హృదయ ఘాతం ఏమిటి? అయినా ఒకసారి పరీక్ష చేస్తే సరిపోతుంది. సాయంకాలం ఒక సారి ఇటు రాండి."

మిడతంభొట్లు నెమ్మదిగా తేరుకున్నారు. పని మీద మనస్సు పోవడం లేదు. కొంచెం విశ్రాంతి అయినా దక్కుతుందని కాళ్లు రెండూ బల్ల మీదకి బారజాపి, తూగుకుర్చీలో వెనక్కి జారబడి, కళ్లు మూసుకుని కూర్చున్నారు. అలా ఎంతసేపు కూర్చున్నారో ఆయనకే తెలియదు. ఇంకా కళ్లు మూసుకునే ఉన్నారు. కంటికి ఎదురుగా ఉన్న దృక్క్షేత్రంలో, నల్లటి నలుపు నేపథ్యంలో, వింతవింత చుక్కలూ, బుడగలూ వంటి ఆకారాలు కనిపిస్తున్నాయి. ఆ ఆకారాల మధ్య చిన్న నేతిదీపం లాంటి వెలుగు కనిపించింది. మళ్లా అదే శంఖాకారం. అదే సొరంగం…అనంతం…ఆ అనంతపు ఆవలి దరి నుండి మళ్లా అదే శబ్దం… పోతే ప్రశాంతంగా ఉన్న వాతావరణంలో ఆ శబ్దంలో రొద లేదు. మాటలు స్పష్టంగా వినిపిస్తున్నాయిామాటు.

"మీ ప్రపంచం బ్రహ్మాండమైన ప్రమాదానికి లోనవుతోంది. మీ దూరదృష్టి, మీ చాకచక్యాల మీదనే మీ మనుగడ ఆధారపడి ఉంటుంది." ఈ మాటలు మిడతంభొట్లుని ఆశ్చర్యచకితుణ్ణి చేసేయి. తనతో ఎవరు మాట్లాడుతూన్నట్లు? ఈ ప్రపంచానికి వచ్చిన ఆపద ఏమిటి? నిలకడలేని మనస్సు తనతో చెలగాటాలాడుతున్నదా? పొరపాటున ఎల్. ఎస్. డి. వంటి రసాయన ద్రవ్యాలేమీ తను తినలేదు కదా? తనతో నిజంగా ఎవ్వరైనా మాట్లాడుతున్నారా? లేక ఇదంతా ఒక భ్రమా? ఈ ప్రశ్నలకి సమాధానాలు కావాలి.

"ఎవరు మీరు? ఎక్కడనుండి మాట్లాడుతున్నారు? నాతో ఎలా మాట్లాడగలుగుతున్నారు?" అడిగేరు మిడతంభొట్లు.

"మేము మీ లోకం వాళ్లం కాము. మీ సూర్య మండలానికి దరిదాపు పదకొండు కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నాం. మా ఆకాశంలో ఉండే జంట తారల కంటె మీ సూర్యుడు ఇరవై రెట్లు కాంతివంతంగా ఉన్నాడు. కొద్ది కాలంలో ఇది నూరింతలవరకు పెరిగి పోతుంది. అప్పుడు మీ లోకాలన్నీ భస్మం అయిపోతాయి. మీ జాతిని, సంస్కృతిని కాపాడుకోవాలంటే మీరంతా మరొక చోటకి తరలి వలస వెళ్లిపోవాలి."

టెలిఫోను లోని మాటలలా స్పష్టంగా వినిపించిన ఆ శబ్దం మిడతంభొట్లు గారి మేధకి అగ్ని పరీక్ష అయి కూర్చుంది. నివృత్తి కాని అనుమానాలు ఆయన మనోసాగరంలో ఉవ్వెత్తున లేస్తున్నాయి. భూలోకం అంతా భస్మం అయిపోతుందా? యుగాంతం సమీపించిందా? ఈ విషయం తను దండోరా వేసి చెబితే ప్రజలు గాభరా పడిపోరూ? సజావుగా ఆలోచిస్తారా? దొమ్మీ చేస్తారా? అసలు తన మాట నమ్ముతారా? పిచ్చివాడిలా కొట్టిపారేస్తారా? ఆసన్నమవుతూన్న ఈ బృహత్ ప్రమాదాన్ని ప్రపంచంలోని ప్రజలందరూ కక్షలూ, కావేషాలు కప్పెట్టుకుని, కలిసికట్టుగా పనిచేస్తారేమో. ఈ ప్రమాదం మూలంగానైనా ప్రపంచానికి శాంతి లభిస్తే అదెంత కాదు. అసలు తనవంటి హోదాలో ఉన్న మనిషి ప్రభుత్వానికి ఈ విషయం ఎలా తెలియజెయ్యాలి? పత్రికల వాళ్ల దగ్గరనుండి తుంటరి వెధవల వరకు అందరూ సవా లక్ష ప్రశ్నలు వేస్తారు. వీటన్నిటికి కాకపోయినా కొన్నిటికయినా సరి అయిన సమాధానాలు తను తయారుగా ఉంచుకోవాలి. మిడతంభొట్లు మస్తిష్కం మిషనులా పనిచెయ్యడం మొదలుపెట్టింది. ఆకాశవాణిని ఉద్దేశించి ప్రశ్నల వర్షం కురిపించేరు.

"మీరు మాకు పదకొండు కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నట్లయితే మీతో నేను టెలిఫోనులో మాట్లాడినట్లు మాట్లాడగలగడం అసంభవం. మీ వార్త మాకు చేరేసరికి పదకొండు సంవత్సరాలు, మా సమాధానం మీకు చేరేసరికి పదకొండు సంవత్సరాలు పడుతుంది. ఈ లెక్కని సంభాషణ కుదరదు. అంతే కాకుండా పదకొండు సంవత్సరాల క్రితం మా సూర్యుడి పరిస్థితి గమనించి, ఇంక కొద్ది రోజుల్లో జరగబోయే విషయాన్ని…"

"రాతి యుగం. రాతి యుగం. మా పూర్వీకులు కూడ ఇలాంటి కుతర్కంతో శతాబ్దాలపాటు కొట్టుకున్నారు. మా వాళ్లూ కాంతి వేగాన్ని మించి వాకేతాలు పంపడం అసాధ్యం అన్నారు. ఈ విశాల విశ్వంలో ఉన్న కోట్ల కొద్దీ ప్రపంచాలు, ఒకరి సంపర్కం ఇంకొకరికి లేకుండా,  ఎవరి ప్రపంచంలో వారు బందీలు మాదిరి, ఒంటిపిల్లి రాకాసులలా, ఉండవలసిందే అన్నారు. అంతర్ప్రపంచ సంభాషణలు అసంభవం అన్నారు. మనం కాంతి వేగం అనే అవధి చేత బంధించబడ్డ ఖైదీలమన్నారు. ఇలా శతాబ్దాలు గడిచేయి. వాకేతాల వేగం కాంతి వేగంతో సమమవడం అసంభవమేమో కాని, కాంతి వేగాన్ని మించిన వేగంతో వాకేతాలని పంపగలమా అన్న ఆలోచన వచ్చేసరికి చాల కాలం పట్టింది."

“మీరనేది వార్తా ప్రసారం కాంతి వేగాన్ని అధిగమించి చెయ్యడం సుసాధ్యమేనంటారు? కాంతి వేగంతో సమానం కానంత సేపూ చిక్కు లేదంటారు? అవునా?”

“అవును.” ఆకాశవాణి పలికింది. ఈ మహా విశ్వంలో అవధిలేకుండా మహా వేగంతో పయనించేది ఏది?” భౌతిక శాస్త్రవేత్తగా కాకుండా సామాన్యుడిగా ఆలోచించి చూడు.”

“మనస్సు.” మహాభారతంలో యుధిష్ఠురుడిలా అన్నారు మిడతంభొట్లు. ఏదో జ్ఞానోదయం అయినట్లయింది. “భౌతిక శక్తులకి అసాధ్యం అనిపించే ప్రక్రియలెన్నో మనో శక్తితో సాధించవచ్చని మన పురాణ గ్రంథాలు ఘోషిస్తున్నాయి కద! అంతర్గతంగా నిబిడీకృతమైన ఈ శక్తిని కూడదీసి ఇచ్ఛామాత్రంగా మన శరీరంలో ఉత్పరివర్తనాలు కూడ పుట్టించవచ్చని ఈ మధ్య అధునాతనులు కూడ వాదిస్తున్నారు. ఇవన్నీ పటిష్టం లేని శుష్క వాదాలయితే టెలీపతీ మీద రష్యన్ శాస్త్రవేత్తలు విరివిగా పరిశోధనలు ఎందుకు చేస్తున్నారు? మిడతంభొట్లు స్వగతంగానే, మనస్సులో అనుకున్నారు. ఎవ్వరినీ ఉద్దేశించి అనలేదు. పైకి అనలేదు.

“అవును. మనోశక్తిని మించిన శక్తి లేదు. ఈ శక్తిని ఉపయోగించి వ్యాధిగ్రస్తులకి స్వస్థత చేకూర్చవచ్చు. వాకేతాలని ప్రసారం చెయ్యవచ్చు. భవిష్యత్తు లోకి చూడ వచ్చు. అన్నిటి కంటె ముఖ్యమైన అంశం ఏమిటంటే ఈ శక్తితో వార్తలని ప్రసారం చెసేటప్పుడు భాషతో ప్రమేయం ఉండదు. నిజానికి మీ భాష ఏమిటో కూడ మాకు తెలియదు. అవసరం లేదు కూడ. మేము ప్రసారం చెయ్యవలసిన వార్త మీద మా మనస్సుని లగ్నం చేస్తాం. మా “ఎంటెనా” ల ద్వారా వార్తని ప్రసారం చేస్తాం.”

“మీ వార్తలు గమ్యం చేరిన తరువాత వాటిని “డీకోడు” చేసి వార్తని పైకి లాగడం ఎలా?”

“ఇది చాలా మంచి ప్రశ్న. ఈ విషయమై మేము ఇంకా పరిశోధనలు చేస్తున్నాము. ప్రస్తుతం మా శక్తిలో సగం ప్రసారం చెయ్యడానికి, మిగిలిన సగం వార్తని డీకోడ్ చెయ్యడానికి వాడుతున్నాం. ఉదాహరణకి ప్రస్తుతం మా శక్తి మీ మస్తిష్కం మీద కేంద్రీకరించేం. ఈ సందర్భంలో మా ఆలోచనలు మా మెదడులో ఎటువంటి విద్యుత్-రసాయనిక ప్రక్రియలని ప్రేరేపించేయో వాటికి సారూప్యమైన విద్యుత్-రసాయనిక ప్రక్రియలు మీ మెదడులోని చక్షు-శ్రవణ కేంద్రాలలో చెలరేగుతాయి. మా

వాకేతాలని అందుకున్న గ్రాహకుడు ఇలా చెలరేగుతూన్న 'భావ దుమారాన్ని' ఏకాగ్రతతో అవగాహన చేసుకోగలిగితే వాటి భావం ఆ వ్యక్తికి అర్థం అవుతుంది. ఈ రకం నిగ్రహ శక్తి లేని వారికి మా వల్ల జరిగిన ప్రేరేపణ అర్థ రహితంగా ఉంటుంది. ఉండడమే కాదు. ఈ ఆందోళన బయటకి వ్యక్తం అయినప్పుడు అవి రోగ లక్షణాలని భ్రమ పడడానికి అవకాశం కూడ ఉంది. ఈ విషయంలో ఇంకా పరిశోధనలు ... మా శక్తి తగ్గిపోతోం…మీ జాగ్రత్తలో మీరు ఉండం…" విశ్వాంతరాళంలోంచి వచ్చిన శబ్దం కర్పూరం నిండుకున్న హారతిలా హరించిపోయింది.

మిడతంభొట్లు క్షణమాత్రపు కాలం నిశ్చేష్టులై ఉండిపోయేరు. దివి నుండి భువికి వచ్చిన వార్త యొక్క సారం ఆయన మెడడులోని కణసారంలోకి ఇంకా ఇంక లేదు. పుట్టపర్తి సాయిబాబా శక్తి ఏమిటో ఇప్పుడు ఈయనకి కొద్దిగా అర్థం అయింది. ఇటువంటి పద్ధతి ఏదో లేకపోతే ఆయన ఇంగ్లీషువాడితో ఇంగ్లీషులోను, తెలుగు వాడితో తెలుగులోను, జెర్మనీ వాడితో జెర్మనీ లోనూ ఎలా మాట్లాడేవాడట? ఆయనని సంబోధించి ప్రశ్న అడగకుండానే మన మనస్సులో ఉన్న ప్రశ్నకి సమాధానం చెప్పేవారట! తపోశక్తి అంటే ఇదేనేమో?

తపోశక్తి శరీరంలో ఉత్పరివర్తనాలు కలిగించి ఉండకపోతే కారు నలుపుగా ఉండే ముమ్మడివరం బాలయోగి పదహారో వన్నె బంగారపు ఛాయలోకి ఎలా వచ్చేడు? పాశ్చాత్యులు మనని తప్పు దారి తొక్కించేరా? మన మహర్షులు నిజంగా మహిమాన్వితులేనేమో? ఉత్త శుంఠలు కాదేమో?

వింత పాతబడేటప్పటికి పాత మీద రోత పుట్టలేదు కాని మిడతంభొట్లు అంతరాంతరాల్లో ఉన్న శాస్త్రవేత్తకి రోషం మాత్రం వచ్చింది. ఆయన ఆ మధ్య ప్రచురించిన సిద్ధాంతాలకీ, నేటి అనుభవాలకీ అవినాభావ సంబంధం ఉన్నట్లు అనిపించింది. మొట్టమొదటగా తన సిద్ధాంతాలని ప్రయోగాత్మకంగా నిరూపించడానికి వచ్చిన అవకాశమా ఇది? ప్రస్తుతం చెలామణీలో ఉన్న ఖగోళ–భౌతిక సిద్ధాంతాల ప్రకారం మన సూర్యుడు నవ్యతారగా మారి పేలిపోవడానికి అవకాశాలు తక్కువ – ఎక్కడో సిద్ధాంతంలో లొసుగు ఉంటే తప్ప. కాని తను ఉద్ఘాటించిన సిద్ధాంతంలో వెలుగు వేగానికి అవధులు తొలగిస్తే కొన్ని సమీకరణాలలో ఏకత్వ వైపరీత్యం గోచరిస్తుంది. అదే నిజమైతే మన సూర్యుడు నోవా అయే ప్రమాదం ఉంది. కాని ఈ సిద్ధాంతం సంభావ్యతలు చెబుతుంది కాని నిర్దిష్టంగా ఏదీ చెప్పదు. సూర్యుడు నోవాగా మారిపోతే సౌరకుటుంబం అంతా భస్మం అయిపోవచ్చు. లేదా అంతర్ గ్రహాలు

కొన్ని బలి కావచ్చు. పౌర ధర్మం ప్రకారం ఈ విషయం ప్రధాన మంత్రికి తెలియజెయ్యాలా? తెలియజేస్తే ఒరిగేదేముంది? ఇప్పుడు తను ఏమి చేసినా ప్రయోజనం ఉంటుందా? అలాగని రిక్తహస్తుడై ఊరుకోలేడు కదా? తనకి చేతనయినది చెయ్యాలి. గబగబ కంప్యూటర్ కేంద్రానికి పరిగెట్టేరు మిడతంభొట్లు. సాయంకాలం వరకు క్రమణికలు రాసి, వాటిని వాడవలసిన విధానం అక్కడ సిబ్బందికి బోధించి ఇంటి ముఖం పట్టేరు. కంప్యూటరు నమూనాలు ఏమిటి చెబుతాయో ముందు చూసి, ఆ తరువాత కార్యక్రమానికి తయారవవచ్చని ఆయన ఊహ.

3

అనుకున్న ప్రకారం శర్మ గారి క్లినిక్ దగ్గర ఆగేరు, మిడతంభొట్లు. శర్మ వైద్యుడే కాకుండా కుటుంబ స్నేహితుడు కూడా. ఇద్దరూ రాజకీయాల దగ్గరనుండి అన్ని విషయాలూ చర్చిస్తారు. తన ఆరోగ్యానికేమీ డోకా లేదన్న ధీమాతో, ఏదో బాతాఖానీ వేద్దామన్న ఉద్దేశంతో, లోపల అడుగు పెట్టేరు మిడతంభొట్లు. జరిగిన సంగతులన్నీ చెబుతూ ఉంటే శ్రద్ధగా విన్నారు డాక్టర్ శర్మ. ముఖ కళవళికలని బట్టి డాక్టరు గారి అంతరంగం ఆకళింపు చేసుకుందామనుకున్న ప్రొఫెసరు గారికి ఆశాభంగమే అయింది.

“పైత్యం చేసిన వాడికి భూమి గిర్రున తిరుగుతున్నట్లు అనిపిస్తుంది. అలాగని దానిని ప్రయోగత్మకమైన ఆధారంగా భావించి భూమి తిరుగుతున్నాది అంటే మీరు ఒప్పుకుంటారా? అలాగని భూమి తిరగడం లేదని అనగలమా? కారణ కార్య సంబంధం తార్కికంగా ఉండాలి కాని వాటి మధ్య కేవలం సహసంబంధం ఉంటే సరిపోదు. మీవాడేదో బ్రహ్మాండం బద్దలవుతున్నాదన్నాడని ఆ మాటలనే పదే పదే తలుచుకుని, చిలవలు, పలవలు పెట్టి పగటి కలలు కన్నారేమో.”

“నా క్షోభ అంతా కేవలం మానసికమైనదని మీరింత తేలికగా తీసిపారేస్తారని అనుకోలేదు.” మిడతంభొట్లు చిన్నబుచ్చుకున్నారు.

“మానసికం కావచ్చు. శారీరకం కావచ్చు. మంత్రం కావచ్చు. మీ వెనక వీధిలో ఉన్న సాయిబు చెడుపు, చిల్లంగి అంటారే  అటువంటి క్షుద్ర విద్య ఏదైనా మీమీద ప్రయోగిస్తున్నాడేమో. ఆసలు మీరు మీ పెరటి వీధిలో ఉన్న పుల్లయ్యతో మాట్లాడలేదనీ, మీరు విన్నది విశ్వాంతరాళపు లోతుల్లోంచి వచ్చిందనీ రుజువేదీ?”

"వాళ్లు పదకొండు కాంతి సంవత్సరాల దూరం నుండి గోల పెడుతున్నామని అఘోరిస్తున్నారు కదా."

"నేను మా ఆఫీసు నుండి ఫోను చేసి, 'నేనే శ్రీ కృష్ణ పరమాత్మని, ద్వారకనుండి మాట్లాడుతున్నాను' అని చెబితే మీరు నమ్మేస్తారా?" నిలదీసి అడిగేరు శర్మ. మిడతంభొట్లుకి పచ్చి వెలక్కాయ గొంతుకలో పడ్డట్లు అయింది. అహం దెబ్బ తింది. అయినా తమాయించుకుని వింటున్నారు.

"చూడండి. పైత్యం చేసి ఉండొచ్చు. ఎలర్జీ అయి ఉండొచ్చు. ఏ వైరస్ లాంటి విషాణువో మెదడులో దూరి ఈ హంగామా అంతా చేసి ఉండొచ్చు. మరేదైనా కారణం ఉండొచ్చు. కొంచెం పరీక్ష చేసి చూస్తే సరిపోతుంది కదా."

"కాలు బెణికితే ఇదేదో రుమేటిక్ హార్ట్ డిసీజ్ లా ఉంది. దీనికి వెంటనే ఓపెన్ హార్ట్ సర్జరీ చెయ్యాలి అన్నాట్ట వెనకటికి మీ లాంటి వాడే," మాటకి మాట బాకీ తీర్చేసుకున్నారు.

"చూడండి మన సూర్యుడు పదకొండేళ్లకి ఒక సారి వింతగా ప్రవర్తిస్తూ ఉంటాడని మీరొక సారి చెప్పేరు. ఆ సమయంలో అనేకమైన పరమాణు రేణువులు తండోపతండాలుగా వచ్చి మన భూగ్రహాన్ని ఢీకొంటాయని కూడ మీరు చెప్పిన మాటే. ఈ ఏకాదశవర్షచక్రం లోకి సూర్యుడు ఈమధ్యనే ప్రవేశించాడు కదా. ఈ సందర్భంలో ఒక కాస్మిక్ కిరణం కాని మీ మెదడులో దూరి…"

"కాస్మిక్ కిరణాలు ఇంత హడావిడి చేస్తాయా?" మిడతంభొట్లు గొంతుకలో మొదటి సారి ఆత్రుత గోచరించింది.

ఈ ప్రశ్నకి సమాధానంగా డాక్టరు శర్మ ఒక అగ్గిపుల్ల గీసి వెలిగించేరు. దాని అంతరార్థం ఏమిటా అని మిడతంభొట్లు కళ్లప్పగించి చూస్తున్నారు.

"ఈ వెలుగు మీ కంటిగుడ్డు వెనక భాగంలో ఉన్న అక్షిపటలం మీద పడుతుంది. ఆ రెటినా ఈ వెలుగుని విద్యుత్ వాకేతంగా మార్చి నేత్రనాడి ద్వారా మెదడులోని కపాలాస్తిక తమ్మి అనే భాగానికి పంపుతుంది. ఈ విద్యుత్ వాకేతం అక్కడ కొన్ని రసాయన మార్పులని కలిగించి, మీరు ఈ వెలుగుని చూస్తూన్నట్లు ఒక భ్రమని కలిగిస్తుంది. ఇప్పుడు మీరు కళ్లు మూసుకుని ఉన్నారనుకొండి. నేను వైద్య

పరికరాలని వాడి, మీ మెదడులో, అదే స్థానంలో, అదే రకం ప్రేరేపణ కలిగించాననుకొండి. అప్పుడు కూడ అగ్గిపుల్ల వెలుగుని చూస్తూన్నట్లు భ్రాంతి కలుగుతుంది, మీ మెదడులో. ఒప్పుకుంటారా?"

తార్కికంగా ఉన్న శర్మ గారి వాదనని ఖండించలేకపోయారు మేష్టారు. "ఏ కాస్మిక్ కిరణమో, వైరస్ కణమో నా మెదడులో చేరి, అక్కడ రసాయనిక ప్రక్రియలని ప్రేరేపించి, నాకు ఈ దృక్భ్రమ, ఈ 'హలూసినేషన్' , కలిగిస్తోందంటారు."

"మీరలా అధైర్య పడకండి. మీరు ఉదయం నుండి విన్నవి, కన్నవి ఏ కారణం వల్లనైనా సంభవించవచ్చు అని చెబుతున్నానంతే. ముందు సేంద్రియ లోపం ఏదీ లేదని నిర్ధారించుకోవాలి కదా."

"సేంద్రియ లోపం ఏదీ లేదని తేలితే నేను మరొక ప్రపంచంలోని జీవులతో మాట్లాడేనని మీరు ఒప్పుకుంటారా?"

"అలాగని నేను అనలేదే. సేంద్రియ లోపం లేక పోతే మానసిక రుగ్మత ఏదైనా ఉందేమో కూడ చూడాలి. అదీ లేక పోతే మీ ఇంటి వెనక సాయిబు ఏమిటి చేస్తున్నాడో చూడాలి. ఆ తరువాత సంగతి చూద్దాం."

మిడతంభొట్లు నీరు కారిపోయారు. డాక్టరు మాత్రం మేష్టారి మీద చెయ్యవలసిన పరీక్షల జాబితా ఒకటి నర్సుకి చెబుతున్నారు. ఆయన ధోరణిని బట్టి మిడతంభొట్లు గుండెకాయ గట్టిగానే ఉంది కాని మరొకటేదో అవుగ్గా ఉన్నట్లు అనిపించింది. గుండె రాయి చేసుకుని మిడతంభొట్లు ఇల్లు చేరుకున్నారు.

ఉదయం ఎనిమిదయేసరికల్లా మిడతంభొట్లు క్లినిక్లో కాలు పెట్టేరు. సూదులు, గొట్టాలు పట్టుకుని నర్సులు చుట్టూ మూగేరు. రక్తపు పోటు, నాడి, హృదయ స్పందన, ఇ. కె. జి. వగైరాలు గుండెకి ధోకా లేదని నిర్ధారించేయి. బుర్రకి తీగెలు తగిలించి ఇ. ఇ. జి. తీసేరు. అదీ బాగానే ఉన్నట్లు అనిపించింది కాని చిన్న అనుమానం మిగిలిపోయింది. కంటి వైద్యుడు వచ్చి కళ్లని పరీక్ష చెసేడు. నూటికి నూరు మార్కులు ఇవ్వలేనన్నాడు. కుడి మెదడులో లోపం ఉందేమో అని ఆయన అనుమానం.

మెదడు ఉపరిభాగంలొ, ఈ చెవి నుండి ఆ చెవి వరకు, ఉండే భాగాన్ని చలనపు చార అంటారు. ఈ చార వెంబడే కదలికకి సంబంధించిన కేంద్రాలన్నీ ఉన్నాయి. శరీరంలోని చలనాలన్నీ ఈ కేంద్రాల

పర్యవేక్షణలోనే జరుగుతాయి. ఈ చలనపు చారని ఆనుకుని మెదడు వెనక భాగంలో, ఇరుపక్కలా, శ్రవణ కేంద్రాలు ఉన్నాయి. ఈ శ్రవణ కేంద్రాలని ఆనుకుని, మెదడు వెనక భాగంలో దృష్టి కేంద్రం ఉంది. వాక్ కేంద్రం ఎడమ మెదడులో మాత్రమే ఉంది. మిడతంభొట్లు మాటలో ఎక్కడా లోపం కనిపించలేదు కనుక కుడి మెదడు మీద కేంద్రీకరించారు వైద్యులంతా. కాని కుడి మెదడులో ఎక్కడ?

నూరాలజీ డాక్టర్ కళ్లు మరొక సారి పరీక్ష చెయ్యాలన్నాడు. కళ్లల్లోని కండరాలు బలంగానే ఉన్నాయి. వాటి ప్రతివర్తితలు బాగానే ఉన్నాయి. మెదడుకి రక్తాన్ని తీసుకెళ్లే గళ ధమనిలో రక్త ప్రవాహం బలంగానే ఉంది. డాక్టర్లంతా ఎక్కడ బయలుదేరారో అక్కడికే వచ్చారు. ఇక మెదడు మారు మూలలన్నీ కంచు కాగడా పెట్టి వెతకాలి. కపాలాస్తిక తమ్మి మెదడు మారు మూలలో ఉంది. దానిని పరీక్షించాలంటే చిన్న బ్రహ్మ ప్రయత్నం చెయ్యాలి.

నర్సు వచ్చి టెక్నీటియం పెరిటెక్నిటేట్ ఒక సిరలోకి సూది ద్వారా ఎక్కించింది. ఆ మందు రక్తప్రవాహంతో పాటు మెదడులోకి వెళ్లగానే, ఒక రకం కేమెరాతో బుర్రకి వివిధ కోణాల నుండి ఫొటోలు తీసేరు. వీటిని బట్టి కపాలాస్తిక తమ్మి దగ్గర చక్షు శ్రవణ కేంద్రం అతి కొద్దిగా వాచినట్లు అనిపించింది. అక్కడ ఏదో దోషం ఉంది. కాని అది ఎంత హాని చేస్తుందో వైద్యులు తేల్చి చెప్పలేకపోయారు. శస్త్ర చికిత్స అవసరమా, కాదా అన్న మీమాంశలో పడ్డారు. శస్త్ర చికిత్సతో వెంటనే ఫలితం కనిపించే అవకాశం ఉంది కాని ప్రమాదం కూడా ఉంది. అందుకనే ఇది ఆఖరున ఎన్నుకోవలసిన మార్గం. శస్త్రం అంటే మాటలా? మెదడులో అంగుళం లోతు గొయ్యి తవ్వాలి. తవ్వి, ఆ గోతి గుండా వైద్యుడి వేలిని పోనిచ్చి, తమ్మిని తడిమి చూడాలి. ఈ గొయ్యి వెళ్లే మార్గంలోనే దృష్టి కేంద్రం ఉంది. ఏదైనా పొరపాటు జరిగితే దృష్టి పోయే ప్రమాదం ఉంది. మనం ఊహించని సంఘటన జరిగి ప్రాణం పోవచ్చు. నిజంగా మానవుడి మస్తిష్కం యొక్క కట్టడి ఇంకా మనకి పూర్తిగా అవగాహన కాలేదు. పోనీ అని శస్త్ర చికిత్స చెయ్యకుండా వదిలెస్తే ప్రాణానికి మరొక విధంగా ప్రమాదం. ఈ విషయాలన్నీ వైద్యులు మేష్టారితో కూలంకషంగా చర్చించేరు. తుది నిర్ణయం మేష్టారి భుజస్కంధాల మీద ఒదిలేశారు.

ఇది ఏకాంతంగా చెయ్యగలిగే నిర్ణయం కాదు. సంసారంలోని సభ్యులందరూ బహుముఖ సమావేశం అయేరు. ఆపరేషన్ వల్ల కాదన్నారు నాన్నగారు. విరేట్రం ఆల్బం 200 తో ఆయన హోమియోపతీ

కన్ను మూసేరు. ఆయిన్స్టయిన్ తరువాత ఎంతోమంది ప్రయత్నించి విఫలులయారు. కారణం ఏమిటని ఎప్పుడైనా ఆలోచించావా?"

ఆలోచించలేదని బుర్ర అడ్డుగా ఆడించేను.

"ఎండ లేకుండా నీడ లేదు. చావు లేక పోతే పుట్టుక లేదు. బొమ్మ లేకపోతే బొరుసు లేదు…"

నా మనస్సులో గభీమని ఒక ఆలోచన మెరిసింది. "నాణేనికి బొమ్మ, బొరుసు ఎలాగో ఈ విశ్వానికి గురుత్వాకర్షణ క్షేత్రం, విద్యుదయకాంత క్షేత్రం అలాగని మీరు అంటున్నారా?"

"అనుకో. సూక్ష్మంగా అదీ కథ. సంగతి, సందర్భం అనుకూలిస్తే ఈ రెండు శక్తులని ఒకదానికి మరొకటి విరుగుడుగా వాడి, రబ్బరు గుడ్డలా ఉన్న విశ్వానికి పడ్డ లొత్తలని కొన్నింటిని తీయవచ్చు. కాని ఆ సంగతి, సందర్భం అనుకూలించటమే కష్టం. నిజానికి విద్యుదయస్కాంత ఆకర్షణ గురుత్వ ఆకర్షణ కంటె ఎంతో ఎక్కువ శక్తిమంతమైనది. అయినా సరే ...."

"గురుత్వాకర్షణని అధిగమించటం అంత కష్టం కాదంటున్నాడు రమేష్…."

"అంటాడోయ్ ఎందుకనడూ? డబ్బంటే మస్తుగా ఉంది కాని పై అంతస్తులో సరుకు లేదోయ్. అయినా కాకి పిల్లకేం తెలుస్తుందోయ్ ఉండేలు దెబ్బ. అయినా నాకు తెలియక అడుగుతాను. ఆ రమేష్కి భౌతిక శాస్త్రం ఏమి వచ్చూ అని? మనలో మన మాట. ఆ రమేష్ని ఆంధ్రా యూనివర్సిటీ వారు డిగ్రీ ఇవ్వకుండా పంపించేసేరు, తెలుసా?"

"అయితే రమేష్ చెప్పేవన్నీ ప్రగల్భపు పలుకులే అంటారా? ఏంటీ గ్రేవిటీ అసాధ్యం అంటారా?"

"మానవుడి బుర్రకి ఊహ తట్టాలే కాని సాధ్యం కానిది ఏదీ లేదోయ్. అసాధ్యం అనే మాట నా నిఘంటువులో లేదోయ్. ఈ రోజు సాధ్యం కాకపోతే రేపు సాధ్యం కావచ్చు. ఆయిన్స్టయిన్ అసాధ్యం అనుకున్నది ఇప్పుడు సాధ్యం కాలేదూ? బొద్దాడని వాళ్లంతా భౌతికశాస్త్ర వేత్తలమే అంటే…"

నాకిది చాలు. మా పత్రికకి కావలసినది, ప్రజలు ఎగిరిపడి చదవగోరేదీ అయిన కథా వస్తువు మిడతంభొట్లు నోటి నుండి వచ్చింది. మేష్టారి వద్ద సెలవు తీసుకున్నాను.

3

మిడతంభొట్లుకి పుస్తకాల పరిజ్ఞానం తప్ప ప్రపంచ జ్ఞానం లేదంటాడు రమేష్. పొగరుతో ప్రగల్భాలు పలుకుతాడు తప్ప రమేష్లో పస లేదని మిడతంభొట్లు అంటారు. అయినా ఇద్దరూ ముఖాముఖీ కలుసుకున్నప్పుడు ఒకరి యెడల మరొకరు గౌరవంగానే ఉంటారు. అంతెందుకూ? ఇప్పటికీ, ఈ ప్రచ్ఛన్న యుద్ధం ఒక పక్క జరుగుతూ ఉన్నప్పటికీ, వీలైనప్పుడల్లా ఇద్దరూ కేరం బోర్డు ఆడుతూనే ఉంటారు.

పత్రికలలో నా శీర్షిక రాసేసి మరేదో పనిలో మునిగి పోయాను. ఇట్టే మూడు నెలలు తిరిగిపోయాయి. నేను రాసినది చదివిన దగ్గరనుండి రమేష్ కారాలు, మిరియాలు నూరేస్తున్నాడని విన్నాను. "ఏంటీ గ్రేవిటీ ఇంజను" నిర్మించి తీరతానని శపథం పట్టేడుట. ఆ యంత్రాన్ని మిడతంభొట్లు సమక్షంలోనే పరీక్ష చేసి తన సత్తా నిరూపించుకుంటానని సవాలు కూడ చేసేట్ట. ఇదే మంచి అవకాశమని రమేష్తో ఒక ముఖాముఖీ సమావేశానికి అనుమతి సంపాదించేను. ఏంటీ గ్రేవిటీ ఇంజను మీద పని ఎంత వరకు వచ్చిందో కనుక్కోవాలని నా ఆశ. ఆయన ఆఫీసులో అర గంట సేపు పడిగాపులు పడి ఎదురు చూడగా, చూడగా చివరికి ప్రత్యక్షమయేడు. పత్రికల వారితో పేచీ పెట్టుకునే తత్త్వం కాదు రమేష్ది. ఆలశ్యం అయినందుకు క్షమార్పణ చెప్పుకున్నాడు. అతని వాలకం చూస్తే ఏంటీ గ్రేవిటీ ఇంజను ఇబ్బందిలో పడిందేమో అని అనుమానం వేసింది. ఆ విషయమే అడిగేను.

"ఎవరు చెప్పేరు? ఆ నిడసనమెట్ల వాడేనా?"

రమేష్కి కోపం వచ్చినప్పుడు మిడతంభొట్లుని ఇంటిపేరుతో పిలుస్తాడు. అందుకని, నా జాగ్రత్తలో నేను ఉన్నాను.

“ఎవరూ కాదండి. ఏదో కర్ణాకర్ణిగా విన్నదేనండి.

“నీ శ్రుతపాండిత్యం అంతా ఆ మిడతంభొట్లు దగ్గర సంక్రమించిందే. ఏంటీ గ్రేవిటీ సంభవమో, అసంభవమో నీ కళ్ల ముందే రుజువు చేస్తాను, రా,” అని జబ్బ పుచ్చుకుని పై అంతస్తులో ఉన్న ప్రయోగశాలలోకి లాక్కెళ్లేడు.

రమేష్ అమర్చిన ప్రయోగశాల చాల క్లిష్టమైనది. చాల చాకచక్యంతో చేసేడని ఒప్పుకోవాలి. భౌతిక శాస్త్రంతో బాగా పరిచయం ఉన్నవాళ్లకి తప్ప సామాన్యులకి గభీమని అర్థం కాదు. అయినా టూకీగా చెబుతాను. రెండు అయస్కాంతాల మధ్య ఒక బలమైన విద్యుదయస్కాంత క్షేత్రం సృష్టించేడు. ఆ అయస్కాంతాల మధ్య భూమి యొక్క గురుత్వాకర్షణ క్షేత్రం ఎలాగూ ఉండనే ఉంది. భూమి యొక్క ఆకర్షణ శక్తిని విద్యుదయస్కాంత శక్తితో రద్దు చెయ్యాలి. అది ఎంత రద్దయిందో కొలవటానికి ఒక పరికరం కావాలి కదా. అందుకని ఆ అయస్కాంతాల మధ్య “మాస్బావర్ ఎఫెక్ట్” త్రాసు ఒకటి అమర్చేడు. అంటే మరేమీ కాదు. సంబద్ధమైన గామా కిరణవారాన్ని భుమ్యాకర్షణ క్షేత్రం గుండా పంపుతారు. ఆకర్షణ క్షేత్రంలో ఏదయినా మార్పు కలిగితే, తత్ఫలితంగా గామా కిరణాల తరంగ దైర్ఘ్యం మారుతుంది. ఆ మార్పుని కొలిచి, ఆకర్షణ క్షేత్రంలోని మార్పుని లెక్కగట్టి, తద్వారా ఏంటీ గ్రేవిటీ క్షేత్రాన్ని కొలవచ్చు.

నాకు భౌతిక శాస్త్రంలో ప్రావీణ్యత లేకపోయినా కొద్ది పరిచయం ఉంది. విజ్ఞాన విలేకరిని కదా. అందుకని దేశదేశాలలో జరిగే విషయాలని చదువుతూ ఉంటాను. రమేష్ చూపించిన ప్రయోగాల అమరికలో పెద్దగా కొత్తదనం ఏదీ లేదు. ఉరమరగా ఇలాంటి అమరికనే ఉపయోగించి అమెరికాలో ఆ మధ్య గురుత్వాకర్షణని ఇరవైరెండు శాతం తగ్గించేరు. ఆ విషయమే అడిగేను.

“గురుత్వాకర్షణని ఇరవైరెండు శాతం తగ్గించటానికి అమెరికా వారు ఎంత శక్తి వెచ్చించేరో తెలుసా? అంత విద్యుత్ శక్తి వెచ్చించకుండా మా ప్రయోగం చాల సమర్ధవంతంగా చేసేం. కావలిస్తే…”

“ఇరవైరెండు శాతం తగ్గించటం పెద్ద గొప్పేమీ కాదు. మీరు గురుత్వాకర్షణని పరిపూర్ణంగా తగ్గించగలరా? అదీ అసంభవమని మిడతంభొట్లు అన్నట్లు నాకు గుర్తు.”

రమేష్ ముఖం జేవురించింది.

ఈ సిద్ధాంతాలూ, సమీకరణాలూ, వీటిని ప్రతిపాదించే సిద్ధాంతులూ, ఉప సిద్ధాంతులూ అంటే నాకు ఒళ్లు మంట. ఏవో రెండు సమీకరణలు రాసి, వాటిని ఎవ్వరూ చదవని ఒక అనామకమైన పత్రికలో ప్రచురించగానే సరిపోయిందా? ప్రజలు వాడుకుందికి వీలయిన విషయం ఒక్కటి కనిబెట్టేడుటయ్యా మీ మీడతంభొట్లు? అక్కరకు రాని విద్య అడవి గాచిన వెన్నెల. చేతనైన వాళ్లు చేసి చూపిస్తారు, చేతకాని వాళ్లు పాఠాలు చెప్పుకుంటారు. చూడు, మా రసాభౌకంలో ఎన్నెన్ని ఉపకరణాలు రూపుదిద్దుకుంటూన్నాయో. అందుకే మిడతంభొట్లుకి నేనంటే అంత ఈర్ష్య. అయినా నేనే మనలో మనకి స్పర్థలు ఎందుకని అవకాశం వచ్చినప్పుడల్లా అతనితో కేరం బోర్డు ఆడుతూనే ఉంటాను.”

“మీరు ఎప్పుడూ చిత్తుగా ఓడిపోయేవారట, నిజమేనా?”

మరీ కోపంతో రెచ్చిపోవటం పబ్లిసిటీకి మంచిది కాదని వ్యాపార దక్షుడైన రమేష్ కి తెలుసు. అందుకని, కోపాన్ని మింగుకుని, ప్రయత్నం మీద చిరునవ్వు తెచ్చుకుని,

“ఆ మరీ బడాయిలు. నా వంతు నేనూ గెలిచేను. నేను గప్పాలు కొట్టుకోను, అంతే. ఏదో వాడికి లెక్కలూ, సైన్సూ బాగా వచ్చేవి. మనలో మనమాట. సోషల్ స్టడీస్లో మిడతంభొట్లు సున్నప్పిడతే. ఏదో ఆ మద్దాల గంగారామయ్య గారు జాలిపడి పేసు మార్కులు ఇచ్చేవారు.”

మనిషిని కుక్క కరిస్తే అది వార్త కాదు. కుక్కని మనిషి కరిస్తే అది పెద్ద వార్త. ప్రజలు పత్రికలు కొనాలంటే వాటిల్లో కాసింత మసాలా ఉండాలి. అందుకని,

“మీరు పట్టభద్రులు కాలేదుట, నిజమేనా?”

“అదీ మిడతంభొట్లే కూసేదూ? అసలు విషయం చెబుతా, రాసుకో. ఎందుకోయ్ ముష్టి డిగ్రీలు? వెధవ డిగ్రీ వచ్చిందంటే ముష్టెత్తుకుందికి కూడ వీలు లేదు; మధ్యలో నామోషీ అడ్డొస్తుంది. అందుకని నేనే చదువు మానేసేను. ఇప్పుడు చూడు, నా కంపెనీలో ఎంతమందికి ఉద్యోగాలు ఇచ్చి ఉపాధి కల్పిస్తున్నానో. ఆ మిడతంభొట్లుకి వచ్చిన నోబెల్ బహుమానం వల్ల ఎవరికి ఏమి ఒరిగింది?”

ఈ రోజుకి ఇంటర్వ్యూ అయినట్లే. ఆఖరు మాటగా,

“అయితే ముడతలు పడ్డ మిడతంభొట్లు జంబుఖానాని రసాభౌకం ఇస్త్రీ చెయ్యలేకపోయిందని రాసెయ్యమంటారా?”

“ధీరుల్ విఘ్న నిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థములుజ్జింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ కావునన్ అన్నాడు కదోయ్, కవి. కనుక రబ్బరు జంబుఖానా మీద లొత్తలు తియ్యటానికి అనంత పద్మనాభుడు అంతరిక్షం నుండి దిగిరానక్కర లేదు, ఇస్త్రీ పెట్టెతో మా ఊరు మడేలు వస్తే చాలని మిడతంభొట్లుతో చెప్పు.”

ఒక ఏడు గడచిపోయింది. ఆ రోజు వచ్చిన ఉత్తరాలలో ఆహ్వానపత్రిక ఒకటి ఉంది – రసాభౌకం నుండి. ఏమిటి చెప్మా అనుకుంటూ విప్పి చూసేను. ఏంటీ గ్రేవిటీ యంత్రం పురప్రముఖుల ఎదుట, పత్రికా విలేకరుల సమక్షంలో, ప్రప్రధమంగా ఆవిష్కరణ! ఈ సంరంభానికి ముందు ఒక గంట సేపు మద్య పానీయాలు!

ఏమీ లేకుండా ఇంత ఆర్భాటం చెయ్యటానికి ఎన్ని దమ్ములుండాలి? వెంటనే మిడతంభొట్లుకి కూడా ఆహ్వానం వచ్చిందో లేదో వాకబు చేసేను. వచ్చిందిట. ఆయన ఏదో సాకు చెప్పి తప్పించుకుంటాడని అనుకున్నాను. తప్పకుండా వస్తానన్నారు.

ముహూర్తపు రోజు రానే వచ్చింది. రసాభౌకం ప్రాంగణం చాల కోలాహలంగా ఉంది. నేను వెళ్లేసరికి పత్రికా విలేకరులతోటీ, ఫొటోలు తీసే వారితోటీ కలకలలాడుతోంది. రాజకీయ నాయకులు –

అప్పనంగా దొరికిన మందుని అప్పటికే రెండు మోతాదులు పుచ్చుకున్నారేమో – మేఘాల మీదే ఉన్నారు.

రమేష్ వేదికని సమీపించి ఆహూతులందరినీ ఆహ్వానించేడు. ప్రపంచాన్ని దిగ్భ్రమ చెందించే అపురూపమైన ప్రయోగాన్ని చూడబోతున్నారనిన్నీ, ఇది చరిత్రనే సృష్టించబోతూన్న సందర్భమనిన్నీ ముచ్చటగా మూడు ముక్కలలో స్వాగతం చెప్పేడు. వేదిక దిగబోతూ చటుక్కున ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా వెనక్కి తిరిగి మరో రెండు మాటలు చెప్పేడు:

"ఈ రోజు మీరు తిలకించబోయే ప్రయోగాలకి మూలాధారం మన మిడతంభొట్లు మేష్టారి ద్వంద్వ క్షేత్ర సిద్ధాంతం. ఆ సిద్ధాంతంలోని మెళుకువలన్నీ అవగాహన చెసుకుని, ఆయన అసంభవమని హెచ్చరిస్తూన్నా అధైర్యపడకుండా మేము ఈ ఏంటీ గ్రేవిటీ ఇంజనుని నిర్మించేం. కనుక, నా చిన్ననాటి స్నేహితుడు, మా ఊరివాడు, నోబెల్ గ్రహీత అయిన శ్రీ మిడతంభొట్లు మేష్టారిని ఈ ఆవిష్కరణ చెయ్యవలసిందిగా కోరుతున్నాను."

సావడి అంతా కరతాళ ధ్వనులతో మోగిపోయింది. అనుకోకుండా వచ్చిన ఈ అహ్వానానికి ఎలా స్పందించాలో తెలియక, కొద్దిగా తికమక పడి, తేరుకుని, అవకతవకగా కుర్చీలోంచి లేచి, రమేష్ వైపు నడచి వెళ్లేరు మిడతంభొట్లు. అంతవరకు అడ్డుగా ఉన్న తెర తెరచుకుంది.

అక్కడ ఒక కేరం బోర్డు ఆ కేరం బోర్డుకి నాలుగువైపులా నాలుగు జేబులతో పాటు నడిమధ్యలో – పిక్కలు అమర్చే చోట – వృత్తాకారంలో ఒక విశాలమైన బెజ్జం దొలచబడి ఉంది. ఆ బెజ్జానికి కింద బలిష్టమైన విద్యుదయస్కాంత ధ్రువం ఉంది. దానికి జవాబుగా పై నుండి మరొక ధ్రువం వేలాడుతోంది. ఆ కేరం బోడు చుట్టూ రకరకాల ఎలక్ట్రానిక్ పరికరాలు ఉన్నాయి. ఈ ప్రయోగానికి విద్యుత్ శక్తి ఏమాత్రం ఖర్చు అవుతుందో, బల్ల మధ్య బెజ్జం దగ్గర విద్యుదయస్కాంత శక్తి ఎంత బలంగా ఉందో, అక్కడ గురుత్వాకర్షణ శక్తి ఎంత ఉందో, వగయిరా సాంకేతిక విషయాలన్నీ ఆహూతులకి అర్థం అయే రీతిలో తెరల మీద ప్రదర్శించటానికి ఏర్పాట్లు ఎలా చెయ్యబడ్డాయో, ఈ

విషయాలన్నిటిని ఒక లంగరమ్మ విశదం చేసింది. ఈ అట్టహాసానికీ, ఆర్భాటానికీ అరగంట పైగా పట్టింది. అసలు ప్రయోగం అర నిమిషంలో అయిపోతుందని నాకు తెలుసు.

"ఈ అయస్కాంత ధ్రువాల మధ్య ఉన్న గురుత్వాకర్షణ శక్తిని ఏష్యం చెయ్యటమే ఇప్పుడు చెయ్యబోతూన్న ప్రయోగం లక్ష్యం." అంటూ మిడతంభొట్లు వైపు చూస్తూ రమేష్ మీట నొక్కేడు.

మిడతంభొట్లు సిద్ధాంతాలన్నీ అజగళస్తనాలు, తన ప్రయోగాలన్నీ ప్రజోపయోగాలు అనే భావం స్ఫురించిందా చూపుల్లో. పచ్చి వెలక్కాయ గొంతుకకి అడ్డు పడ్డట్టు ఉండుంటుంది మేష్టారికి.

మాస్బావర్ త్రాసుతో గురుత్వాకర్షణ శక్తి ఎంత జోరుగా క్షీణిస్తున్నాదో లెక్కగట్టి ఆ లెక్కని టెలివిషన్ తెరల మీద చూపుతున్నారు. అందరూ కళ్లప్పగించి టెలివిషన్ తెరలవైపే చూస్తున్నారు. పదిహేను శాతం, నలభై శాతం, ఏభై రెండు శాతం···. అయస్కాంతాల మధ్య గురుత్వాకర్షణ శక్తి పడిపోతోంది. మిడతంభొట్లు ముఖం, కత్తివేటుకి రక్తపు చుక్క లేనట్లు, పాలిపోయింది.

ఉత్కంఠని పెంచటానికా అన్నట్లు రమేష్ ఏవేవో మీటలు నొక్కుతున్నాడు. ఆ చర్యల వల్ల ప్రయోగం జోరు తగ్గింది. గురుత్వాకర్షణ క్షేత్రం యొక్క బలం పడుతోంది కాని, ఆ పడే జోరు తగ్గింది.

"మీ అందరికీ అర్థం అవటానికి సదుపాయంగా ఉంటుందని ప్రయోగం జోరు తగ్గించేం. అనతి కాలంలోనే గురుత్వాకర్షణ శక్తి పూర్తిగా నశిస్తుంది. అప్పుడు ఆ అయస్కాంతాల మధ్య నుండి అత్యాదమైన కాంతి ఉద్భాసిస్తుంది. ఆ కాంతిని చూడటం మీ కళ్లకి మంచిది కాదు. మీమీ కుర్చీల పక్క వేల్లాడుతూన్న సంచులలో చలవ కళ్లజోళ్లు ఉన్నాయి. అవి తీసి మీరందరూ ధరించండి." ఇందాకటి లంగరమ్మే కోకిల కంఠంతో హెచ్చరించింది.

అందరూ ఊపిరి బిగపట్టి కుర్చీల అంచుల మీద కూర్చుని చూస్తున్నారు. కొద్ది క్షణాలలోనే గురుత్వాకర్షణ శక్తి పూర్తిగా నశించి పోయింది. అదే వేళకి గదిలో దీపాల ద్యుతి తగ్గించినట్లున్నారు. కేరం బోర్డు మధ్యలో విద్యుదయస్కాంత క్షేత్రం వింతయిన కాంతులీనుతూ కనబడింది. గదిలో గాలికి

కూడ ఏదో వింతయిన తావి అబ్బినట్లు అనిపించింది. మిడతంభొట్లు ముఖ కళవళికలు ఆ చీకట్లో, ఆ నల్ల కళ్లద్దాల వెనక నుండి, కనబడటం లేదు. కాని మనిషి ఏదో తీవ్రమైన ఆలోచనలో పడ్డట్టు కనబడ్డాడు.

"ప్రయోగం ఇంకా అయిపోలేదు." రమేష్ గొంతుక వినిపించింది.

"ప్రస్తుతం మనం సాధించినదల్లా అయస్కాంతాల మధ్యనున్న గురుత్వాకర్షణని నశింపజేశాం. అంతే. ఇంతటితో ఈ ప్రయోగం ఆపేసే మనిషినయితే నేను కూడ ఏ విశ్వవిద్యాలయంలోనో పాఠాలు చెప్పుకుంటూ ఉండేవాడిని." అంటూ మిడతంభొట్లు వైపు అర్థగర్భితంగా ఒక చూపు చూసి మళ్లా అందుకున్నాడు.

"గురుత్వాకర్షణ లేకపోయిన సందర్భాలని మనం ఎలా వినియోగించుకోగలం? అది ఇప్పుడు మీ అందరికీ చూపిస్తాను. ఈ పని నేను నా చేతులతో చేస్తే నేను ఏదో మోళీ కట్టేననో కనికట్టు చేసేననో మీరు అనుకునే ప్రమాదం ఉంది. కనుక ఈ ప్రయోగాన్ని తన చేతుల మీదుగా పూర్తి చెయ్యవలసిందిగా – మన జాతికే వన్నె తెచ్చిన – మిడతంభొట్లు మేష్టారిని అర్థిస్తున్నాను."

కథ ఇలా మళుపు తిరుగుతుందని మిడతంభొట్లు కలలో కూడ అనుకుని ఉండరు. అకస్మాత్తుగా వచ్చిన ఈ ఆహ్వానంలోని అంతరార్థం ఏమిటో ఆకళింపు చేసుకుందికి వ్యవధి లేదు. అప్రయత్నంగానే లేచి, రమేష్ చూపించిన దారి వెంబడే యాంత్రికంగా నడుచుకు వెళ్లి, కేరం బోర్డు పక్కన ఉన్న కుర్చీలో చతికిలపడ్డారు. ఆయనకి ఎదురుగా ఉన్న కుర్చీలో రమేష్ కూర్చున్నాడు.

"గురుత్వాకర్షణ పూర్తిగా నశించిన ప్రదేశంలోనికి ఘన పదార్థాన్ని పంపితే వాటి ప్రవర్తన ఎలా ఉంటుందో అధ్యయనం చెయ్యటమే ఈ మొదటి ప్రయోగం యొక్క లక్ష్యం. మీకు కేరం ఆట మీద ఉన్న వ్యామోహం విశ్వవిదితం. భౌతిక శాస్త్రం, కేరం ఆట – ఈ రెండూ మీ జీవితానికి బొమ్మా, బొరుసూ లాంటివి. ఒకటి మీ వృత్తి, రెండోది మీ ప్రవృత్తి. పైపెచ్చు ద్వంద్వ క్షేత్ర సిద్ధాంతం మీ ముద్దుల బిడ్డ. ఆ

సిద్ధాంతాన్ని మీ జీవిత కాలంలోనే సవరించవలసి వస్తుందని సూచించే ప్రయోగం ఇది. ఏదీ, ఆ ఎర్ర బిళ్లని నెమ్మదిగా, ఆ అయస్కాంతాల మధ్యకి, గురుత్వాకర్షణ నశించిన క్షేత్రం లోనికి, మీ వేలితో ఒక చిన్న తోపు తొయ్యండి, ఏమవుతుందో చూద్దాం." అన్నాడు రమేష్.

చలవ కళ్లజోడు వెనక ఉన్న మిడతంభొట్లు కళ్లని చూడగలిగితే అవి ఏమి చెప్పి ఉండేవో?

రమేష్ పద్ధతి చెప్పేనుగా. పిక్కలని కొట్టే ముందు ఏ పిక్క ఏ జేబులోకి వెళుతుందో ముందే చెప్పి మరీ కొడతాడని. అదే ధోరణిలో రమేష్ ప్రేక్షకులని ఉద్దేశించి, "జాగ్రత్తగా గమనించి చూడండి. ఆ ఎర్ర పిక్క శూన్య క్షేత్రం చేరుకోగానే, దాని మీద భూమి యొక్క ఆకర్షణ శక్తి ప్రభావం ఏమీ ఉండదు. అంటే, ఆ అయస్కాంతాల మధ్యకి వెళ్లగానే, మన ఎర్ర పిక్క కేరం బోర్డు మధ్యనున్న బెజ్జం గుండా కిందకి పడిపోకుండా ఒక్క క్షణం పాటు అలా తేలుతూ ఉండిపోతుంది. భూమ్యాకర్షణ…."

ఈ ప్రసంగం అంతా అయే వరకూ మిడతంభొట్లు ఆగలేదు. ఎర్ర పిక్కని, ఒణుకుతూన్న వేళ్లతో నెమ్మదిగా అయస్కాంత క్షేత్రంలోకి తోసేడు.

ప్రత్యర్థులిద్దరూ నాకు స్నేహితులే కనుక నేను ముందు వరసలోనే కూర్చుని చూస్తున్నాను. ఎర్ర బిళ్ల నెమ్మదిగా బల్ల మధ్య బెజ్జం వరకు వెళ్లింది, అక్కడ ఏమిటి చెయ్యటమా అని ఈషణ్మాత్రం తటపటాయించిందా అన్న సందేహం నా మనస్సులో పొడచూపింది.

ఇంతకంటె ఆలోచించటానికి వ్యవధి లెదు. ఎర్ర బిళ్ల అకస్మాత్తుగా అదృశ్యం అయిపోయింది. ఎక్కడో దూరాన్న ఉరుము ఉరిమినట్లు శబ్దం వినిపించింది. తరువాత ఎక్కడో మెరుపు మెరిసినట్లు కనిపించింది. తరువాత ఏదో కాలుతున్నట్లు వాసన వేసింది.

ఏమయిందో అర్థం కాక కొందరు ఒక్కసారి లేచి నిలబడ్డారు. మధ్యనున్న బెజ్జం నుండి కిందకి పడిపోయిందేమోనని కొందరు ఎర్ర బిళ్ల కోసం తొంగి, తొంగి బల్ల కింద చూస్తున్నారు.

రమేష్ మాత్రం స్థాణువులా, మాట్లాడుతూన్న వాక్యాన్ని మధ్యలోనే ఆపేసి, ఉలుకు, పలుకు లేకుండా, కూర్చున్నవాడు కూర్చున్నచోటే కదలకుండా, మెదలకుండా ఉన్నాడు. రమేష్ పక్కనే ఉన్న కోకిలమ్మ కెవ్వున కేక వెయ్యటమూ, కేరం బోర్డు రక్తసిక్తం అవటమూ రెప్పపాటు కాలంలో జరిగిపోయాయి. రమేష్ హృదయ ఫలకంలో, గుండె నుండి వీపు దాకా, అంగుళం పొడుగు, పావు అంగుళం వెడల్పుతో దీర్ఘచతురస్రాకారంలో ఒక బెజ్జం పడి ఉంది. తరువాత శవ పరీక్షలో తేలింది, ఏదో గుండ్రని వస్తువు, రూపాయి కాసు ఆకారంలో ఉన్న వస్తువు, తూటాలా ఆ గుండె కాయ లోంచి దూసుకు పోయిందని.

ప్రయోగాన్ని అర్ధాంతరంగా ఆపేసేరనీ, పోలీసులని పిలిపించేరనీ మళ్లా నేను ప్రత్యేకం చెప్పక్కరలెదనే అనుకుంటాను. ప్రశ్నించటానికని మిడతంభొట్లుని, వాంగ్మూలానికని వచ్చిన అతిథులలో చాల మందిని పోలీసులు ఠాణాకి తీసుకు పోయారు.

4

ఈ సంఘటన జరిగి నాలుగు నెలలు దాటిపోయింది. దర్యాప్తు ఎంతవరకు వచ్చిందని పోలీసులని ఎన్ని సార్లు అడిగినా వాళ్లంతా గప్చిప్. ఏమీ చెప్పటం లేదు. ఇందులో గప్చిప్కి రాచ రహశ్యం ఏమీ లేదే. నాకు ఏదీ పాలుపోకుండా ఉంది. ఈ సందర్భంలో మిడతంభొట్లు నా కోసమని కబురంపేరు. ఆయనని కలుసుకుందికి వెళ్లేను.

ఆఫీసు తలుపు మీద ఆర్ నిడసనమెట్ల అని రాసి ఉంది. తలుపు తెరుచుకుని లోపలికి వెళ్లేను. మనిషి కొద్దిగా చిక్కినట్లు కనిపించేడు. పూర్వంలా బడేమియా బట్టలు లేవిప్పుడు. జుత్తు ఉడతలు పీకిన తాట్టెంకలానూ లేదు. సంరక్షణ చేసుకుంటే మనిషి స్పురద్రూపే. నన్ను చూడగానే ఆప్యాయంగా పలకరించేడు. ముక్తసరిగా మూడు నిమిషాల పాటు కుశలప్రశ్నలు అయేయనిపించి ఆయనే విషయం ఎత్తుకున్నాడు.

"ఆ రోజు ఏమిటి జరిగిందో ఇప్పటికీ అర్థం కావటం లేదోయ్. ఆ రోజు బుర్ర జోరుగా పని చెయ్యలేదనుకో. ఆ ప్రయోగాన్ని రమేష్ అలా వర్ణించి చెబుతూ ఉంటే మంత్రముగ్ధుడిలా అతను ఏమి చెబితే అది చేసేసేను తప్ప ఒక్క క్షణం ఆలోచించి ఉంటే ఈ ఘోరమైన ప్రమాదం జరిగి ఉండేది కాదోయ్. ఆలోచిస్తూ ఉంటే జరిగిన తప్పులో నేను కూడ కొంత పాలు పంచుకోవాలేమో అనిపిస్తోంది. ఏదో ఢాంబికంగా హడావిడి చెసేడే అనుకో. సిద్ధాంతం తెలిసిన వాడిని నేను. నేనయినా కొంచెం నిదానంగా ఆలోచించి ఉండాల్సింది. జరిగిన దానికి ప్రాయశ్చిత్తం ఏమిటా అని ఆలోచిస్తున్నాను."

"గతజల సేతుబంధనం. ఇప్పుడు విచారించి ఏమి లాభం? మీ ఫిజిక్సు పోయిన వాడికి ప్రాణం పొయ్యలేదు కదా."

"పొయ్యలేదు. నిజమే. కాని, పాపం. రమేష్ తన జీవితమంతా ఈ కపెనీకే ధారపోసేడు కదోయ్. కనీసం రమేష్ చివరి కోరిక తీర్చటానికా అన్నట్లు ఇప్పుడు నేను రసాభౌకం అధిష్టాన వర్గానికి అధ్యక్షుడిగా చేరేనోయ్. ఆ రోజు జరిగిన అభాసు వల్ల కంపెనీ పరపతికి ఎంత చిన్నతనం. అసలు ఆ రోజు నిజంగా జరిగినది ఏమిటో అందరికీ అర్థం అయే రీతిలో రాసి విపులీకరించే స్థోమత నీకు ఒక్కడికే ఉందోయ్. అందుకే నిన్ను పిలిపించేను."

సంభాషణ ధోరణి ఇలా మలుపు తిరుగుతుందని నేను కలలో కూడ అనుకోలేదు. కాని, నేను చెయ్యవల్సిన పని ఏమిటో నాకు పూర్తిగా బోధ పడ లేదు. ఇంతలో ఆయనే మళ్లా చెప్పటం కొనసాగించేరు.

"ఒట్టి చొప్పదంటు సిద్ధాంతాన్ని ఆధారంగా చేసుకుని ఈ ప్రయోగం తలపెట్టేడోయ్. లేకపోతే ఏమిటి చెప్పు. గురుత్వ క్షేత్రం రద్దవగానే బిళ్ల బరువు కోల్పోయి గాలిలో తేలుతుందని కదూ అన్నాడు? రాకెట్ లో మనుష్యులు తేలిపోతూన్నట్లు సినిమాలో చూసుంటాడు. గురుత్వ క్షేత్రం రద్దయినప్పుడు వస్తువులు అలా తేలిపోతాయని చాలమంది అనుకుంటారు. నిజానికి రాకెట్టూ, రాకెట్టు లోని మనిషి — రెండూ ఒకేసారి – భూమి గురుత్వ క్షేత్రంలో పడుతూ ఉంటే మనిషి బరువుని కోల్పోయినట్లు అనిపిస్తుంది. అది

శుద్ధ భ్రమ. నిజానికి భూమి గురుత్వ క్షేత్రంలో ఏమీ మార్పు రాదు. అదే విధంగా….. చూడవోయ్ ఈ కథ పూర్తిగా చెప్పేసరికి చాల సేపు పడుతుంది. టూకీగా చెబుతాను. కావలిస్తే రాసుకో."

"నిజానికి రమేష్ గురుత్వ క్షేత్రాన్ని నాశనం చేసేడు. కాని దాని పర్యవసానంగా ఎర్ర బిళ్ల తేలిపోవటం కాదు. భారాన్ని పూర్తిగా కోల్పోయింది. ఎర్ర బిళ్లే కాదు. ఆ అయస్కాంతాలమధ్య ఉన్న పదార్థాలన్నీ – అంటే గాలి బణువులూ, ధూళి రేణువులూ, సమస్తం – వాటి వాటి భారాలని పోగొట్టుకున్నాయి. శూన్య భారం ఉన్న పదార్థం ఏదయినా ఒకే విధంగా ప్రయాణం చేస్తుంది."

తరగతిలో పాఠం చెబుతూ, కుర్రాళ్లు ఏమంటారో చూద్దామని ఆగినట్లు మిడతంభొట్లు ఒక సారి ఆగి, ప్రశ్నార్థకంగా నా వైపు చూసేరు. ఆయన ఏదైనా ప్రశ్న అడిగితే సమాధానం చెప్పే త్రాణ నాకు లేదు. అందుకని, నేనే, "ఏ రకంగా ప్రయాణం చేస్తుందంటారు?" అని అడ్డు ప్రశ్న వేసేను.

"అలా అడుగు, చెబుతాను. శూన్య భారం ఉన్నది ఏదయినా సరే కాంతి వేగంతో ప్రయాణం చేస్తుందని చదువుకోలేదుటోయ్. ఫోటానులకి భారం లేదు. అవి కాంతి వేగంతో పయాణం చేస్తాయి. అసలు ఫోటానులంటేనే కాంతి రేణువులు. అలాగే ఎర్ర బిళ్ల ఏంటీ గ్రేవిటీ క్షేత్రంలో ప్రవేశించగానే, తన భారాన్ని పూర్తిగా కోల్పోయి, కాంతి వేగాన్ని సంతరించుకుని, ఝామ్మని గగన వీధిలోకి దూసుకు పోయింది. పోతూ పోతూ దారిలో రమేష్ శరీరం అడ్డొస్తే, అతని గుండెల్ని చీల్చుకు పోయింది.

నాకొక చిన్న ధర్మ సందేహం వచ్చింది. తెగించి అడిగేను.

"అయస్కాంతాల మధ్యలో కదా గురుత్వ క్షేత్రం నశించింది? ఆ పరిధిని దాటి బయటకి రాగానే పోయిన బిళ్ల బరువు మళ్లా తిరిగి వచ్చేయాలి కదా? అప్పుడు అది కాంతి వేగంతో ఎలా వెళుతుంది?"

ఏ మాటకామాటే చెప్పుకోవాలి. నా ప్రశ్న నాకే ఎంతగానో నచ్చింది. మేష్టారికి కూడ ఎంతగానో నచ్చి ఉండాలి. నా మీద చిరాకు పడకుండా, తల పంకించి, సమాధానం చెప్పేరు.

“నిజమే. జోరుగా వెళుతూన్న సైకిలుకి ఎంత బలంగా మరకట్టు వేసినా అకస్మాత్తుగా ఆగలేదు కదా. అలాగే ఎర్ర బిళ్ల శూన్య భారం తోటీ, కాంతి వేగం తోటీ ప్రయాణం మొదలు పెట్టింది. అయస్కాంత క్షేత్రం దాటి బయటకు రాగానే దాని నిజ భారం దానికి వచ్చేసి ఉంటుంది. కనుక దాని వేగం తగ్గాలి. కాని అకస్మాత్తుగా తగ్గలేదు. వేగం తగ్గటానికి నిర్ధిష్టమైన కాలం కొంత పడుతుంది. ఈ వ్యవధి ముగిసే లోగా మన ఎర్ర బిళ్ల అయస్కాంత క్షేత్రం నుండీ, భుమ్యాకర్షణ క్షేత్రం నుండీ, ఆమాటకొస్తే సూర్య మండలం నుండీ దాటి, బయటికి ఎక్కడికో వెళ్లిపోయి ఉంటుంది. విశ్వాంతరాళం దరిదాపు అంతా శూన్యమే కనుక మన వాతావరణం దాటగానే ఎర్ర బిళ్ల మీద పడే ఒరిపిడి శక్తుల ప్రభావం…..

“గుడ్డిలో మెల్ల. మనం అదృష్టవంతులం అనుకో. ఆ ప్రయోగం మూడో అంతస్తు మీద జరిగింది కనుకా, ఆ చుట్టుపట్ల ఎత్తయిన భవనాలు మరేమీ లేవు కనుకా సరిపోయింది. లేక పోతే ఆ ఎర్ర పిక్క మరెంతమందిని పొట్టని పెట్టుని ఉండేదో…”

నాకు మరొక అనుమానం వచ్చింది. తీర్చేసుకుందామని మరొక ప్రశ్న అడిగేను.

“మరయితే… ఆ ఎర్ర బిళ్ల రమేష్ సృష్టించిన క్షేత్రంలోకి అతి నెమ్మదిగా ప్రవేశించింది. కేరం బోర్డు మధ్యలో ఉన్న బెజ్జం దగ్గర ఒక్క క్షణం ఆగిందేమో కూడ. అటువంటి సందర్భంలో ఆ బిళ్ల అకస్మాత్తుగా కాంతి వేగం ఎలా సంతరించుకుంది?”

“భౌతిక శాస్త్రంలో ఇంత ప్రవేశం నీకెప్పుడు వచ్చిందోయ్? నా తరగతిలో విద్యార్థులు ఇలాంటి మంచి ప్రశ్నలు ధైర్యంగా అడిగినట్లయితే మనకి మరొక నోబెల్ బహుమానం వచ్చి ఉండేదోయ్.

“అడిగేవు కనుక చెబుతున్నాను. ఇది కొంచెం క్లిష్టమైన ఊహనం. గభీమని అర్థం కాకపోతే కంగారు పడకు. రమేష్కి సిద్ధాంతం అర్థం కాకపోయినా తంతే బూర్ల గంపలో పడ్డట్టు పడ్డాడు. వ్రతం చెడ్డా ఫలం దక్కింది. మన జంబుఖానా నమూనా ఉంది చూశావూ? మనవాడు ఆ జంబుఖానాలో పడ్డ లొత్త తీసెయ్యగలిగేడు. లొత్తలు లేని క్షేత్రంలో అయిన్స్టయిన్ సాధారణ సాపేక్ష సిద్ధాంతం వర్తించదు.

అప్పుడు విహిత నియమాలు కూడ వర్తించవు. ఆ సందర్భంలో రమేష్ సృష్టించినది సతత గతి యంత్రం. ఈ యంత్రంతో అపరిమితమైన శక్తిని ఉత్పాదించవచ్చు.

"ఈ సూత్రాలని ఉపయోగించి శక్తిని నిరంతరాయంగా, అతి చవకగా, ఉత్పత్తి చేసే సావకాశాలు ఉన్నాయి. తెలిసీ తెలియని మిడిమిడి జ్ఞానంతో గుడ్డి గుర్రపు తాపులా రమేష్ కనిపెట్టినది ఏంటీ గ్రేవిటీ యంత్రం కాదు. పెట్టుబడి పెట్టిన శక్తి కంటే దాని మీద వచ్చే రాబడి శక్తి ఎక్కువగా ఉత్పత్తి చెయ్యగలిగే సతత గతి యంత్రం కనిపెట్టినట్లున్నాడు. ఇది ఇప్పటి వరకు అంతా దుస్సాధ్యం అని ఎవ్వరూ దీని వైపు చూడ లేదు. ఈ యంత్రం కాని నిజంగా పని చేస్తే మన దేశంలో ఖనిజపు చమురు, నేలబొగ్గు, యురేనియం వంటి ఇంధనపు నిల్వలు తక్కువని చింతించనక్కర లేదు. అందుకే రసాభౌకం కంపెనీకి మేనేజింగ్ డైరక్టర్గా ఉండమని అతని వారసులు నన్ను బతిమాలేరు. కాదనలేక పోయాను."

మేష్టారూ, మీరు చెప్పినవన్నీ బాగానే ఉన్నాయి. కాని ఆ రోజు జరిగిన ప్రమాదంలో మనలో ఎవ్వరిమైనా చచ్చిపోయి ఉండేవాళ్లం కదా. మరి ఆ ఎర్ర బిళ్ల గురిపెట్టి కొట్టినట్లు రమేష్ గుండెలు చీల్చుకు వెళ్లిందంటే…..."

"నాకు తెలిసిన సిద్ధాంతం చెబుతాను, విను. దీపం వెలిగించినప్పుడు కోటానుకోట్ల కాంతి రేణువులు ఉత్పత్తి అవుతాయి. ఈ రేణువులకి, ఈ ఫోటానులకి, భారం లేదు. కనుక ఇవి అన్ని దిశలలోకీ, కాంతి వేగంతో చెల్లా చెదురవుతాయి. అప్పుడు వెలుగు అన్ని వైపులకీ వ్యాపిస్తుంది. అంతే కాదు. భారం లేనివి కనుక ఇవి ఎంత జోరుగా మనని ఢీకొన్నా మనకి దెబ్బ తగలదు. ఇదే విధంగా అయస్కాంత క్షేత్రంలో ఉన్న కోటానుకోట్ల గాలి బణువులు కూడ భారాన్ని కోల్పోయి, ఫోటానులలాగే, అన్ని దిశలలోనూ చెదిరిపోతాయి. కాని, ఎర్ర బిళ్ల సంగతి వేరు. ఇక్కడ ఒక్కటే ఎర్రబిళ్ల ఉంది. అది భారం పోగొట్టుకున్నప్పుడు అది ఏ దిశలో ప్రయాణం చేస్తుందన్నది కోటి రూపాయల ప్రశ్న. ఈ బిళ్ల ఏ దిశలో వెళుతుందన్నది యాధృచ్ఛిక ప్రక్రియ. అది ఎటైనా వెళ్లి ఉండవచ్చు. మన రమేష్ రోజులు

నిండుకున్నాయి. మనతో రుణానుబంధం తీరిపోయింది. ఆ బిళ్ల వెళ్లి అతనిని కొట్టింది. అతను వెళ్లి పోయాడు."

ప్రజలు, పత్తేదారులు, పోలీసులు, ప్రభుత్వం, అంతా ఈ సంజాయిషీ నమ్మేరు. నమ్మటమేమిటి? మిడతంభొట్లు మేష్టారిని రసాభౌకం కి అధ్యక్షునిగా చేసేరు.

మిడతంభొట్లు చెప్పిన వివరణ ఎంత పకడ్బందీగా ఉన్నట్లనిపించినా నాకు నమ్మబుద్ధి కాలేదు. అనంతమైన దిశలలో ప్రయాణం చెయ్యగలిగే ఆ ఎర్ర పిక్క రమేష్ గుండెల వైపే ప్రయాణం చేసిందంటే ఎలా నమ్మటం. ఇది కేవలం కాకతాళీయం అంటే నేను నమ్మలేకపోయాను.

బొంబాయి, కలకత్తా, బెంగుళూరు నగరాలలో భౌతిక శాస్త్రంలో కొమ్ములు తిరిగిన వాళ్లు చాల మంది ఉన్నారు. వారిని సంప్రదించేను. ఇదమిత్థంగా ఎవ్వరూ చెప్పలేకపోయారు. రమేష్ చేసిన ప్రయోగాన్నే మరొకసారి చేసి, ఈ మారు బిళ్ల ఎటువైపు వెళుతుందో చూస్తే సరిపోతుంది కదా అని ఒక స్నాతకోత్తర విద్యార్థి సలహా ఇచ్చేడు. కాని ఈ ప్రయోగం చెయ్యగలిగే పరిజ్ఞానం, స్తోమత ఒక్క రసాభౌకం వారికే ఉన్నాయి. ఆ కంపెనీ అధినేత అయిన మిడతంభొట్లు ఒప్పుకోవద్దూ?

అనుమానం పెనుభూతం అయింది. బంకనక్కిరికాయలా ఈ అనుమానం నా మస్తిష్కాన్ని దొలిచేస్తోంది. కేరం బోర్డు ఆటలో మిడతంభొట్లు జగజ్జెట్టి. ఏ పిక్కని ఏ కోణంలో ఎంత గట్టిగా కోడితే అది ఎటు వెళుతుందో అన్న జ్ఞానం ఆయనకి వెన్నతో పెట్టిన విద్య. అటువంటి వ్యక్తి మనస్సులో, ఆ కుర్చీలో కూర్చున్న సమయంలో, ఒక మెరపులాంటి ఆలోచన వచ్చి ఉండొచ్చు. ఎర్ర పిక్కని ఏ కోణంలో కొడితే అది రమేష్ కూర్చున్న వైపు వెళుతుందో….

ఇది ప్రమాదం అంటారా, కాకతాళీయం అంటారా? ఖూనీ అంటారా?

**కథ వెనుక కథ:**

ఐజాక్ అసిమావ్ రాసిన బిలియర్డ్ బాల్ అనే కథ దీనికి ఆధారం. రచన, ఫిబ్రవరి 1995, ఆంధ్ర ప్రభ, మే 1995 లలో ప్రచురితం. ఈ కథ "మహాయానం" అన్న పేరుతో కినిగే వారు (kinige.com) ప్రచురించిన ఇ-పుస్తకం లో కూడా ఉంది. షికాగో తానా సభకి వచ్చిన మధురాంతకం రాజారాంకి నన్ను ఎవ్వరో పరిచయం చేస్తే, ఆయన "మీరు రాసిన కథ ఒకటి ఈ మధ్య చదివేను. విలక్షణంగా ఉంది, అర్థం కాలేదు" అంటూ ఒక "కితాబు" ఇచ్చేరు.



# తాడు తెగిన గాలిపటం

1

ఆడదాని ప్రాపు లేని మగాడి జీవితం తాడు తెగిన గాలిపటం లాంటిదని నేనంటే ఎవరొప్పుకున్నా ఒప్పుకోకపోయినా రంగబాబు జీవితాన్ని తన కళ్ళతో చూసిన రామేశం గారు ఒప్పుకుంటారు. అందుకనే రంగబాబుని ఆసుపత్రిలో చేర్పించారని డ్రైవరు మోసుకొచ్చిన వార్త విన్నప్పుడు రామేశం గారి మనోవీధిలో కాలచక్రం ఒక్కసారి వెనక్కి తిరిగినట్లయింది.

సరిహద్దు గాంధి అని పేరు తెచ్చుకున్న ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్ లా ఆరు అడుగుల చిల్లర పొడుగుతో పక్కా పఠాన్ లా, ఉక్కు కడ్డీలా ఉంటాడు చూడ్డానికి రంగబాబు. ఎనభయ్యో పడి దగ్గర పడుతున్నా నడ్డి ఒంగలేదు, పన్ను కదలలేదు, మనిషి కంగలేదు. ఎప్పుడూ జిత్రున చీదెరగడు. అటువంటి వాడు ఆసుపత్రిలో చేరేడంటే నమ్మబుద్ధి కాలేదు రామేశం గారికి.

రంగబాబుని తెలియని వాళ్ళు ఎవరైనా ఆ ఊళ్ళో ఉన్నారంటే కచ్చితంగా వాళ్ళు ఆ ఊరికే కాదు, ఆ ప్రాంతాలకే కొత్త అయియుండాలి. రంగబాబు జీవితం ఒక తెరచి పెట్టిన పుస్తకం. అదే ఊళ్ళో పుట్టి, అక్కడే పెరిగి, అక్కడే స్థిరపడిపోయిన వ్యక్తి రంగబాబు. నోటిమంచితనంతో ఊరుని మంచి చేసుకుని తలలో నాలుకలా బతక నేర్చిన మనిషి రంగబాబు. అటువంటి వాడు ఆసుపత్రిలో చేరేడంటే ఎవరికైనా ఎలా ఉంటుంది?

సాయంకాలం అయేసరికి ఆరడుగుల మనిషీ మరో ఆరడుగుల పొడుగున్న చేతికర్ర ఒకటి పుచ్చుకుని ఊళ్ళో తిరగడానికి వెళ్ళేవాడు. చీకటి పడేవరకూ తిరిగి, పిల్లా జెల్లా అందరినీ పలకరించేవాడు. పండితులూ, పామరులూ, పెద్దలూ, పిన్నలూ అంతా ఏకవచనంతో “రంగబాబూ” అనే పిలుస్తారు. అందరికీ అంత చనువు ఇచ్చే వాడు. అటువంటి రంగబాబుకి ఇప్పుడు ఏమిటి వచ్చిందో?

“సివంచలం! రంగబాబుని ఇప్పుడు ఇంత అకస్మాత్తుగా నేను వచ్చి చూడవలసిన అవసరం ఏమిటి వచ్చింది?”

“నాకేటి తెలుద్ది బాబూ. వారం రోజులకి ముందే బాబూ, నేను సిన్నయ్యని తోలుకుని కిలినిక్కాడికొచ్చేసరికి, అప్పటికే ఈ రంగబాబు బాబండి, అక్కడ బల్ల మీద కూకునున్నాడండి. అయ్యా! అప్పట్నుండి సిన్నయ్య తవఁరు ఊర్నుండి ఎప్పుడొత్తారా అని ఒకటే ఎదురుసూత్తన్నారండి, బాబయ్య.”

“నువ్వు ఒక అరగంట సేపు కూర్చో. నేను త్వరలోనే తెమిలి వస్తాను.”

“ఆయ్.”

రంగబాబు! ఏనాటి రంగబాబు! ఎప్పటి రంగబాబు!! రామేశం గారి మనోవీధిలో పాతరోజులు ఒక పరుగు తీసేయి.

రంగబాబు గాంధీగారి వల్ల బాగా ప్రభావితుడైన వ్యక్తి. కాంగ్రెసు వాళ్ళు గాంధీ టోపీలంటే పెట్టుకుంటున్నారు కాని నూలు వడికే రాట్నాలని ఆ గాంధీగారి చితి మీదే పడేసి కాల్చేసినట్లున్నారు. రంగబాబు మాత్రం క్రమం తప్పకుండా రోజూ రాట్నం ఒడుకుతాడు. ఖద్దరు బట్టలే కడతాడు. మద్యం, మాంసం ఎప్పుడూ ముట్టడు. జంతువుల చర్మంతో చేసిన చెప్పులు వేసుకుందికి కూడా వెనకాడతాడు. గాంధీగారి లాగే మేకపాలు తాగేవాడు, చాలారోజులు. తర్వాత ఆ పాలు కూడ తాగడం మానేసాడు. ఎందుకలా చేసేవని అడిగితే మేకపాలు మేక పిల్లలకే అనేవాడు.

సర్కారు వారి నౌకరీ నుండి పింఛను పుచ్చుకున్న తర్వాత ఆరోగ్యానికి మంచిదని ఒంటిపూట మొదలు పెట్టేడు. మధ్యాహ్నం మాత్రమే అన్నం తిని రాత్రి రెండే రెండు గోధుమ రొట్టెలతో పాటు ఒక అరటిపండు తిని కాసిని నీళ్ళు తాగి ఊరంతా తిరిగింది చాలనట్లు వాకిట్లో ఒక అరగంట సేపైనా పచారు చేసి అప్పుడు నడ్డి వాల్చేవాడు. మునిమనవలో, పక్కింటిపిల్లలో, పొరుగింటి పెద్దలో పోరు

పెడితే కాదనలేక "శివదీక్షాపరురాలనురా" అన్న పాట పాడి అప్పుడు నిద్రపోయేవాడు. ఇదీ రంగబాబు దైనందిన జీవితపు నేపథ్యం టూకీగా చెప్పుకుంటే. అసలు కథ ఇంకా పెద్దదే ఉంది.

రంగబాబుకి ఉన్న ఆస్తి అంతా అతని భార్య, ఆమె ఒంటి మీద ఉన్న నగలు. ఆవిడ ఎప్పుడో ఇరవై ఏళ్ళ కిందటే మెళ్ళో ఉన్న పసుపుతాడుతో కన్ను మూసే వేళకి ఆవిడ ఒంటి మీద ఉన్న బంగారం అంతా మగపిల్లల చదువులకి ఆడపిల్లల పెళ్ళిళ్ళకి హారతికర్పూరంలా హరించుకుపోయింది. "నాకేమి నలుగురు మగపిల్లలు. వాళ్ళు ఉద్యోగాలు చేసేరంటే రాసులు గణించి నిలువెత్తునపోస్తారు" అని కొండంత ధైర్యంతో ఒళ్ళు ఒలిచి చదువులు చెప్పించి అదృష్టవంతురాలు కనుక ఆ రాసుల కోసం ఎదురు చూడకుండానే కన్ను మూసింది.

చదువులు ఐన తర్వాత నలుగురు మగపిల్లలూ ఎవరి పొట్టలు వారు పట్టుకుని ఒకరు అమెరికా అనీ, మరొకరు ఆస్ట్రేలియా అనీ నాలుగు దిక్కులకీ చెదిరిపోయారు. అక్కడ వాళ్ళు నాలుగు రాళ్ళేమి ఖర్మ బాగానే గణించుకుని వాళ్ళ వాళ్ళ పెళ్ళాలతో కాపురాలు చేస్తున్నారు. అమెరికా జీవితాలకీ, జీతాలకీ అలవాటు పడిపోయిన పిల్లలకి వయస్సు మళ్ళిన తండ్రి మంచిచెడ్డలు చూసుకునేందుకని దేశం వచ్చేసి స్థిరపడడంలో ఉన్న తర్కం బోధపడలేదు. తిరిగొస్తే మంచి ఉద్యోగాలు దొరుకుతాయన్న భరోసా ఏమీ లేదు. ఉద్యోగాలు దొరికినా అమెరికా వదిలి భారతదేశం తిరిగి వెళ్ళడానికి వాళ్ళ వాళ్ళ పెళ్ళాలు ఒప్పుకుంటారన్న భరోసా అంతకంటె లేదు. వాళ్ళ దృష్టిలో ఇండియా వెళితే గొర్రెతోకలా చాలీ చాలని జీతాలు, అంబరచుంబితాలలా ఆకాశాన్నంటే ఖర్చులు, పిలవని పేరంటంలా వచ్చిపోయే బంధువులు. అత్తమామలు, ఆడబొడుచుల బెడద సంగతి సరేసరి. అమెరికాలో స్థిరపడిపోతే ఈ బెడదలు ఉండవు. నెలకో వందో రెండు వందలో ఇంటికి పంపినా అక్కడ రంగబాబు వృష్టిగా గడిపే జీవితానికి అది ఎక్కీతొక్కి.

స్వతంత్రంగా ఆలోచించుకోగలగడం, తమ ఆలోచనా సరళిలో తప్పేమీ లేదన్న ధైర్యం సంపాదించడం ఈ రెండూ పాశ్చాత్య దేశాలు వెళ్ళిన తర్వాత భారతీయులలో వచ్చే పెద్ద మార్పులు. మంచో చెడ్డో,

మనస్సుకి తట్టిన ఊహలో తర్కాభాసం ఏమీ కనిపించలేదు రంగబాబు కొడుకులకి, కోడళ్ళకి. ఏమాటకామాట చెప్పుకోవాలి. అభిమానాలు లేకపోలేదు. ఎంత కాదన్నా కన్న తండ్రి కదా. తరచుగా వస్తూ ఉంటారు. ఖర్చులకని ఇంత డబ్బు ఆయన చేతిలో పెట్టి పోతూ ఉంటారు. కూతుళ్ళంతా దగ్గరలోనే ఉంటారు కాబట్టి వ్యావహారికమైన సాధకబాధకాలనీ, మంచి చెడ్డలనీ చూసి పోయే బాధ్యత గుజస్తుగా వారి మీద పడింది.

పాఠశాలలో ఎన్నో పరీక్షాపత్రాలని అవలీలగా పరిష్కరిస్తూ వచ్చిన రంగబాబు పిల్లల జీవితాలలో కొరుకుడుపడని గడ్డు ప్రశ్న ఒకటి మిగిలిపోయింది. అదేమిటయ్యా అంటే వయసు మీరుతూన్న తండ్రి, అతగాడి జీవితం. రంగబాబు శేషజీవితాన్ని ఎక్కడ ఎవ్వరి దగ్గర గడపాలీ అన్న అంశం మీద ఆ ఇంట్లో తర్జనభర్జనలు జరగని రోజు లేదు. కాని తరుణోపాయం ఎవ్వరికీ తట్టలేదు.

వయస్సు మీరుతూన్న తండ్రిని చూసుకోవలసిన నైతిక బాధ్యత మగపిల్లలదేనని ఆడపిల్లలు అభిప్రాయపడ్డారు. ఒక వేళ తండ్రి దగ్గర ఆస్తి ఉండుంటే అది మగపిల్లలకే సంక్రమించి ఉండేది కదా, కనుక తండ్రి బాధ్యత కూడ వారిదే అని వారి వాదం.

భారతదేశంలో బాధ్యత అంటే ముందు గుర్తుకు వచ్చేది డబ్బు! కనుక, అవసరమైన ఖర్చులన్నీ భరిస్తాము కానీ, తండ్రిని దగ్గర ఉండి చూసుకుందుకని ఉద్యోగాలు ఒదిలేసి రాలేమని మగ పిల్లల మొరాయింపు. ఒకవేళ తెగించి వచ్చేస్తే ఇండియాలో దొరికే చాలీ చాలని జీతాలతో తండ్రిని ఏమి పోషించగలరు? ఆడపిల్లలైతే నేమిటి? తండ్రి అందరికీ తండ్రే కదా. కనుక రంగబాబు కూతుళ్ళ దగ్గర ఉండడమే మంచిదని విదేశాలలో ఉన్న మగ పిల్లలు ఉద్దేశపడ్డారు.

తండ్రిని తమతో తీసుకెళితే లోకం హర్షించదనీ, ఒకవేళ లోకంతో నాకేం పని అని తెగించినా తమ అత్తవారు అనుమతించరనీ ఆడపిల్లలు నచ్చజెప్పు మాటలు చెప్పేవారు. మగపిల్లలు అమెరికా నుండి తిరిగి వచ్చేసి తండ్రి మంచి చెడ్డలు చూసుకోటానికి వీలు కాని పక్షంలో ఆయనని అమెరికా

తీసికెళ్ళిపోమని సలహా కూడ ఇచ్చేరు. ఇలా రంగబాబు భవిష్యత్తు గురించి ఆ ఇంట్లో తర్జనభర్జనలు, వాగ్వివాదాలు జరగని రోజు లేదు.

ఈ వయస్సులో ఆయన అమెరికా వెళితే అక్కడ కాలక్షేపం కాక నిష్కారణంగా చచ్చిపోతాడని ఊళ్ళో కొందరు ఆరాటపడ్డారు. ఒకవేళ తమతో అమెరికావో ఆస్ట్రేలియావో ఆయనని తీసుకెళ్ళిపోతే ఆడపిల్లలకి మళ్ళా మళ్ళా తండ్రిని చూసే అవకాశం ఉండదనీ, కనుక తొందరపడడం మంచిది కాదనీ చెప్పి చూసేరు, మగపిల్లలు.

తండ్రిని నిజంగా తమతో తీసుకెళ్లదలుచుకున్నప్పుడు అదొక పెద్ద అభ్యంతరం కాదన్నారు అమ్మాయిలు ఏక కంఠంతో. “ఆయన చచ్చిపోతే ఏమిటి చేసి ఉండేవాళ్ళమి? ఒకసారి భోరుమని ఏడిచి తర్వాత కాలక్రమేణ మరచిపోయి ఉండే వాళ్ళమి కదా?” అని ఎదురు ప్రశ్న వేసేరు.

ఈ వాగ్వివాదాలలో వేడి పుడుతోంది కాని వెలుతురు పూజ్యం.  చెప్పొచ్చేదేమిటంటే, అందరికీ ఆమోదయోగ్యమైన పరిష్కారం ఎవ్వరికీ దొరకలేదు.

రంగబాబుకి దేశాలు దాటి మగపిల్లల దగ్గరకి వెళ్ళి ఉండవలసిన అవసరం కనిపించలేదు. కోడళ్ళ చేత మాట పడవలసిన అవకాశం కల్పించడం ఆయనకి ఇష్టం లేదు. కాని ఊరంతా కోడై కూస్తుందేమోనన్న భయమూ, కూతుళ్ళ ముందు కొడుకులు ఎక్కడ లోకువై పోతారో నన్న అనుమానంతో రంగబాబు తెగించి కొడుకుల దగ్గరకి వెళ్ళి ఉందామని అమెరికా వెళ్ళడం వెళ్ళేడు. నాలుగు నెలలు ఉండి ఎలా ఉంటుందో చూద్దామని వీసా తీసుకున్న మనిషి నాలుగు వారాలు తిరక్కుండా ఏదో వ్యవహారం ఉందని తిరిగివచ్చేసేడు. “ఒకొక్కళ్ళ దగర ఒకొక్క నెల ఉన్నానంటే నాకు యుగాలు రోజులుగా గడిచిపోతాయి ” అని చెప్పిన పెద్దమనిషి చివరికి ఎవరిదగ్గరా ఉండడానికి ఇష్టపడక సొంత ఇంట్లోనే ఒంటరిగా కాలక్షేపం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు.

రంగబాబుకి ఊరినిండా స్నేహితులే. వాళ్ళు వస్తూ పోతూ ఉంటారు. పలకరించే వాళ్ళకీ, కాలక్షేపానికీ కొదువ లేదు. అమెరికా నుండి తిరిగొచ్చేసేడు కనుక బతికిపోయేడు కానీ అక్కడే ఉండుంటే ఈ పాటికి చచ్చిపోయి ఉండేవాడు ఒంటరితనం భరించలేక.

కాఫీ కూడ కాచుకోవడం చేతకాని శాల్తీ చెయ్యెక్కడ కాల్చుకుంటాడని అనుకుంటూ ఆయన బంధువర్గంలో ఉన్న వయసు మళ్ళిన వెధవావిడ ఒకావిడ ఆయనకి నాలుగు చారు మెతుకులు వండిపడేసి తనో నాలుగు మెతుకులు కతికి తలదాచుకోవచ్చు కదా అని ఆయన పంచన చేరింది. ఏదో అంధపంగన్యాయం, కుంటివాడికి గుడ్డిది తోడులా, అనుకుని రంగబాబు కానిమ్మన్నట్టు ఊరుకున్నాడు.

అన్ని రోజులూ సజావుగా వెళ్ళిపోతే చెప్పుకునేందుకు ఏమి ఉంటుంది? కర్మ వశాత్తూ ఒక రోజున ముసలావిడ స్నానం చేస్తూ నూతి చపటా మీద కాలు జారి పడింది. వయసు మళ్ళిన ఆడది కావడంతో ఎముకలు పెళుసుదేరి ఉన్నాయేమో కిందపడగానే ఆవిడ తుంటి ఎముక విరిగింది. మంచం పట్టేసింది. ఇక మనకి దక్కదని తెలిసి కూడ రంగబాబు చేతనైన వైద్యం చేయించేడు. కాని ముసలావిడ తీసుకుని తీసుకుని ఏడాది తిరక్కుండా ప్రాణం ఒదిలేసి, రంగబాబుని ఒంటరిగా ఒదిలేసి వెళ్ళిపోయింది.

ముసలావిడకి యధావిధిగా కర్మకాండలు చేయించేడు రంగబాబు. పదకొండో రోజు కర్మకాండ జరిగిన తర్వాత, వచ్చిన వాళ్ళు ఎవరిళ్ళకి వారు వెళిపోయిన తర్వాత రంగం నుంచి నిష్క్రమించినట్టే అమాంతం మటుమాయం అయిపోయేడు రంగబాబు. నెల రోజుల పాటు కనబడని మనిషి ఒక రోజున అకస్మాత్తుగా క్లినిక్ దగ్గర తేలేడన్నమాట.

"దిగండి బాబు గారూ కిలినిక్కొచ్చేసేం" అని సివంచలం హెచ్చరించేసరికి రామేశం గారు ఆలోచనా తరంగాలని దాటుకుని ఈవలి గట్టుకి వచ్చేరు. సివంచలం కారు తలుపు తీసి పట్టుకుంటే రామేశం గారు చేతికర్రతో సహా నెమ్మదిగా దిగుతూ ఉంటే డాక్టర్ పరాంకుశం క్లినిక్ లోంచి బయటకు వచ్చి ఆయనకి ఎదురేగి ఆయన చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకు వెళ్ళేడు.

“ఏమిటి జరిగిందోయ్ పరాంకుశం? అంత అర్జంటుగా కారు పంపేవు?” అని కుర్చీలో కూర్చుంటూ అడిగేరు రామేశం గారు.

“రంగబాబుని మీరొకసారి చూడాలి” అంటూ రామేశం గారిని రంగబాబు దగ్గరకి తీసుకెళ్ళాడు పరాంకుశం.

రంగబాబుని చూసి రామేశం ముక్కు మీద వేలేసుకున్నారు. రెండు మూడేళ్ళ క్రితం చూసిన రంగబాబు ఎంతలా మారిపోయేడూ! ఉక్కు ముక్కలా ఉండే రంగబాబు ఊదేస్తే పడిపోయేలా ఉన్నాడు. నోట్లోంచి చొంగ కారుతోంది. కళ్ళలో కళ లేదు. అవి అలా శూన్యం లోకి చూస్తున్నాయి. ఉక్కుపిడుగులా ఊరంతా తిరిగే మనిషి నర్సు చెయ్యి పట్టుకుని కాని నిలబడలేకపోతున్నాడు!

“రైలు స్టేషన్లో ఓ రోజు రాత్రంతా బల్ల మీద కూర్చున్నాడుట. తెల్లారి ఎవరో ఈయనని గుర్తు పట్టి తీసుకొచ్చి క్లినిక్లో దిగబెట్టి పోయారు. నేను చొరవ చేసి క్లినిక్లో ఎడ్మిట్ చేసి దగ్గరలో ఉన్న ఆయన కూతుళ్ళకీ, మనవలకీ కబురు పెట్టేను. వాళ్ళు వచ్చి చూసి వెళుతున్నారు.”

“…..”

“వారం రోజుల బట్టి పరీక్షలు చేసి చూస్తున్నాను. మూత్రాన్ని అదుపు చెయ్యలేక జారవిడిచి బట్టలు తడిపేసుకుంటున్నాడు. తిండి తినడు. రాత్రుళ్ళు మనిషి కాపలా లేకపోతే బయటికి పోతున్నాడు. ఒంటిమీద బట్ట ఉందో లేదో కూడ చూసుకోవడం లేదు.”

” ---.. ”

“ముసలావిడ పోవడంతో తాడు తెగిన గాలి పటంలా తయారయిన జీవితాన్ని తలుచుకుని డిప్రెషన్లోకి వెళ్ళిపోయాడని అనుకున్నాను. నాలుగురోజులలో ఆ శ్మశానవైరాగ్యం సర్దుకుంటుందనుకున్నాను.”

” ---. ”

"ముసలావిడకి హిప్ ఫ్రేక్చర్ అయిందంటూ రంగబాబు మొదటిసారిగా నన్ను కన్సల్ట్ చెయ్యడానికి వచ్చినప్పటికే ఒంటి మీద వయస్సు కనిపిస్తోంది కాని, మనిషి బాగానే ఉన్నట్లు కనిపించేడు. ముసలావిడ ఇంక ఎంతో కాలం బతకదని చెబితే చెట్టంత మనిషీ భోరుమని ఏడిచేసి విరిగిన మానులా కూలబడిపోయేడు."

" .....  "

"అప్పుడు అమెరికాలో ఉన్న పిల్లలు ఫోను చేసి చెప్పేరు. డబ్బు ఖర్చు పెడతామన్నారు. వైద్యం చేయించమన్నారు. అందుకని కేట్స్కేన్ తీయించేను. ఆల్^జైమర్స్ రోగం అనుకుందామంటే మెదడు ఏమీ కృశించినట్లు కనిపించలేదు. పోనీ మస్తిగాతం (స్ట్రోక్) సూచనలు కానీ, మెదడులో కంతి (ట్యూమర్) ఉన్న సూచనలు కానీ ఉన్నాయేమోనని చూసేను. ఏమీ కనపడలేదు. స్పయినల్ టేప్ తీసి వెన్నుజలం చూసేం. అది కూడ ఉండవలసిన లక్షణాలతో మడ్డిగా కాకుండా తేట (క్లియర్) గా ఉంది. రక్తం పరీక్ష చేసి చూసేం. ఎర్ర కణాల కైవారం ఉండవలసిన దానికంటే ఒక్క రవ ఎక్కువగా ఉన్నట్లు అనిపించేయి తప్ప అక్కడా దోషం పెద్దగా ఏమీ కనిపించలేదు."

"ఆంగికమైన రోగలక్షణాలు ఏమీ లేవంటావు." మొదటిసారిగా రామేశం గారు ఒక చిన్న ప్రశ్న వేసేరు.

"అలాగే అనిపిస్తోందండి. ఎందుకేనా మంచిదని న్యూరాలజిస్టు ఒకావిడని సంప్రదించేమండి. ఆవిడది నాడీ మండలానికి సంబంధించిన జబ్బులలో ప్రావీణ్యత కనుక పరీక్షలలో పట్టుబడని లక్షణాలని పట్టుకోగలదని నమ్మకంతో ఆవిడ ఉద్దేశం అడిగేమండి."

"ఆవిడ ఏమంది?"

"పెద్దాపురం చాంతాడంత సంస్కృత సమాసం లాంటి వైద్యపదజాలంతో ఒక రోగనిర్ణయం చేసి అంతకంటె పెద్ద బిల్లు పంపిందండి."

"నాకు అర్థం అయే భాషలోకి అనువదించి సారాంశం చెప్పు చాలు."

"అత్యధికమైన వేగంతో పురోగమిస్తున్న డెమెంటియా అని ఆవిడ అభిప్రాయం. డెమెంటియా అన్నా సెనిలిటీ అన్నా దరిదాపు ఒకటే. పెరిగే వయస్సుతో పాటు వచ్చే బుద్ధిమాంద్యత, మానసిక బలహీనత."

"ఈ 'ముదిమి మాంద్యత' వయస్సుతో సంక్రమించే రోగం అయినప్పుడు, తత్సంబంధమైన మార్పులు ఏమీ లేవని చెబుతున్నావు కదా! దానికి ఆవిడ సంజాయిషీ ఏమిటి?"

"ఆవిడకీ తెలియదదండి. అందుకనే ఆవిడ దానిని 'నిర్ధారించలేని కారణంతో అత్యధిక వేగంతో పురోగమిస్తున్న ముదిమి మాంద్యత ' అని రోగనిర్ణయం చేసిందదండి."

"అంతేనా? ఇంకేమైనా చెప్పిందా, ఆ డాక్టరమ్మ?"

"ఇంకా ఉందదండి. అంతా చెప్పమంటారా?"

"చెప్పవోయ్!"

"తెలుగులోకి తర్జుమా చేసి చెబుతానండి. వినండి. ' నిర్ధారించలేని కారణంతో అత్యధిక వేగంతో పురోగమిస్తూన్న ముదిమి మాంద్యత ఇది. దీని కారణంగా రోగి కర్మేంద్రియాలలో సహకార నిరాకరణ కనిపిస్తున్నాది. రోగి తన పరిధిని మించిన ఉద్వేగానుభూతులకి లోనవుతున్నాడు. మెదడు లోని తార్కిక శక్తులని, జ్ఞాపకశక్తిని నియంత్రించే కేంద్రాలు లోపభూయిష్టంగా పనిచేస్తున్నాయి. ' ఇదండి రోగనిర్ణయం."

"ఈ రోగనిర్ణయానికి ఏమాత్రం ఫీజు పుచ్చుకుందోయ్?"

"అమాంబాపతు కలుపుకుని అరలక్ష అయిందదండి."

"ఈ దెబ్బతో ఆ అమెరికాలో ఉన్న కొడుకులకి అరుంధతి నక్షత్రం కనిపించి ఉండాలి··· అది సరేకానీ, మానసిక వైద్యుణ్ణి ఎవరినైనా సంప్రదించేవేమిటోయ్?"

“అదీ చేసేనండి. సైకాయాట్రిస్టు ఏమన్నాడంటే ఏదో విషపూరిత పదార్థం తినేసి ఉంటాడేమో తప్ప రోగిలో డిప్రెషన్ లక్షణాలేవీ లేవన్నాడు.”

“దీనికి ఎంతయిందోయ్?”

“దీనికో ముప్పై వేలండి.”

“గుడ్డిలో మెల్ల. డిప్రెషన్ లేదు. బాగానే ఉంది. కాని మనం కడితేరా గట్టెక్క లేదు. ఎందుకంటే డిమెంటియా ఉన్నట్లుంది. మూడొంతులు విషపదార్థం కారణం అయుండొచ్చు.”

“విషపదార్థం ఏదీ కాదని మేము రక్త పరీక్ష చేసి నిర్ధారించేమండి.”

“పరాంకుశం, ఇప్పటి వరకూ డబ్బు నీళ్ళలా ఖర్చయినట్లు ఉంది. రోగం ఇతమిద్ధంగా ఇదీ అని ఎవ్వరూ నిర్ధారించలేక పోతున్నారు. ఎంత డబ్బు కుమ్మరించి ఎన్ని పరీక్షలు చేసినా ఫలితం కనిపించడం లేదు. నిన్న మొన్నటి వరకూ ఉక్కుపిడుగులా చెక్కుచెదరకుండా తిరిగిన మనిషి, మతిలేని వాడిలా రోజు రోజుకీ క్షీణించి పోతున్నాడని చెబుతున్నావు. ఆలశ్యం చేస్తే మనకి దక్కకుండా పోతాడేమోనని నాకు అనుమానంగా ఉంది.”

“ఆ ముసలావిడ కూడా లేదు. చూసి చేసే వాళ్ళు లేక పోయిన తర్వాత ఆయన ఇంకా బతికి ఏమి బాముకుంటాడండి? దిక్కూ దివాణం లేకుండా ఏ ప్రేమసమాజం వాళ్ళ కొంపలోనో పడుండవలసి వస్తుందో ఏమిటో. ఏదో ఆయన్ని ఇలా వెళ్ళిపోనివ్వకూడదూ?” అంతవరకూ వ్యవహారం అంతా వింటున్న నర్సు కొంచెం కలగజేసుకుని తన మనస్సులో ఉన్న మాటని పైకి అనేసింది.

నర్సు చేసిన వ్యాఖ్యానంలో కొంత నిజం లేకపోలేదు అనిపించింది రామేశం గారికి. కాని ఆమాటలని అంతర్గతం చేసుకుని మధించి మధించి చూడగా రంగబాబు జీవితం తన జీవితానికి ఒక దర్పణ బింబంలా అగుపించింది. తనూ రంగబాబూ దరిదాపు సమవయస్కులు. తన పిల్లలూ అమెరికాలో ఉన్నారు. తనకీ ఆడపిల్లలు ఉన్నారు. పరాంకుశాన్ని తన పంచన చేర్చుకున్న తర్వాత అతనూ అతని

భార్య తన వ్యష్టి జీవితంలో ఉన్న లోపాలని పూరించి కన్న బిడ్డల కంటె ఎక్కువగా చూసుకుంటున్నారు. ఒక విధంగా తను అదృష్టవంతుడు.

రంగబాబు అటువంటి అదృష్టానికి నోచుకోలేదు. అయినప్పటికీ గాలిలో దీపం పెట్టి 'భగవంతుడా నీదే భారం ' అని ఒదిలేసినట్లు రంగబాబుని ఎందుకు ఒదిలెయ్యాలి? 'చేతనైన వైద్యం చేసేం. ఇక మాకు చేతగాదు' అని వదిలేస్తే ఇప్పుడు ఎక్కడకు పోతాడు? ఇన్నాళ్ళూ రాని కొడుకులు ఇప్పుడు అమెరికా నుండి వచ్చి ఆయన మంచిచెడ్డలు చూడగలరనుకోవడం ఒక వ్యర్థమైన ప్రతిపాదన. చుట్టపుచూపుగా వచ్చి సర్వబాధ్యతలూ వహించి అనారోగ్యుడైన తండ్రిని తమతో తీసుకు వెళతారనుకోవడం అవివేకం. ఆస్తి పంపకాలలో భాగస్తులు కాజాలని ఆడపిల్లలని బాధ్యతలలో భాగస్తులు కమ్మని ఆహ్వానించడం అన్యాయం.

ఇలా ఆలోచిస్తూ ఉంటే రామేశం గారి మనస్సు పాడైంది. ఆ సమయంలో ఆపద్బాంధవుడిలా పరాంకుశం కొడుకు గదిలో ప్రవేశించి, "తాత గారూ, మన కొత్త కంప్యూటరుని 'ఇంటర్నెట్' కి 'కనెక్ట్' చేసేను. మీరు చూద్దురుగాని రండి" అంటూ చెయ్యి పట్టుకుని బిరబిరా ఈడ్చుకుపోయాడు.

2

కిరణ్ కంప్యూటర్ సహాయంతో అతి లాఘవంగా, అమితోత్సాహంతో అంతర్జాలపు ('ఇంటర్నెట్') ఫేన శిఖల పైన ఈతకొడుతున్నాడు. యాహూ, అక్కడనుండి ఆల్టావిస్టా మొదలైన రకరకాల కంపెనీల వారి పుట్టుపుట ('హోమ్ పేజీ') లోకి వెళ్ళి అక్కడ లభ్యమయే దర్శనులు ('డైరెక్టరీస్'), అన్వేషణ యంత్రాలు ('సెర్చ్ ఇంజన్స్') వాడి ప్రపంచపు నాలుగు మూలలకీ వెళ్ళి వింతలు, వార్తలు, విశేషాలు కంప్యూటరు యొక్క జరనిక ('స్క్రీన్') మీద చూపిస్తున్నాడు. రామేశం గారు ఆసక్తితో అన్ని విషయాలూ అవగాహన చేసుకుంటూ, అర్థం కాని చోట ఏవేవో ప్రశ్నలు అడుగుతున్నారు.

"మీరు ఎవరి పేరైనా చెప్పండి." కిరణ్ అడిగేడు.

అమెరికాలో ఉన్న తన కొడుకు పేరు చెప్పేరు, రామేశం.

ఆ పేరుని కంప్యూటర్ తెర మీద కనిపించేలా టైపు చేసి మీట నొక్కేడు, కుర్రాడు. ఒక నిమిషంలో రామేశం గారి కొడుకు పేరుతో పాటు మరొక అరడజను పేర్లు జరనిక మీద కనిపించేయి. ఆ పేర్లలో రామేశం గారి కొడుకు పేరుని ఎంచుకుని మళ్ళా మీట నొక్కేడు.

అప్పుడు రామేశం గారి కొడుకు పుట్టుపుట అతని ఫోటోతో సహా, తెరమీద కనిపించింది. కొడుకు ఫోటో చూడగానే రామేశం గారి శరీరం పుత్రవాత్సల్యంతో పులకించింది. ఆ ఫోటో పక్కనే కోడలు, మనవలు ఉన్న మరొక ఫోటో, ఆ తర్వాత అతని ఉద్యోగం వివరాలు, ఇలా ఎన్నో వివరాలు కనిపించేయి. కంప్యూటరు విభాగం లోని అంతర్జాలం నిర్మాణానికి అతను అహరహం ఎంతో కృషి చేసేడు. కనుక పరిశోధనా దశలో ఉన్న 'ఇంటర్నెట్' గురించి కొడుకు చెప్పగా తను ఎన్నో సార్లు విన్నాడు. కాని స్వానుభవం ఇదే.

"బాబూ, ఇందులో మనుషుల పేర్లేనా, మరేదైనా కూడా వెదకొచ్చా?"

"తాత గారూ, మీరు ఏదో ఒక పేరు చెప్పండి వెదుకుదాం!"

"హోమియోపతీ అన్న మాట గురించి వెదుకు."

మనవడు హోమియోపతి అన్న మాటని అన్వేషణ యంత్రంలో కీలక పదంగా ప్రవేశపెట్టి మీట నొక్కేడు. ఈ మాట ఉన్న పుట్టుపుటలు కనీసం ముప్పైయ్ దొరికేయి చాల మట్టుకు ఇంగ్లండు, కెనడాల నుండి. హోమియోపతిలో తెలుసుకోవలసిన విషయాలు వందలాది కనిపించేయి. కంప్యూటరు సహాయంతో అన్వేషణ యంత్రాలని ఉపయోగించి ప్రపంచవ్యాప్తంగా విస్తరిల్లి ఉన్న అంతర్జాలాన్ని నిమిషాల మీద వెతక వచ్చనీ, ప్రపంచవ్యాప్తంగా దొరికే సమాచారనిధిని ఇల్లు దాటకుండా, కడుపులో చల్ల కదలకుండా హస్తగతం చేసుకుని, అవగతం చేసుకుని, జీర్ణించుకుని ఏదైనా సాధించవచ్చని కిరణ్ సహాయంతో అవగాహన చేసుకున్నారు, రామేశం గారు.

కొత్త అనుభవంతో ప్రభవించే నూతనోత్సాహం కొంచెం చల్లారగానే రామేశం గారికి రంగబాబు గుర్తుకు వచ్చేడు. కిరణ్ సహాయంతో, కంప్యూటరు సాన్నిధ్యంలో కూర్చుని రంగబాబు జబ్బు మీద పరిశోధన మొదలుపెట్టేరు, రామేశం గారు. జబ్బు లక్షణాలని కంప్యూటరుకి చెప్పి ఏయే కారణాల వల్ల ఆయా లక్షణాలు పొడచూపుతాయో కనుక్కోవాలని ఆయన ఆరాటం. ఒకొక్క లక్షణం యొక్క పేరుని కీలక పదంగా కంప్యూటరు లోకి ఎక్కించి ఆ పదం తాకిడితో ఉద్భవించే జాబితాలన్నిటిని కూడ గట్టడం. తర్వాత ఇంతవరకు చేసిన పరీక్షల వల్ల గణించిన పరిజ్ఞానం అనే జల్లెడలో ఈ జాబితాలని వేసి జల్లించడం. అలా కుదించగా వచ్చిన చిన్న జాబితాలోని వ్యాసాలని చదవడం. చదివి జీర్ణించుకోవడం. ఇలా కిరణ్ సహాయంతో రామేశం గారు కంప్యూటరుతో రెండు గంటలైనా కుస్తీ పట్టి ఉంటారు. ఆఖరికి ఒక బాణీ కనబడసాగింది. ఆ బాణీని చూడగా, చూడగా రంగబాబు తినే తిండిలో ఏదైనా పోషకపదార్థాల లోపం ఉందేమోనని ఆయనకి కొద్దిగా అనుమానం వచ్చింది. అప్పుడు 'పోషకపదార్థాల లోపం ' అనే అర్థం స్ఫురించేలా మరొక కీలక సమాసాన్ని ఇంగ్లీషులో తయారుచేసి మళ్ళా ఆమాటని అన్వేషణ యంత్రంలో వాడి ఏమిటవుతుందో అని ఆత్రుతగా ఎదురు చూసేరు. ఈ వడపోతలలో 'అయొడీను, విటమినులు ' లోపించడం వల్ల వచ్చే జబ్బేదో రంగబాబుకి వచ్చుండాలని తేలింది.

థైరాయిడ్ గ్రంథి బాగానే పని చేస్తున్నాదని ఉదయం పరాంకుశం చెప్పేడు. కనుక, ఇది విటమిన్ లోపమా? బి12 లోపించినప్పుడు రంగబాబు లక్షణాలు కనిపించడానికి మంచి అవకాశం ఉంది.

ఈ బి12 శరీరంలో అత్యంత సూక్ష్మమైన మోతాదులలో ఉంటే సరిపోతుంది. ఈ బి12 విటమిన్ జంతు సంబంధమైన ఆహారాలలో తప్ప వృక్ష సంబంధమైన ఆహారాలలో దొరకనే దొరకదు. మనం తినే మాంసం, పాలు, పెరుగు, మజ్జిగలలో ఈ బి12 ఉంటుంది కనుక సర్వసాధారణంగా ఈ లోపం ఎవ్వరికీ రాదు. లోపం వచ్చిందంటే దానికి రెండే రెండు కారణాలు. ఒకటి, తిన్న విటమిన్ బి12 ఒంటపట్టక పోవడం. దీనికి కారణం బి12 ఒంటపట్టడానికి సహాయపడే కారణాంశాలు శరీరంలో

లేకపోవడం. దేవుడు వరం ఇచ్చేడు కానీ పూజారి వరం ఇవ్వలేదంటామే, అచ్చం అదే సారూప్యం ఇక్కడ. రెండవ కారణం ఏమిటంటే బి12 విటమిన్ మనం తినే ఆహారంలో సరిపడా లేకపోవడం.

ఈ ఆధునిక యుగంలో విటమిన్ బి12 లోపించడం అనేది పరిపూర్ణ, పరమఛాందస, శుద్ధ శాకాహారులలో తప్ప మరెక్కడా కనిపించదు. అటువంటి పరమఛాందసమైన శుద్ధ శాకాహారులు ఈ రోజులలో కంచుకాగడా వేసి వెతికినా కనిపించరు. కనుక ఈ లోపం వల్ల ప్రభవించే లక్షణాలని చూసే భాగ్యం కోటికో వైద్యుడికి దొరుకుతుంది. కనుక ఈ లోపం వల్ల కనిపించే లక్షణాలని చూసినప్పుడు రోగనిర్ణయం చాల మంది వైద్యులు తప్పుగా చేస్తూ ఉంటారు.

భార్య చచ్చిపోయిన తర్వాతే పాలు కూడ తాగడం మానేసి ఒంటిపూట భోజనం మొదలుపెట్టేడు, రంగబాబు. పాలు తాగని శాకాహారులు కూడ తమకి తెలియకుండానో, ప్రమాదవశాత్తూనో జంతుసంబంధమైన పదార్థాన్ని అప్పుడప్పుడు భక్షించడం జరుగుతూ ఉంటుంది. ముసలావిడ వండి పడేసినన్నాళ్ళూ ఇటువంటి 'ప్రమాదాలు ' అడపాదడపా జరిగే ఉంటాయి. ఆవిడ పోవడం, దానితో వచ్చిన 'డిప్రెషన్' , తర్వాత పోషణ లోపించడం ఇవన్ని పులి మీద పుట్రలా ముసలాడి భుజాల మీద పడే సరికి మానవుడు తట్టుకోలేక పోయుంటాడు. ఇలా సిద్ధాంత సౌధాన్ని ఒక దాన్ని మనస్సులో నిర్మించుకుని రాత్రి భోజనాలయిన తర్వాత పరాంకుశంతో ముచ్చటించేరు, రామేశం గారు.

గోల్డ్ మెడలిస్ట్ పరాంకుశానికి ఈ సిద్ధాంతంలో ఏమీ లోపం కనిపించ లేదు. రామేశం గారు చెప్పే కథనాన్ని విని, "మీరు చెప్పిన దానిని బట్టి రంగబాబుకి వచ్చినది 'పెర్నిషస్ ఎనీమియా' అని నాకు అనిపిస్తోంది. క్రీ.శ. 1821 లోనే ఈ జబ్బు లక్షణాలని వైద్యులు వర్ణించేరు. 1926 నాటికి ఈ జబ్బుని కుదర్చడానికి ఒక 'గృహవైద్యం ' దొరికింది ఆవులు, మేకలు వంటి జంతువుల కాలేయం ('లివర్' ) తినడం. క్రీ.శ. 1948 నాటికి కాలేయం అంతా తినక్కర లేదనీ, అందులో ఉన్న కోబాలమీన్ అనే పదార్థం తింటే సరిపోతుందనీ నిర్ణయించేరు. ఈ కోబాలమీన్ నే మనమంతా విటమిన్ బి12 అని పిలుస్తాం."

అప్పుడప్పుడే సైన్సు పాఠాలు నేర్చుకుంటూన్న కిరణ్ ఈ కబుర్లన్నీ వింటున్నాడు. వచ్చిన అనుమానాన్ని ఆపుకోలేక అడిగేడు.

"మరయితే, మరయితే, ఆవులు శాకాహారులే కదా! వాటి కాలేయాలలోకి ఈ బి12 ఎక్కడ నుండి వచ్చింది?"

ఈ ప్రశ్నలో ఉన్న సొగసుని రామేశం గారు పట్టలేదు కానీ పరాంకుశం పట్టేసేడు. పట్టేయడమే కాదు, తన కొడుకు ఇంత నిశితమైన ప్రశ్న అడిగినందుకు లోలోపల ఉప్పొంగిపోయాడు.

"కిరణ్! ఇది మంచి ప్రశ్నే! ఈ బి12 ఒక్క మనుష్యులకే కాదు చిన్న చిన్న మోతాదులలో జంతుకోటికి అంతటికీ కావాలి. కాని తమాషా ఏమిటంటే జంతువులు ఏవీ కూడ ఈ విటమిన్ ని తమ తమ శరీరాలలో తయారుచేసుకోలేవు. కనుక ఆవులూ, మేకలూ కూడ ఈ విటమిన్ ని తయారుచేసుకోలేవు."

"మరయితే ఆవుల కాలేయాల లోకి ఈ విటమిన్ ఎలా వచ్చింది?"

"సృష్టిలో ఉన్న జీవకోటిలో ఒక రకం బేక్టీరియాకే ఈ విటమిన్ బి12 తయారుచెయ్యడం చేతనవుతుంది. ఈ రకం సూక్ష్మజీవులు నెమరువేసే జంతువుల కడుపుల లోనే బతక గలవు. మనుష్యుల పేగులలో ఉండే సూక్ష్మజీవులకి ఈ విటమిన్ తయారు చెయ్యడం చేతకాదు. కాని ఈ బి12 లేకపోతే మనుష్యులు చచ్చిపోతారు. కనుక పరిపూర్ణమైన ఆరోగ్యం కావాలంటే మనుష్యులు అప్పుడప్పుడు మాంసమో, పాలో, పెరుగో తింటూ ఉండాలి. ఆరోగ్యానికి కావలసిన మోతాదు అత్యల్పం."

"పరాంకుశం! డార్విన్ సిద్ధాంతం ప్రకారం ఈ బి12 తయారు చేసుకోవడం చేతనైన మానవ వర్గాలే వృద్ధి చెంది మిగిలిన వర్గాలు ఈ జీవన సమరంలో దెబ్బతిని క్షీణించి ఉండవలసింది. మన మానవ

జాతి ఈనాడు బతికి ఉన్నాది కనుక ఈ పరిస్థితిని మనం ఎదుర్కో వలసిన అవసరం మనకి రాలేదన్న మాటే కదా!" అని రామేశం చిన్న అనుమానాన్ని వ్యక్తపరిచేరు.

"నిజమేనండి. మీరు ఒక విషయం మరచిపోకూడదు. మొన్న మొన్నటి వరకు మానవుడు మాంసాహారి. మానవుడు భూమిని దున్ని సాగుచెయ్యడం నేర్చుకున్నది పదివేల ఏళ్ళ క్రితం. శాకాహారం అనే అలవాటు మహావీరుడు, బుద్ధుడు కాలంలో మొదలయింది. అంటే రెండు వేల ఏళ్ళ క్రితం నుండే శాకాహారం వాడుకలోకి వచ్చింది. అందులోనూ చాల మంది శాకాహారులు పాలు, మజ్జిగ వగైరాలు తాగుతారు. కనుక బి12 లోపం సర్వసాధారణంగా రాకూడదు. వచ్చినా దానికి తిండి లోపం కాకుండా ఇందాకా చెప్పిన కారణాంశం లోపం కారణం అయి ఉండొచ్చు.

"విటమిన్ సరఫరా లోపాల వల్ల వచ్చిన జబ్బులని కుదర్చడం అతి తేలిక. లోపించిన విటమిన్ కొద్ది మోతాదులో తినిపించినంత మాత్రాన్న ఒరిగే నష్టం ఏమీ లేదు. అది పనిచెయ్యకపోతే ఆ సేతువుని అప్పుడే దాటవచ్చు." అని పరాంకుశం తన వైద్య పరిజ్ఞానాన్ని వెల్లడి చేసేడు.

3

తెల్లారగానే పరాంకుశం క్లినిక్ కి వెళ్ళి రంగబాబు రక్తం కొద్దిగా మచ్చుకి తీసి 'లేబ్' కి పంపేడు. బి12 రక్తంలో ఏమాత్రం ఉందో కొలిచి చెప్పమని అడిగేడు. ఆ పరీక్ష ఫలితాలు ఎప్పుడో సాయంకాలానికి కాని రావు. ఆలస్యం అమృతం విషం అన్నారు కనుక, పరీక్షా ఫలితాలతో నిమిత్తం లేకుండా వెంటనే 100 మైక్రోగ్రాములు బి12 విటమిన్ ఇంజెక్షన్ చేసేడు. సాయంకాలం రక్తపు పరీక్ష ఫలితాలు వచ్చే వేళకి రంగబాబు మంచం మీద కూర్చుని 'శివదీక్షాపరురాలనురా!..' అని కూని రాగాలు తియ్యడం మొదలుపెట్టేడు. రక్తంలో బి12 లేశమాత్రం కూడా లేదని పరీక్ష తేల్చి, రామేశం గారి ఊహ ఒప్పే అని తీర్మానించింది.

మర్నాడు రంగబాబు ఇటూ అటూ పచార్లు చెయ్యడం మొదలుపెట్టేడు. మూడో నాటికి మూత్రాశయం అదుపులోకి వచ్చింది. వారం తిరక్కుండా దరిదాపు మామూలు మనిషి అయిపోయేడు. ఆసుపత్రి నుండి విడుదల చేసే సమయం వచ్చింది.

ఆసుపత్రి నుండి రంగబాబు ఎక్కడికి వెళతాడు?

గండం గడిచే వేళకి అమెరికా నుండి కొడుకులు, చుట్టుపక్కల నుండి కూతుళ్ళూ వచ్చేరు చూడడానికి. పరిస్థితులు మారేయి కాని ఆ పిల్లలు ఎదుర్కొనే ప్రశ్నలు మారలేదు. అవి పరిష్కారానికి లొంగని ప్రశ్నలు. ఈ వయస్సులో దేశం కాని దేశం అయిన అమెరికా వెళ్ళి కోడళ్ళ దగ్గర ఉండలేడు, రంగబాబు. కూతుళ్ళు ఇప్పుడైనా తండ్రిని చేరదీస్తారా? చేరదీస్తే ఇన్నాళ్ళూ అంతంత దూరంగా ఉంచిన అత్తమామలు – వాళ్ళూ పెద్దవాళ్ళవుతున్నారు కదా – ఏమనుకుంటారు? అత్తమామల మాట దేముడెరుగు, లోకం ఏమనుకుంటుంది?

అందరూ రామేశం గారిని చూడడానికి వెళ్ళేరు.

"పంతులు గారూ! మా నాన్నని ఏ 'నర్సింగ్ హోమ్' లోనో పెట్టడం కాని, ఏ ప్రేమ సమాజం వారి గుడారం లోనో ఒదిలేయడం కాని, చూస్తూ చూస్తూ చెయ్యలేము. మా నాన్నకి ప్రాణం పోసి బతికించేరు. చైనా దేశంలో ఒక సామెత ఉందిట. ప్రాణాలు పోతూన్న మనిషిని ఎవరైతే రక్షిస్తారో వారే వారి మంచిచెడ్డలు చూసుకునే బాధ్యత వహించాలిట. కనుక మా సమస్యని మీరే పరిష్కరించాలి." అని ఏక కంఠంతో వేడుకున్నారు.

ఆయన మాత్రం ఏమి చెయ్యగలడు? కొంతసేపు మౌనంగా ఉండి ఆఖరికి రంగబాబు కూతుళ్ళని ఉద్దేశించి ఇలా అన్నారు.

"అమ్మా! మన దేశపు ఆచారాలు మన ఆడబిడ్డలకి చాల అన్యాయం చేసేయి. చేస్తున్నాయి. తల్లిదండ్రులు చచ్చిపోతే కొడుకులు తలకి కొరివి పెడతారు తప్ప శవం మీద పడి భోరున ఏడిచేది

ఆడపిల్లలే. ఒంటికి ఏదైనా వస్తే చూసేది ఆడపిల్లలే. నేను నా చిన్నతనంలో నా అక్కచెల్లెళ్ళ ఇళ్ళకి వెళ్ళినంత స్వతంత్రంగా అన్నదమ్ముల ఇళ్ళకి వెళ్ళలేక పోయేవాడిని. అటువంటి ఆడపిల్లలకి ఆస్తి హక్కులు లేకుండా చాల కాలం అన్యాయం చేసింది మన సంఘం. నన్నడిగితే పితృస్వామ్యం కంటె మాతృస్వామ్యంలో సదుపాయాలు ఎక్కువ అంటాను. మన ఆచారాలు కట్టుబాట్లు మనని ఒక క్రమశిక్షణలో ఉంచడానికే తప్ప అవేవో అధిగమించడానికి వీలుకాని ధర్మసూత్రాలనుకుని వాటికి మనం బానిసలమై పోకూడదు. ఏ ఎండ కా గొడుగు పట్టాలమ్మా. అంతకంటె నేను మాత్రం ఏమిటి చెప్పగలను?"

**కథ వెనుక కథ:**

మార్చి 2001 ఈమాట అంతర్జాల పత్రికలో ప్రచురితం

http://eemaata.com/em/issues/200103/622.html

అటా (అమెరికా తెలుగు ఎసోసియేషన్) వారి అమెరికా తెలుగు భారతి జనవరి–ఫిబ్రవరి 2001 సంచికలో ప్రచురితం.

# కాల్పనిక వాస్తవం

“అయితే పరకాయ ప్రవేశం సాధ్యమేనంటారా?”

“ఆది శంకరులు పరకాయ ప్రవేశం చేసేరని అంటారు. కాని, అంతకు ముందు కాని, ఆ తరువాత కాని ఎవ్వరూ పరకాయ ప్రవేశం చేసిన దాఖలాలు లేవు. కాని....” అంటూ వాక్యాన్ని అర్ధాంతరంగా ఆపి వక్త సభలో ఉన్న శ్రోతల వైపు చూసేడు. చూసి,....

“కానీ ... పాక్షిక పరకాయ ప్రవేశం వంటి ప్రక్రియ సాధ్యమేనని చెప్పటానికి చెదురు మదురుగా ఆధారాలు కనబడుతున్నాయి!

“నేను చెప్పటం కాదు. నా అనుభవంలో జరిగిన ఒక వృత్తాంతాన్ని సినిమాలా తీసేను. ఆ సినిమా ఇప్పుడు చూపిస్తాను. తరువాత జరిగిన సంఘటనలని విశ్లేషిద్దాం.

“దీపాల దీప్తి తగ్గించి తెర మీద బొమ్మలని ప్రక్షేపించండి.”

హాలులో దీపాలు ఆరిపోయాయి. చుట్టూ చీకటితోపాటు నిశ్శబ్దం ఆవరించింది. తెల్లటి తెర మీద కదిలే బొమ్మలు కదలాడడం మొదలయింది.

1

అదొక చిన్న ఊరు. పర్యాటకుల పాదధూళి పడకుండా తప్పించుకున్న అందమైన చిన్న ఊరు. మంచు కొండల సానువులలో, ఒక సెలయేటి చాటున, పచ్చటి పొలాల మాటున, పొంచి ఉన్న పల్లెటూరు. చిత్రకారులు ఊహించి చిత్రించే చిత్రపటం లాంటి ఊరు.

ఆ ఊళ్లో అదొక చిన్న వసతి గృహం. దాని ప్రాంగణంలో కుటీరంలా ఉన్న ఒంటిదూలపు పెంకుటిల్లు. ఆ కుటీరం ముందు ఒక కారు వచ్చి ఆగింది. కారులోంచి దిగి అతను లోనికి ప్రవేశించేడు. అతిథులని

ఆహ్వానించే బల్ల వెనుక అతనికి ఎవ్వరూ కనబడలేదు. అతను ఆ బల్ల మీద ఉన్న మీటని నొక్కి గంట మోగించేడు.

బల్ల దిగువన కాగితాలు సర్దుకోవడంలో మునిగిపోయిన గుమస్తా తక్కున లేచి నిలబడ్డాడు. అసంకల్ప ప్రతీకార చర్యలా కాగితం, కలం ముందుకు తోసి, తల పైకెత్తి ఆగంతకుడిని చూసేడు.

"ఆఁ! మీరా! మా వసతి గృహానికి ఇంత త్వరగా తిరిగి వచ్చినందుకు మరొకసారి స్వాగతం!"

కాగితం మీద పేరు, చిరునామా, వగైరా వివరాలు రాయడానికి ఉపక్రమిస్తూన్న అతను తల పైకెత్తి ఆశ్చర్యంగా ఎదురుగా ఉన్న గుమస్తా వైపు చూసేడు.

"ఆరోగ్యంగా ఉంటున్నారా? మీ వ్యవహారాలు బాగా సాగుతున్నాయా?" గుమస్తా యాంత్రికంగా కుశల ప్రశ్నలు వేస్తున్నాడు.

"అయ్యా! మీరు పొరబడుతున్నారు. నన్ను చూసి మరెవ్వరో అనుకుంటున్నట్లున్నారు. మనిషిని పోలిన మనిషి ఉండొచ్చు. పోలిక పట్టడంలో పొరపాట్లు సహజం," అంటూ అప్పటికా సంభాషణని తుంచేస్తూన్నట్లు, తల దించి కాగితం మీద కలాన్ని నడిపిస్తున్నాడు అతను.

"అలా అంటారేంటి! మిమ్మల్ని నేను పోల్తి పట్టలేనా? రెండు నెలల క్రితమే కదా వచ్చి రెండు వారాలు ఉన్నారు. మా సిబ్బంది మీద మీరు చూపిన ఆదరాభిమానాలు మేము ఇంకా మరచిపోలేదు."

"నేను ఇంతకు పూర్వం మీ వసతి గృహానికి రాలేదని ఖచ్చితంగా చెప్పగలను. ఇక్కడికే కాదు, ఈ ఊరికి రావడమే మొదటి సారి. ఈ దేశం రావడమే మొదటి సారి. మీరు పొరపాటు పడుతున్నారు."

గంటబ్బాయిని కేకేస్తూ గుమస్తా బల్ల మీద ఉన్న గంటని రెండు సార్లు కొట్టేడు.

గంటబ్బాయి పరిగెత్తుకు వచ్చి, నేల మీద ఉన్న పెట్టె, బేడా అందుకుంటూ, "ఏమి ఆశ్చర్యం! ఇంత త్వరగా మీరు తిరిగి వస్తారనుకోలేదు," అంటూ "మీకు ఏ అవసరం ఉన్నా నన్ను అడగండి. మీ మంచి చెడ్డలు అన్నీ నేను చూసుకుంటాను."

విజయ గర్వంతో గుమస్తా అతని వైపు చూసేడు.

సామాను పట్టుకుని ఇద్దరూ గది వైపు నడుస్తూ ఉండగా గంటబ్బాయి తన ధోరణిలో తను మాట్లాడుకు పోతున్నాడు. "మీరు తిరిగి వచ్చిన తరువాత నాకు మంచి ఉద్యోగం ఇప్పిస్తానని మాటిచ్చేరు. మళ్లా వచ్చినప్పుడు గుర్తు చెయ్యమని కూడ చెప్పేరు. మీరు తిరిగి రావడం వల్ల మాకు చాల సంతోషంగా ఉంది."

"అబ్బాయ్! చూడు. నువ్వు ఎవరిని చూసి ఎవరనుకుంటున్నావో. నేను ఇంతకు పూర్వం ఈ ఊరు రాలేదు. ఇదే మొదటి సారి." ఆ మాటలు వినేసరికి గంటబ్బాయి గుటకలు మింగేడు.

"అదేంటి అయ్యా! నేను ఒక సారి చూసిన ముఖం మరిచిపోను, మీ గడ్డం దగ్గర చిన్న పుట్టుమచ్చ, మీరు నిలబడ్డ వాలకం, నడిచే తీరు, ... అన్నీ నాకు జ్ఞాపకం ఉన్నాయి. మీరు మీ భోజనపు అలవాట్లు చెపితే నేను వంట గదిలోకి వెళ్లి మీకోసం ప్రత్యేకం శాకాహారం చెయ్యమని పురమాయించేను కూడ. జ్ఞాపకం లేదా?"

గంటబ్బాయి చేతిలో కాసింత చమురు పామి పంపేసేడు అతను.

అతను వసతి గది కిటికీలోంచి బయటకి చూసేడు. విశాలమైన వృక్షవాటిక. అంతా పచ్చగా, ప్రశాంతంగా ఉంది. తల పంకించేడు. స్నానం చేసి, దుస్తులు మార్చుకుని భోజనశాల వైపు వెళ్లేడు అతను.

భోజనశాలలో అడుగు పెట్టేసరికల్లా అక్కడ ఉన్న పరిచారకులు ఒక్కుమ్మడి అతనిని చుట్టుముట్టేరు. రెండు నెలల క్రితం వచ్చినప్పుడు అతను శాకాహారం కోరిన విషయం వారికి ఇంకా బాగా జ్ఞాపకం

ఉందని చెప్పేరు. అతనికి పరిచర్యలు చేసినప్పుడు అతను వారందరికీ ఎలా కృతజ్ఞత చూపేడో వారింకా మరచిపోలేదని చెప్పుకుని అతనికి కావలసిన విధంగా వంట చేసి, సదుపాయాలు అమర్చడానికి ఎంతో తహతహలాడుతున్నామనీ వారు ఏక కంఠంతో చెప్పుకున్నారు.

అతను వారి ప్రశంశలకి స్పందించలేదు. మౌనంగా, మారు మాట్లాడకుండా మూడు ముద్దలు దిగమింగి సాలోచనగా బయటకి నడచేడు.

భోజనానంతరం బయట వరండాలో ఉన్న బెత్తు కుర్చీలో కూర్చుని, గట్టిగా గాలి పీల్చుకుని, ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ ఆనందిస్తున్నాడు. ఇంతలో ఎదురుగా ఉన్న వరండాలో, గది ముందు, ఆమె కనిపించింది.

ఆమెని ఒక క్షణం పాటు కళ్లప్పగించి చూసేడు. "ఎవరబ్బా, ఈమె? ఎక్కడ చూసినట్లు ఉందే!" అన్న ఆశ్చర్యార్థకం అతని ముఖ కళవళికలలో ద్యోతకమైంది.

ఆమె కూడ ఇతనిని మొదట క్రీగంట చూసింది. తరువాత తేరి పార చూసి, కెవుక్కున కళ్లనీళ్లు పెట్టుకుంది. అక్కడనుండి ఒక్క పరుగున తన గదిలోకి వెళ్లిపోయింది.

అసంకల్పంగానే ఆమెని అనుసరించేడు. ఆమె అలంకరణ చేసుకునే అద్దాల బల్ల పక్కని నిలబడి కంట తడి పెట్టుకుంటోంది.

అతను సంకోచిస్తూనే ఆమెని సమీపించాడు. పూర్వ పరిచయం ఉన్న వాడిలా ఆమె భుజాలు చేత్తో పట్టుకుని తన వైపు తిప్పుకున్నాడు. ఆమె అతని వక్షస్థలం మీద వాలిపోయింది. ఆమెని గుండెలకి హత్తుకుంటూ అతను గదిలో కలయచూసేడు.

అలంకరణ సామగ్రులు ఉన్న అద్దాల బల్ల మీద అతనికి ఒక ఛాయాచిత్ర పటం కనిపించింది. ఆ పటంలో అతనూ, అతని పక్కన ఆమె!

అతను సాలోచనగా గుమస్తా బల్ల దగ్గరకి వచ్చి, “నేను ఇంతకు పూర్వం ఇక్కడకి వచ్చేనని కదా మీరు అంటున్నారు? ఏదీ మీ పుస్తకంలో నేను ఎప్పుడు వచ్చేనో, ఎన్నాళ్లు ఉన్నానో నమోదు అయి ఉంటుంది కదా. అదొక సారి చూపించండి.”

గుమస్తా కాగితాలు వెతకడం మొదలుపెట్టే తరుణంలో మరొక కొత్త అతిథి రావడంతో ఆ కార్యక్రమం భంగపడింది.

2

ఆమె అతనిని సమీపించింది. “నాతో ఒకసారి రాండి,” అంటూ అతని చేతిని తన చేత పుచ్చుకుని పక్కనున్న భవనంలో ఉన్న ఒక వైద్యుడి దగ్గరకి తీసుకెళ్లి పరిచయం చేసింది.

“ఈయన రెండు నెలల క్రితం ఇక్కడకి వచ్చి రెండు వారాలు ఉండి వెళ్లేరు. ఇక్కడకి ఎప్పుడూ రాలేదని ఇప్పుడు అంటున్నారు. గతాన్ని ఎందుకు మరచిపోయేరో పరీక్ష చేసి చెబుతారనే ఆశతో తీసుకువచ్చాను.”

వైద్యుడు అతనిని సూత్రప్రాయంగా పరీక్ష చేసేడు: తాపోగ్రత, నాడి, రక్తపు పోటు, కనుబొమలలో ప్రతివర్తితలు పరీక్ష చేసి,

“అయ్యా! రెండు నెలల క్రితం మీరు ఎక్కడ ఉన్నారు?” అని అతనిని అడిగేడు.

“మా ఊళ్లో.”

“ఆ రెండు వారాలు మీరు మీ ఊళ్లో ఎక్కడ ఉన్నారో, ఏమిటి చేసేరో జ్ఞాపకం ఉందా?”

“ఆసుపత్రిలో ఉన్నాను. నాకు శస్త్ర చికిత్స చేసేరు. కోలుకుంటూన్న సమయంలో పరిస్థితి విషమించింది. గుండె అకస్మాత్తుగా ఆగిపోయింది. మళ్లా పెద్ద ప్రయత్నం మీద, నాలుగు నిమిషాల తరువాత, స్పందించేటట్లు చేసేరు. గుండే తిరిగి కొట్టుకోవడం మొదలు పెట్టింది కాని స్పృహ వచ్చినట్లే

వచ్చి, కొద్ది సేపట్లో తిరగబెట్టింది. నేను అపస్మారం వంటి కుంభనిద్రలోకి జారుకుని జీవచ్ఛవంలా అలా చావు బతుకుల మధ్య ఊగిసలాడుతూ రెండు వారాలపాటు వైద్యుల పర్యవేక్షణలో ఉండవలసి వచ్చింది.''

"ఆ రెండు వారాలు మీరు ఆసుపత్రిలోనే ఉన్నట్లు దాఖలాలు ఉన్నాయా?''

"చికిత్స పూర్తి అయి, ఆసుపత్రి నుండి విడుదల అయే తరుణంలో వైద్యులు రాసిచ్చిన కాగితం ఒకటి నా దగ్గరే ఉంది,'' అంటూ జేబులోంచి ఒక కాగితం బయటకి తీసి చూపించేడు అతను.

వైద్యుడు ఆ కాగితాన్ని పరీక్షగా చూసి, "ఇతను నిజమే చెబుతున్నాడమ్మా. మీరు తేదీలలో పొరపాటు పడలేదు కదా?''

"తేదీని నిశ్చయించడం ఎంతసేపు. ఈయన ఈ వసతి గృహంలో ఉన్నారనే కదా అంతా అంటున్నారు. గుమస్తా దగ్గర చిట్టా పుస్తకంలో ఈయన పేరు నమోదు అయి ఉందేమో చూద్దాం.'' అంటూ ఆమె గంటబ్బాయిని కేకేసింది.

"మీ ప్రయాణ పత్రాలు కాని మీ దగ్గర ఉన్నాయా?''

అతను జేబులోంచి చిన్న నీలిరంగు పుస్తకాన్ని తీసి వైద్యుడికి ఇచ్చేడు.

"ఇది సరికొత్త పుస్తకం. ఈ సంవత్సరమే, మూడు నెలల కిందటే, దఖలు పడ్డాది. దీనిలో సర్కారు వారి ముద్ర ప్రకారం ఇతను వారి దేశం వదలి నిన్న ఇక్కడకి రావడమే మొదటి విదేశీ ప్రయాణం. కనుక ఇతను మీరు చెప్పిన రెండు వారాలు వారి దేశంలోనే, ఆసుపత్రిలో, వైద్యుల సమక్షంలో, కుంభనిద్రలో, ఉన్నాడని రుజువు అవుతోంది.''

ఇంతలో వసతి గృహం నుండి గంటబ్బాయి ఒక కాగితం పట్టుకుని వచ్చేడు.

"ఈ కాగితం ప్రకారం, ఈ కాగితం మీద ఉన్న సంతకం ప్రకారం, ఈ సంతకంలో ఉన్న దస్తూరీ ప్రకారం ఈయన ఈ వసతి గృహంలో, పైన చెప్పిన రెండు వారాలు ఉన్నాడన్నది అనుమానానికి ఆస్కారం లేని విషయం.

"ఇంతకీ ఇతను ఎవ్వరో, ఇతను అక్కడ ఆ ఆసుపత్రిలోనూ, దేశాంతరంలో, ఇక్కడ ఈ వసతి గృహంలోనూ ఒకేసారి ఉండడం ఎలా సంభవమో అర్థం కావటం లేదమ్మా," అంటూ వైద్యుడు తీర్పు చెప్పేడు.

3

ఆ వసతి గృహానికి ఎదురుగా ఉన్న తోటలో, అతను ఏదో ఆలోచిస్తూ, ఏకాంతంగా తిరుగాడడం మొదలు పెట్టేడు. అవగాహనకి అందని అయోమయ పరిస్థితి అతని ముఖ కళవళికలలో ద్యోతకమవుతోంది.

"మళ్లా ఎప్పుడు వచ్చేవు, నాయనా?" నిశ్శబ్దాన్ని చీల్చుతూ, అతని ఏకాంతానికి భంగం కలిగిస్తూ, ఒక కంఠం వినిపించింది.

ఉలిక్కిపడి చుట్టూ కలయచూసేడు అతను.

చెట్ల మాటునుండి బయట పడుతూ నిలువెత్తు విగ్రహం ఎదురుగా సాక్షాత్కరించింది. తెల్లటి దుస్తులు. తెల్లటి జుత్తు. తెల్లటి పొడుగాటి గడ్డం. తెల్లటి మంచు కొండల నేపథ్యంలోంచి ఆ వ్యక్తి ఎప్పుడు, ఎలా ఊడిపడ్డాడో అతను గమనించినట్లే లేదని ఆ ఉలికిపాటు చెబుతోంది.

"ఇంతవరకు ఇక్కడ నేను ఒక్కడినే ఉన్నానని అనుకున్నాను. తపస్వి ఎదుట భగవంతుడు ప్రత్యక్షం అయినట్లు అకస్మాత్తుగా ఎక్కడనుండి ఊడిపడ్డారు మహాత్మా?"

“మహాత్ముడిని కాను. కేవలం మార్మికుడిని. సుదూరంలో ఉన్న ఆ మంచు కొండల గుహలలో నా నివాసం. ఆలోచనకి అనుకూలంగా ఉంటుందని అప్పుడప్పుడు ఈ తోటలో, ఈ చెట్ల మధ్య తిరగడానికి వస్తూ ఉంటాను.”

“మళ్లా ఎప్పుడు వచ్చేవు అని అడుగుతున్నారు. ఇంతకు పూర్వం నేను ఇక్కడ ఉండగా మీరు చూసేరా?”

“చూసేను. నా రాక వంటిదే నీ రాక కూడ. అందుకే నువ్వు నా కంట పడ్డావు.”

అతను కళ్లప్పగించి చూస్తున్నాడు. ఆ కళ్లల్లో ఒక ఆశాకిరణం మెరిసింది. కాని నర్మగర్భంగా ఉన్న మార్మికుని మాటలలోని అంతరార్థం అతనికి అర్థం అయినట్లు లేదు. ఈ విషయం మార్మికుడు గ్రహించినట్లున్నాడు.

“చూడు నాయనా, నా పరిస్థితి నీకు అర్థం అయితే నీ పరిస్థితి కూడ నీకు అర్థం అవుతుంది.”

“స్వామీ! నా పరిస్థితి అంతా అయోమయంగా ఉంది. నా పరిస్థితి నాకు అర్థం అయే మార్గం మీరు చూపించగలిగితే నాకు అంతకంటె కావలసినది ఏదీ లేదు.”

“నేను పూర్వాశ్రమంలో భౌతిక శాస్త్రం చదువుకున్నాను. కలనయంత్రాల వాడుకలో ప్రావీణ్యం సంపాదించేను. కాల్పనిక వాస్తవం అనే ఒక రకం ప్రత్యేకమైన శాఖలో బాగా కృషి చేసేను. ఈ కాల్పనిక వాస్తవ ప్రపంచంలో ఒక భౌతిక వాస్తవానికి అనేక “అవతారాలు” పుట్టించవచ్చు. ఈ సందర్భంలో “అవతారం” అనే మాటకి సాంకేతికమైన కొత్త అర్థాన్ని నేనే సృష్టించి మొదటిసారి వాడేను. ఈ సాంకేతిక పరిజ్ఞానాన్ని మార్మికతతో జోడించి దూరయానం అనే సమర్థతని సాధించాలని ప్రయత్నం చేస్తున్నాను. దూరయానం అంటే ఉన్న చోటు నుండి మరొక చోటుకి లిప్త మాత్రపు కాలంలో వెళ్ల గలిగే సమర్థత.”

"పాదాలకి పసరు పూసుకుని ప్రబంధాలలో ప్రవరాఖ్యుడు ప్రయాణం చేసేడు. ఆ కథని వినే ఉంటారు."

"ప్రవరాఖ్యుడి కథా విన్నాను, శంకరాచార్యులు చేసిన పరకాయప్రవేశం గురించీ విన్నాను. ప్రవరాఖ్యుడు పసరు ప్రభావంతో సుదూరం వెళ్లగలిగేడు; అతగాడు త్రిమితీయ భౌతిక తలంలోనే ప్రయాణించేడు తప్ప తాను ఉన్న తలాన్ని దాటి "బయటకి" వెళ్లలేదు. పరకాయప్రవేశంలో ప్రాణం భౌతిక శరీరాన్ని ఉన్న చోట వదిలేసి, అదే భౌతిక తలంలో వేరొక చోట ఉన్న మృతదేహంలోకి ప్రవేశిస్తుంది. ఇక్కడ ఒక్క ప్రాణం మాత్రం — మార్మిక తలంలో – ప్రయాణించింది. నేను ఊహించిన దూరయానం ఇటువంటిది కాదు."

"మరి మీరు చెప్పే దూరయానం ఎటువంటి ప్రక్రియ అంటారు?"

"నేను ఊహించుకుంటూన్న దూరయానానికి ఉదాహరణ చెబుతాను, విను. భూలోకంలో ఒక యోగి తపస్సు చేస్తాడు. అతనికి దేవుడు ప్రత్యక్షం అవుతాడు. ప్రత్యక్షం అవడం అంటే ఏమిటి? దేవుడు వైకుంఠాన్నో, కైలాసాన్నో వదలిపెట్టి భూలోకానికి దిగి రాడు. దేవుడులోని ఒక అంశ మాత్రం దివి నుండి భువికి దిగి వస్తుంది. ఆ అంశ భక్తుడి ఎదుట సాకారం పొందుతుంది. పని అయిన తరువాత అదృశ్యం అయిపోతుంది. అవతార పురుషులు జన్మించినప్పుడు కూడ జరిగేది ఇదే. దేవుడనే అనంతమైన శక్తి నుండి లేశమాత్రపు అంశం ఒకటి విడివడి మూర్తిత్వం చెంది సాక్షాత్కరిస్తుంది. మనకి కావలసినది ఈ రకం దూరయానం."

"మీరు చెప్పిన ఉపమానం అర్థం అయింది కాని, దీనిని ఈ అనుభవ ప్రపంచంలో సాధించడం ఎలా?"

"ఈ పద్ధతిని రకరకాలుగా ఆచరణలో పెట్టవచ్చు. నాకు తోచిన పద్ధతి చెబుతాను విను. ఈ జీవికి స్థూల శరీరం, సూక్ష్మ శరీరం అని రెండు భాగాలు ఉంటాయి అని మనం నమ్ముతాము కదా. స్థూల

శరీరం స్థావరజంగమాత్మకం. సూక్ష్మ శరీరం ఈ స్థూల శరీరానికి ఒక చైతన్య శక్తిని ఇస్తుంది. ఈ స్థూల శరీరాన్నే మనం "కట్టె" అనిన్నీ, సూక్ష్మ శరీరాన్ని "ప్రాణం" అనిన్నీ అంటాం."

మార్మికుడు చెప్పే మాటలు ఎక్కడో అఘమేఘాల మీద కాకుండా నేల మట్టంగా సాగి అర్థం అవుతోండడం వల్ల కాబోలు అతను తల పంకించి వింటూ ఉత్సాహభరితంగా ఊకొడుతున్నాడు.

"భగవానుడు భూలోకం మీద అవతరించినప్పుడు అనంతమైన ఆ భగవత్స్వరూపం నుండి కేవలం ఒక అంశ భువి నుండి భూమి మీదకి దిగి వస్తుందని చెప్పుకున్నాం కదా? అదే నమూనా ప్రకారం ఒక వ్యక్తి నుండి ఒక అంశని విడదీసి దానితో ఆ వ్యక్తి అవతారాన్ని సృష్టించవచ్చు. మనం అనుకుంటూన్న పని సక్రమంగా జరగాలంటే ఇలా విడదీసిన అంశకి కూడ ఒక స్థూల శరీరం, ఒక సూక్ష్మ శరీరం ఉండాలి అని గుర్తు పెట్టుకో."

"కంటికి కనిపించని సూక్ష్మ శరీరంతో అవతారం నిర్మిస్తే దానికి మూర్తిత్వం ఎలా వస్తుంది? మీరు సృష్టించిన అవతారం కంటికి కనబడాలంటే దానికి స్థూల శరీరం కూడ ఉండాలి కదా?"

"అదే నేను చెబుతూన్నది! అవతరించిన శాల్తీకి మూర్తిత్వం రావాలంటే జనక స్థానంలో ఉన్న భౌతిక కాయంలో కూడ కొంత భాగం ప్రయాణించి గమ్య స్థానం చేరుకోవాలి. ఇక్కడే నేను సాధించిన మార్మిక రహశ్యం ఉంది."

"రహశ్యం అంటున్నారు కనుక వివరాలు చెప్పమని అడగడం సముచితం కాదు. కాని ఒక అనుమానం నివృత్తి చేసుకోవాలి. సూక్ష్మ శరీరంలో ఒక అంశ, స్థూల శరీరంలో ఒక అంశ జనక స్థానంలో ఉండిపోతాయి కదా? వాటి మాట ఏమిటి?"

"దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చెయ్యడానికి దేవుడు భూమి మీద అవతరించినప్పుడు ఒక అంశని దేవేరి దగ్గర ఉంచినట్లే ఇక్కడ కూడా జరుగుతోందని ఊహించుకోవడంలో తప్పు లేదు. గమ్యస్థానం చేరుకున్న పాక్షిక అంశలకి పరిపూర్ణ అస్తిత్వం ఉండదు; పాక్షిక అస్తిత్వం మాత్రమే ఉంటుంది. కనుక

మూర్తిత్వం కూడ పాక్షికంగానే ఉంటుంది. అంటే అస్థిత్వ వాస్తవం కొంత, కాల్పనిక వాస్తవం కొంత ఉంటాయన్నమాట. పాక్షికంగానైనా సరే రెండూ ఉన్నాయి కనుక గమ్యస్థానం చేరుకున్న మూర్తి కూడ చైతన్య మూర్తే – నా లాగ! నీ లాగ!"

"అంటే, మీరనేది, మీరనేది… నా ఎదురుగా ఉన్న, నేను చూస్తూన్న, మూర్తిత్వంలో అస్తిత్వ వాస్తవం కొంత, కాల్పనిక వాస్తవం కొంత…."

"….అవును. నాయనా. జనక స్థానంలో, అంటే ఆ కొండ గుహలో, నా భౌతిక శరీరంలో కొంత భాగం, నా  చైతన్య శక్తిలో కొంత భాగం,  కొన ఊపిరితో, కుంభనిద్రలో, సురక్షితంగా ఉన్నాయి."

"నేను నా ఎదురుగా చూస్తూన్న ఈ అస్తిత్వం భౌతిక తలంలోనా లేక…"

"ఇంకా సందేహం తీరలేదా? కొండ గుహలో, కుంభనిద్రలో ఉన్న శాల్తీ యొక్క అస్తిత్వం భౌతిక తలంలోనే. కాని దూరయానం చేసి వచ్చిన, నువ్వు చూస్తూన్న, మూర్తిత్వం భౌతిక తలంలో లేదు. ఇది భౌతిక తలం కాదు. ఇది మరొక తలం. ఇదొక కాల్పనిక వాస్తవం. భౌతిక తలంలో ఉన్న వారు ఈ కాల్పనిక తలాన్ని వారి జ్ఞానేంద్రియాలతో స్పృశించలేరు. ఈ తలంలో ఉన్నంత సేపు మనం కూడ ఆ భౌతిక తలాన్ని స్పృశించలేము."

"మరి జనక స్థానంలో దిగవిడచి వచ్చిన భౌతిక భాగం సంగతి?"

"అది కొన ఊపిరితో, శరీరం మీద స్మారకం లేకుండా, దరిదాపు మృతప్రాయంగా పడి ఉంటుంది. దూరయానానికి వెళ్లిన భాగం తిరిగి వెనక్కి వెళితే ఆ వ్యక్తికి స్పృహ వచ్చి కోలుకునే అవకాశం ఉంది. అందుకనే కొన ఊపిరితో కుంభనిద్రలో ఉన్న వారికి మరణం తథ్యం అనే భ్రమతో తొందరపడి అంతిమ సంస్కారాలు చెయ్యకూడదు.____. ఆఁ, నా సమయం మించిపోతోంది. నేను వెళ్లాలి. నేను లేస్తాను," అంటూ మార్మికుడు లేచి వెళుతూ ఉంటే ఆ తెల్లటి ఆకారం తోటలో దట్టంగా ఆవరిస్తూన్న పొగ మంచులో కలిసి కరిగిపోయింది.

## 4

"నేను లేస్తాను. నేను లేస్తాను……."

ఎదురుగా తెల్లటి దుస్తులలో ఒక ఆకారం ఇంకా మసకగా కనబడుతూనే ఉంది. ఆ ఆకారం అతని మీదకి వంగి చేతిలో ఉన్న దీపాన్ని కంటి ముందు కదుపుతోంది.

అతను కళ్లు తెరచేడు. ఎదురుగా అమ్మా, నాన్నా! వారి పక్కనే ఉబికి వస్తూన్న కన్నీటిని ఆపుకుంటూ..

ఆమె!

గదంతా దీపాల దీప్తితో నిండిపోయింది.

**కథ వెనుక కథ**

వంగూరి ఫౌండేషన్ అఫ్ అమెరికా వారు నిర్వహించిన పోటీలో 116 డాలర్లు గెలుచుకున్న కథ ఇది.

# సభ్యోక్తులు – సరసోక్తులు

## 1

మనం మాట్లాడే భాష, రాసే భాష మన సభ్యతకి, సంస్కృతికి అద్దం పడుతుంది. మనం తెలివైనవాళ్లం కావచ్చు, మంచివాళ్లం కావచ్చు, కాని మన భాష సాధుసమ్మతం కాకపోతే అది మన వ్యక్తిత్వానికి, శీలానికి ఒక వెలితిగా మిగిలిపోతుంది. సమాజంలో గౌరవం పొందడానికి మనం ధరించే దుస్తులు ఎంత ముఖ్యమో మనం మాట్లాడే భాష కూడా అంటే ముఖ్యం.

అసలు సాధుసమ్మతమైన భాష గురించి ఆలోచించవలసిన అవసరం ఎందుకు వచ్చిందో ముందుగా చెప్పనివ్వండి. నాకు తీరుబడి దొరికినప్పుడల్లా వైజ్ఞానిక వ్యాసాలు రాస్తూ ఉంటానని చదువరులలో చాలమందికి తెలుసు. ఇప్పటివరకు కలనయంత్రాలు, జీవ రసాయనశాస్త్రం, కర్బన రసాయనశాస్త్రం, రక్తశాస్త్రం, విశ్వశాస్త్రం, వగైరాలు ఎంపిక చేసుకున్నాను తప్ప ఇబ్బంది కరమైన విషయాలని ఎత్తుకోలేదు.  నా బావమరిది మూత్రపిండాల రోగాల మీద ప్రావీణ్యుడు కావున వాటి గురించి నలుగురికీ అర్థం అయే భాషలో రాయమని అడిగేడు. ప్రవీణుడు పక్కన ఉన్నాడు కదా అని పని ప్రారంభించేను. ఆదిలోనే హంసపాదు!

మొదటగా పిండాలు అన్న పేరు నాకు నచ్చలేదు. నా పిండాకూడు కాకపోతే పిండాలేమిటి? చచ్చిపోయినవాళ్లకి పిండాలు కాని బతికున్నవాళ్లకి పిండాలేమిటి? మూత్రం అన్న  మాట నా రాణీ గారికి నచ్చలేదు. ఆమె గారికి శరీరం నుండి బహిష్కరించబడే పదార్థాల పేర్లు కాని, ఆ బహిష్కరించే అవయవాల పేర్లు కాని చెబితే చాలు "వామిట్" (కక్కు అన్న మాట ఆమె చెవిన పడకూడదు) చేసుకుంటుంది. అందుకని మూత్రపిండాలకి మరొక పేరు వెతకటం మొదలుపెట్టేను. నా రాణికి నచ్చితే సాధుసమ్మతం అనుకోవచ్చు.

సాధుసమ్మతం అంటే ఏమిటి? ఏ మాట, ఏ పదబంధం సాధుసమ్మతమో నిర్ణయించటం తేలికేమో కాని నిర్వచించటం కష్టం. అందుకనే సినిమాలని సెన్సారు చేసే వారు “ఆ బూతు బొమ్మలని మేము చూసిన తరువాత మీరు చూడకుండా కత్తిరించెస్తాం” అంటారు.

సినిమాలలోను, దేవాలయాల గోడల మీద ఉన్న శిల్పాలలోను కనిపించే బూతు బొమ్మల సంగతి మరొక సందర్భంలో చూద్దాం. ఇప్పుడు, ఇక్కడ, రాసే భాష గురించి, మాట్లాడే భాష గురించి, వాటిలో ఏది “శ్లీలమో” , ఏది అశ్లీలమో నిర్ణయించటంలోని కష్టసుఖాల గురించీ మాట్లాడుకుందాం.

మాట్లాడే మాట అశ్లీలం అయినా, శ్లేష వల్ల అశ్లీలార్థం స్ఫురించినా, నైచ్యార్థం ధ్వనించినా, నాజూకుగా లేదనిపించినా, అశుభం అనిపించినా ఒక మాటకి బదులు మరొక మాటని వాడటం జరుగుతూ ఉంటుంది. “బియ్యం నిండుకున్నాయి,” “దీపం ఘనం అయింది,” “స్వర్గస్తులయారు,” “అరున్నొక్కటి,” మొదలైన ప్రయోగాలు తెలుగులో కొల్లలు. ఈ రకం ప్రయోగాన్ని ఇంగ్లీషులో “యూఫిమిజం” అంటారు. వీటిని మనం తెలుగులో సభ్యోక్తులు, సరసోక్తులు, చతురోక్తులు వగైరా పేర్లతో సందర్భానుసారంగా పిలవచ్చు.

అశ్లీలం అన్న మాటకి నిర్వచనం ఏమిటి? ఏ భాషలోనైనా సరే రతి క్రియని వర్ణించే కొన్ని మాటలు, ఆ క్రియలో పాల్గొనే శరీర అవయవాల పేర్లు పచ్చి బూతులు (raw porno). తెలుగువారికి సంబంధించినంత వరకు, ఈ కోవకి చెందిన ఏ మాటలైనా సరే వాటిని తెలుగులో అన్నంతసేపే అభ్యంతరం; ఇవే మాటలని సంస్కృతంలో కాని, ఇంగ్లీషులో కాని అంటే పరవా లేదు; అప్పుడవి పండు బూతులు (ripe porno?). ఉదాహరణకి మన గ్రంథాలలో నాయికని వర్ణించినప్పుడు ముక్కు సంపెంగపువ్వు, కళ్లు కలువ రేకులు, ముఖం చంద్రబింబం అనేసి ఊరుకోకుండా చన్నులు, పిరుదులు, తొడలు, ఇలా నఖశిఖపర్యంతం సంస్కృత సమాసాలు గుప్పించి వర్ణించెస్తారు. అప్పుడు అది అశ్లీలం కాదు.

అమెరికాలో, సందర్భోచితం అయినప్పుడు, "పీనిస్, వెజైనా, ఇంటర్ కోర్స్" అన్న ఇంగ్లీషు మాటలు – ఆడ, మగ కలసి ఉన్న సమావేశాలలో కూడ – నిరభ్యంతరంగా వాడటం నేను గమనించేను (చూడండి, ఇక్కడ నేను ధైర్యంగా ఎలా వాడేనో!). అమెరికాలో "సెక్స్ ఎడ్యుకేషన్" అన్న నెపంతో ప్రాథమిక పాఠశాలలో గురువులు ఈ మాటలని పిల్లల ఎదుట నిర్మొహమాటంగా వాడుతున్నారు. వీటికి సమానార్థకాలైన తెలుగు మాటలని వైద్యుడి దగ్గర కూడ వాడటానికి జంకుతాం. ఈ "నాలుగక్షరాల" ఇంగ్లీషు మాటలకి సమానార్ధకాలైనవి, సాధుసమ్మతం కానివి, బహిష్కరించబడ్డవి, అయిన "రెండు అక్షరాల" తెలుగు మాటలు లేదా "బజారు మాటలు" ఉన్నాయి. వీటిని ఇంగ్లీషులో "టేబూ" అనిన్నీ, తెలుగులో "బూతు" అనిన్నీ వాడటానికి భయపడతాం. కాని ఇంగ్లీషు సినిమాలలో ఈ నాలుగక్షరాల మాటలు వినిపిస్తూనే ఉంటాయి. ఇంగ్లీషు నవలలో కనిపిస్తూనే ఉంటాయి. ఈ జాతికి చెందిన మాటలు, చేష్టలు లేకపోతే పుస్తకాలు అమ్ముడుపోవు, ప్రజలు సినిమాలు చూడరు అనే "పోహ" (అపోహ కానిది) ఒకటి ఉంది.

మంచో, చెడో తెలుగు వాళ్లు ఇంకా బరితెగించిపోలేదు. నిఘంటువులలో ఇటువంటి మాటలు సర్వసాధారణంగా కనబడవు. అందుకనే కాబోలు నిజంగా అవసరం వచ్చినప్పుడు తెలుగు నిఘంటువుని సంప్రదిస్తే మనకి "గే, లెస్ బియన్, పెడోఫైల్" వంటి అవసరమైన మాటలు కూడ కనబడవు. మరొక "తుంటరులు" ఎవరో ఈ మాటలు వాడేరని రాతలో చెప్పదలుచుకున్నప్పుడు @$%& అని రాస్తారు. టి. వి. ప్రసారాలలో ఇటువంటి మాటలు వచ్చినప్పుడు వాటిని కత్తిరించి అక్కడ "బ్లీప్" శబ్దం ప్రవేశపెడతారు. పిల్లలు చూసే, వినే కార్యక్రమాలలో అశ్లీలాలు దొర్ల కూడదనే సదుద్దేశంతో ప్రసారకులు పాటించే బాధ్యతాయుతమైన పౌరసత్వ ప్రవర్తన ఇది.

నా చిన్నతనంలో రేడియోలు, టి. వి లు లేవు. కనుక "బ్లీపు" లు కూడా ఉండేవి కావు. పైపెచ్చు నేను పెరిగిన వాతావరణం, తిరిగిన ప్రాంతం ప్రభావం వల్ల కాబోలు ఇల్లు దాటి బయటకి వచ్చినప్పటినుండి మళ్లా ఇంట్లో అడుగు పెట్టేవరకు "బ్లీపులు లేని బజారు భాష" అలా వినిపిస్తూనే

ఉండేది. నేను వినే మాటలలో ఏవి ఇంట్లో అనదగ్గవో, ఏవి కావో ఎవ్వరూ చెప్పకుండానే, బ్లీపులు లేకుండానే, నాకు తెలిసిపోయేవి. తెలిసో తెలియకో “చెడ్డ” మాట నోటి వెంట వస్తే ఆ మాట మళ్లా అనకూడదని ఇంట్లో చెప్పేవారు.

2

భాష సజీవమైన పాత్రల నోటి వెంట పలికించాలని రచయితలకి ఉంటుంది. నేను ఇంతవరకు రాసిన కథలలో ఎక్కడా నాటు భాష వాడవలసిన అవసరం రాలేదు. కాని అశ్లీలం (బూతు) లేకపోయినంత మాత్రాన భాష సాధుసమ్మతం అవాలని లేదు కదా.

అప్పుడప్పుడు ఫలానా మాట భయపడకుండా వాడొచ్చా, రాయొచ్చా అని అనుమానం వస్తూ ఉంటుంది నాకు. ఈ మధ్య “భయం” అనే కథ రాసేను. అందులో అలాస్కాలో బయట ఎంత చలిగా ఉందో చెప్పటానికి “ముందుగా జాగ్రత్త పడకపోతే కాలకృత్యాలు తీర్చుకుందుకి కూర్చున్న కుర్చీపీటకి ముడ్డి అతుక్కుపోయే ప్రమాదం ఉంది” అని రాసేను. అది చదివి, నా కంటె వయస్సులో బాగా చిన్నవాడైన ఒక విద్యార్థి, “నన్ను మరీ విక్టోరియన్ అనుకోకుండా “ఈ” మాట తీసేసి దీనికి బదులు ఇంగ్లీషు మాటో సంస్కృతం మాటో వాడండి” అంటూ ఒక సలహా ఇచ్చేడు. శరీరంలో ఒక భాగం (అదీ జననాంగం కాదు) పేరు తెలుగులో వాడితే ఒక కుర్రాడు అలా అభ్యంతరం చెప్పేసరికి చకితుణ్ణయేను. “మూతి, ముడ్డి” తెలుగు మాటలు. వీటిని వాడటానికి ఎందుకు అభ్యంతరం చెప్మా అని మథన పడి నాకు తెలిసిన ఇద్దరు రచయితలని సంప్రదించటానికి పిలచేను. ఒకాయన – ఆయన ధోరణి ఆయనది – నా గోడవ పట్టించుకోకుండా మరొక విషయం ఏదో మాట్లాడుతూ, “మన వాళ్లకి ముడ్డి బద్ధకం అండీ” అన్నాడు. నా ఉల్లము ఝుల్లున పొంగింది. రెండవ రచయిత, నా అలాస్కా కథ లోని వాక్యాన్ని తీసుకుని, “....నా ఆసనం ఆ ఆసనానికి అతుక్కుపోయే ప్రమాదం ఉంది” అని మార్చమని సలహా ఇచ్చేడు. ఒక ఓటు ఇటు, ఒక ఓటు అటు పడేసరికి ఇది ఎటూ తేలకుండా తుని తగవులా తేలింది. ఈ మధ్య బ్రహ్మశ్రీ వద్దిపర్తి పద్మాకర్ గారు మహాభారత ప్రవచనం చెబుతూ “అపానం” అంటే కింది

భాగం" అని చెప్పేసరికి "అపాన వాయువు" అనే ప్రయోగం గుర్తుకి వచ్చింది. కనుక నా "భయం " కథలోని వాక్యాన్ని "ముందుగా జాగ్రత్త పడకపోతే కాలకృత్యాలు తీర్చుకుందుకి కూర్చున్న కుర్చీపీటకి అపానం అతుక్కుపోయే ప్రమాదం ఉంది" అని రాస్తే ప్రాస కూడ కుదురుతుంది కదా అనిపించింది.

నా పరిశోధన పూర్తి అయింది. ఇక మూత్రపిండాల గురించి రాయటమే తరవాయి. ఉచ్చని ఉచ్చ అనాలా? మూత్రం అనాలా? యూరిన్ అనాలా? ఏది సాధు సమ్మతంగా ఉంటుంది? ఏది అందరికీ సులభంగా అర్థం అవుతుంది? "ఇక్కడ ఉచ్చలు పోయరాదు!" అనే ఫలకం చాల చోట్ల కనిపిస్తుంది కనుక "ఉచ్చ అన్న మాట వాడెయ్యండి" అని ధైర్యం చెప్పేడు – శీర్షాసనం భంగిమలో ఉన్న ఇందాకటి రెండవ రచయిత. చేతిలో సుత్తి ఉన్నవాడికి అన్నీ మేకులలాగే కనిపిస్తాయిట. అలా, ఆసనాల భంగిమలో ఉన్న ఈయనకి అన్నీ "ఆసనాలు" లాగే కనిపిస్తాయి కాబోలు! ఈ తిరకాసు సలహా వినగానే "ఎమితిని సెపితివి కపితము, ఉమెతపువు తిని సెపితివా?" అన్న పద్యం జ్ఞాపకం వచ్చింది. చెప్పటం తేలికే, తరువాత చివాట్లు నేను తినాలి కదా!

వైద్యశాస్త్రం గురించి రాసేటప్పుడు ఒక్క ఉచ్చతో పని తెములుతుందా? ఒకటికి వెళతాం. రెంటికి వెళతాం. ఒకటిని ధైర్యంగా ఉచ్చ అన్నప్పుడు రెంటిని ధైర్యంగా ఏమనాలి? తెలుగులో అయితే విశేషణం రూపంలో "పీతి కుక్క, పీతి గద్ద" అనే ప్రయోగాలు వాడినంత తేలికగా నామవాచకం రూపంలో "ప కి గుడి, య కింద య కి కొమ్ము" ని వాడటానికి మొహమాటం వేస్తోంది. ఇంగ్లీషులో అయితే గమ్మున జ్ఞాపకం వచ్చే మాటలు "స్టూల్, ఫీసీస్" . ఇన్నేళ్లు ముడ్డి కిందకి వచ్చినా సురేంద్రుడు చెప్పేవరకు "స్టూల్" అన్న మాట ఇంగ్లీషులోకి ఎలా వచ్చిందో నాకు తెలియలేదు. నేను అలాస్కాలో కూర్చుందుకి వాడిన కుర్చీపీటని ఇంగ్లీషులో "స్టూల్" అంటారు కదా. అశుద్ధాన్ని తెలుగులో చెప్పటానికి నోరు రాక మనం బాధ పడుతూన్నట్లే ఇంగ్లీషువాడికి కూడ "ఫీసీస్" అనటానికి నోరు రాలేదుట. అందుకని, "అది" కుర్చీ లాంటి ఆసనం మీద కూర్చుని చేసే పని బాపతు కనుక "దానిని"

– మరేమిటనుకున్నారు – "కుర్చీ" అన్నాడుట. ఆహాః – అదేలెండి, ఇంగ్లీషులో సమానార్థకమైన – "స్టూల్" అన్నాడుట.

ఏడాదికొకసారి "స్టూల్ సేంపిల్" పంపమని మా డాక్టరు అడుగుతూ ఉంటాడు. కాని "స్టూల్" అన్న మాటంటే మా రాణికి అసహ్యం. అందుకని "కుర్చీని బాత్ రూం లో కౌంటర్ మీద వదిలేశారు, అసహ్యంగా. అది మెయిల్ చేసేసి ఆ చేతులు రెండూ సోప్ తో వాష్ చేసుకొండి" అంటూ గదమాయించింది. కుర్చీని కౌంటరు మీద ఉంచటం ఏమిటి? కుర్చీని టపా ఎలా చెయ్యాలి అని ఆలోచిస్తూ ఉంటే అసలు విషయం అర్థం అయింది.

"కుర్చీ" అంటే మా రాణీకి ఎంత అసహ్యమో మా పెద్దమ్మాయి పుట్టినప్పుడు అర్థం అయింది. పిల్లలు పృష్ఠ భాగాన్ని శుభ్రంగా ఉంచినంతసేపూ మూతి దగ్గర ముద్దొస్తారు. అంతవరకు పిల్లదానితో ఆడేసుకుని డయపరు పాడవగానే, "పిల్ల దొడ్డికి వెళ్లింది, కడుగుతావా?" అని ఒక అరుపు అరిచి థీసిస్ రాసుకునే పనిలో నిమగ్నమయిపోయినట్లు నటించేవాడిని.

"ఏమిటా నాటు భాష? నా కసలే అసహ్యం. కొంచెం ఇంగ్లీషులో బవెల్ మూవ్మెంట్ అందురూ" అని బ్రతిమిలాడింది.

నగలు అడగలేదు, చీరలు అడగలేదు, మడులూ, మాన్యాలు అడగలేదు. ఇంగ్లీషులో మాట మాట్లాడమంది. ఇంగ్లీషులో అన్నా, తెలుగులో అన్నా, తమిళంలో అన్నా అవన్నీ చచ్చినట్లు తనే కడగాలి కదా.

మూడ్రోజులు పోయేసరికి "బవెల్ మూవ్మెంట్" అన్న పేరు వినేసరికి వాంతి చేసుకున్నంత పని చేసింది. కడిగేసి కూతురుని ముద్దులాడేసేది.

మరీ వివరంగా "బవెల్ మూవ్మెంట్" అని ఇంగ్లీషులో అన్నా బాగులేదని పొడి అక్షరాలుతో దానికి "బి. ఎం." అని పేరు పెట్టేం.

మా పిల్లలకి నోరు తిరగక దానిని “బీమా” అని పిలచేవారు.

ఇప్పుడు భోజనాలవేళప్పుడు “ఇన్సురెన్స్” వ్యవహారాలు మాట్లాడవలసి వస్తే ఇంగ్లీషులోనే మాట్లాడుకోవాలి.

తెలుగు పతనానికి ఇదండి కారణం!

తెలుగుని ఒక ఆధునిక భాషగా పునరుద్ధరించాలంటే తెలుగులో మాటలన్నిటిని తీసేసి వాటి స్థానాలలో ఇంగ్లీషు మాటలు జొప్పించాలి. ఆ పని నా చేతులతో నేను చెయ్యలేను. అందుకని మధ్యేమార్గంగా మూత్రపిండాలకి మూపీలు అని కొత్త పేరు పెట్టేను.

సమాప్తం

# ప్లూటో గ్రహచారం

అక్టోబర్ , 2014. తెల్లారి లేచి పత్రిక విప్పి చూద్దును కదా! పాతిపెట్టేసిన ప్లూటో ప్రాణం పుంజుకుని పైకి లేవడానికి ప్రయత్నిస్తోంది. అదీ వార్త! మొన్న కాక మొన్న, అనగా 2006 లో, ప్లూటోని "నీ గ్రహచారం బాగోలేదు. నువ్వు గ్రహానివి కావు, ఫో" అని కసిరికొట్టి, పొమ్మన్నారు "ఇంటర్నేషనల్ ఎస్ట్రనామికల్ యూనియన్" వారు. పిల్లల పుస్తకాలలోంచి ప్లూటోని పీకి పారేసేరు. ఇంక ప్లూటో గురించి ఎవరు చదువుతారులే అని నేను ఆరేళ్ల క్రితం రాసిన ఈ దిగువ వ్యాసాన్ని చుట్ట చుట్టి, కట్ట కట్టి అటక మీద పారేసేను (తెలుగులో చెప్పాలంటే, "కంప్రెస్ చేసి ఆర్కైవ్స్ లో పడేసేను.)

పట్టుమని పదేళ్లు తిరగకుండా, "పీలగా ఉన్నా, పొట్టిగా ఉన్నా, నువ్వు గ్రహానివి కాదనడానికి వారెవరు " అని హార్వర్డ్ స్మిత్సోనియన్ సెంటర్ తిరిగి ప్లూటోని "గ్రహాల జాబితాలో వేస్తాం, రా!" అని పిలుస్తున్నారుట. ఇది వార్త కాదూ మరి? కట్ట కట్టిన చుట్టని విప్పి, దుమ్ము దులిపేను.

ఈ గొడవ అంతా ఎలా మొదలయిందంటే…….

1

ప్లూటో అంటే పడి చస్తాను నేను. సూర్యుడి చుట్టూ తిరిగే రకరకాల శాల్తీల పేర్లలో నాకు ప్లూటో అన్న పేరు ఎంతో ఇష్టం. ప్లూటో పేరు వినగానే సపోటాపండు గుర్తుకొస్తుంది నాకు. కార్టూను సినిమాలలో వచ్చే కుక్క ప్లూటో అన్నా నాకు ఇష్టమే.

ప్లూటో గ్రహచారం బాగు లేదు. దాని జాతకంలో ఏలినాటి శని ఉందో, కుజ దోషం ఉందో, భూదోషం ఉందో తెలియదు కాని కష్టాలు పడ్డాది. రాజపూజ్యాలు రెండు, అవమానాలు ఆరు.

ప్లూటో కష్టాలు నేను ఆర్చేవాడినీ కాదు, తీర్చే వాడినీ కాదు. ప్రపంచం అంతా కట్టకట్టుకుని ఎదురు తిరిగితే ఏటికి ఎదురీదకలనా?

ఎవ్వరి కంటా పడకుండా, ఎక్కడో వినువీధులలో తన మానాన తను తిరుగాడుతూ ఉంటే ఉచ్చు వేసి పట్టుకున్నారు. పట్టుకుని కనకపు సింహాసనం మీద కూర్చోబెట్టి పట్టం కట్టేరు. పెట్టి, కట్టి, ఇప్పుడు కుక్కని కొట్టినట్లు కొట్టి సింహాసనం నుండి దింపి, "కార్టూను బొమ్మలలో కుక్క బతుకులాంటి బతుకు చాలు" , అన్నారు. ఆకాశం నుండి, శంభుని శిరస్సు నుండి, శీతాద్రిశుశ్లోకంబైన హిమాద్రి నుండి పవనాంధోలోకముం జేరె అన్నట్లు ఉంది నా ప్లూటో పతనం!

అయ్యో ప్లూటో పతనానికి కారణం ఇప్పటిది కాదు; పుట్టినప్పుడే దానికి అలా రాసి పెట్టి ఉంది.

సా. శ. 1781 లో శని గ్రహానికి అవతల మరో గ్రహం ఉందని విలియం హెర్షెల్ (William Herschell) కనుక్కున్నప్పుడు వార్తాపత్రికలలో అదొక పతాక శీర్షిక అయిపోయింది.

అంతవరకు ఖగోళశాస్త్ర వేత్తలకి తెలిసిన గ్రహాలు ఆరు మాత్రమే: బుధ, శుక్ర, భూ, కుజ, గురు, శని గ్రహాలు.

జాతకాలు రాసే జ్యోతిష శాస్త్రజ్ఞులు తొమ్మిది గ్రహాలు లెక్క పెడతారు. అవేమో బుధుడు, శుక్రుడు, కుజుడు, గురుడు, శని మాత్రమే కాకుండా సూర్యుడు, చంద్రుడు, రాహువు, కేతువు కూడ గ్రహాలే. ఈ లెక్కలో భూమి గ్రహం కాదు. ఏ అస్తిత్వం లేని రాహు కేతువులు గ్రహాలు. వీరి లెక్కలో సూర్యుడు (రవి) కూడా ఒక గ్రహమే! మన ఉపగ్రహమైన చంద్రుడూ ఒక గ్రహమే.

మనం ఇక్కడ విచారించేది ఖగోళశాస్త్రం దృష్టితో కనుక ఇటుపైన జ్యోతిష శాస్త్ర ప్రస్తావన తీసుకురావలసిన అవసరం లేదు. హెర్షెల్ కొత్తగా కనుక్కున్న గ్రహానికి యూరెనస్ (యురేనస్ కాదు, దీర్ఘం 'యు' మీద, 'ర' మీద కాదు అని కార్ల్ సేగన్ పదే పదే చెప్పేవాడు) అని పేరు పెట్టేరు.

దీనికి మనవాళ్లు వరుణుడు అని పేరు పెట్టేరు.

ఈ వరుణుడి గ్రహపాటు బాగులేక కాబోలు ఈయనకి జాతక చక్రంలో చోటు దొరకలేదు.

యూరెనస్ ఉనికి మనకి తెలియని రోజులలో, భూమి మీద ఉన్న మనకి  మన ఆకాశంలో కదలాడుతూ కనబడే నభోమూర్తులు ఎనిమిది. అవి పైన చెప్పిన ఆరు గ్రహాలతో పాటు సూర్యుడు (రవి), చంద్రుడు, వెరసి మొత్తం ఎనిమిది.

2

ఇంగ్లీషులోను, తెలుగులోను కూడ మన వారాల పేర్లు ఈ గ్రహాల పేర్లని అనుసరించే ఉంటాయి. రవివారం (సన్–డే, Sun–day), సోమవారం (మూన్–డే, Moon–day), బుధవారం, గురు వారం, శనివారం (శాటర్–డే, Satur–day), అన్న పేర్లలో ఈ పోలిక కొట్టొచ్చినట్లు కనబడుతుంది.

తెలుగులో కుజవారం లేదు. ఇంగ్లీషులో "ట్యూజ్ డే" (Tuesday) అన్నది కుజుడి పేరే. రోమకుల దేవగణాలలో "మార్స్" (Mars) లేదా కుజుడు కి ఉన్న స్థానమే జెర్మనీ వారి దేవగణాలలో "టివ్" (Tiw) ఆక్రమిస్తాడు కనుక "టివ్ స్  డే" (Tiw's day) లేదా "ట్యూస్ డే" (Tuesday) అన్న పేరు కుజుడి పేరే. కుజుడికి మరొక పేరు మంగళుడు కనుక అందులోంచి మన మంగళవారం వచ్చింది.  తెలుగులోని శుక్రవారం ఇంగ్లీషులో ఉన్న "ఫ్రైడే" (Friday) కి సరిసమానం. శుక్ర గ్రహం అన్నా "వీనస్" (Venus) గ్రహం అన్నా ఒకటే. (కాని, శుక్రుడు అన్నా వీనస్ అన్నా ఒకే దేవత కాదు!).  పాశ్చాత్య దేశాలలో వీనస్ (Venus) ప్రేమకి చిహ్నం. నార్వే వంటి దేశాలలో ప్రేమ దేవుడి పేరు "ఫ్రిగ్గా" (Frigga); ఇందులోంచే "ఫ్రైడే" (Friday) వచ్చింది.

ఈ గొడవంతా ఎందుకు కాని, పూర్వం, ఖగోళశాస్త్రం పరిధిలో "గ్రహాలు ఎన్ని?" అని ఎవ్వరిని అడిగినా ఠకీమని "ఆరు" అని నిర్మొహమాటంగా సమాధానం వచ్చేది. ఎందుకంటే హెర్షెల్ కాలం వరకు సూర్యుడి చుట్టూ తిరుగుతూ ఆరే ఆరు గ్రహాలు కంటికి కనిపించేవి. మన దృష్టికి ఆనసంత దూరంలో మరో గ్రహం ఉందని చెప్పేసరికి అదొక నమ్మశక్యం కాని నిజం అయి కూర్చుంది.

ఆరుకి ఏమీ ప్రత్యేకత, పవిత్రత లేదని తెలిసిన తరువాత ఏడుకి మాత్రం ఎందుకు? అందుకని యూరెనస్ అవతల మరో గ్రహం ఉండొచ్చేమో అని అనుమానం వచ్చింది. ఆకాశంలో దుర్భిణితో వెతుకుతూ ఉంటే, సా. శ. 1801 జనవరి ఒకటో తేదీన, మరొక నభోమూర్తి కనిపించింది – కుజ గ్రహానికి, గురు గ్రహానికి మధ్య ఉన్న జాగా లో! దానికి సీరీస్ (Ceres) అని పేరు పెట్టేరు. మరి కొద్ది సంవత్సరాలలో సీరీస్ పేరు పాఠ్య పుస్తకాలలో నమోదు అయిపోయింది. అంతే కాదు. మరో రెండేళ్లల్లో ఒక కొత్త రసాయన మూలకం ఉనికి కనుక్కున్నప్పుడు, తర్జనభర్జనలు లేకుండా ఆ మూలకానికి, సీరీస్ గౌరవార్థం సీరియం (Cerium) అని పేరు పెట్టేసేరు. రాజయోగం అంటే అలా ఉంటుంది.

సీరీస్ని కనుక్కున తరువాత సంవత్సరంలో మరొక "గ్రహం" కనబడింది. ఈ తొమ్మిదో గ్రహానికి పల్లాస్ (Pallas) అని పేరు పెట్టేరు. సా. శ. 1803 లో మరొక కొత్త రసాయన మూలకం కనుగొన్నప్పుడు దానికి – ఇంకా ఆలోచన ఎందుకు – పల్లాస్ గౌరవార్థం పెల్లేడియం (Palladium) అని పేరు పెట్టేసేరు.

ఈ పల్లాస్ వెలిసిన వేళా విశేషం ఏమిటో కాని, "మారకం" తో పుట్టినట్లుంది. పైపెచ్చు దీని "గ్రహచార దోషం" వల్ల సీరీస్కి కూడా మారకం తీసుకొచ్చింది. ఇదెలాగో చెబుతాను.

ఇంతవరకు గ్రహాలు, వాటి లక్షణాలు ఒక బాణీ ప్రకారం ఉంటూ వచ్చేయి కాని ఈ సీరీసు, పల్లాసు వరస కొంచెం భిన్నంగా కనిపించింది. ఉదాహరణకి – గ్రహాలని దుర్భిణిలో చూసినప్పుడు గుండ్రంగా చిన్ని పళ్లెం ఆకారంలో కనిపిస్తాయి (చంద్రుడు మన కంటికి కనిపించినట్టు). కాని ఈ సీరీసు, పల్లాసు మినుకు మినుకు మంటూ నక్షత్రాల వలె చుక్కలుగా కనిపించేయి కాని, గ్రహాల మాదిరి పళ్లేలలా కాదు. పోనీ ఇవి ఎంతో దూరంలో ఉండబట్టిన్నీ, మన దుర్భిణిలు మరీ శక్తిమంతం కానట్టివీను అవటం వల్ల చిన్నగా కనిపిస్తున్నాయనుకోటానికి వీలు లేదు. ఈ రెండూ కూడ భూమికి అతి సమీపంలో, కుజుడికీ, గురుడుకీ మధ్య ఉన్నాయి. అంతే కాదు. ఇంతవరకు మన జాబితాలో ఉన్న గ్రహాల మధ్య దూరాలతో పోల్చి చూస్తే ఈ రెండు దరిదాపు ఒకే కక్ష్యలో ఉన్నంత దగ్గరగా ఉన్నాయి. ఈ

వికారాలన్నిటిని చూసి పెద్దలు ఇవి గ్రహాలు కావు అని తీర్మానించేరు. (అప్పటికే అచ్చయిపోయిన పుస్తకాలు మళ్లా అచ్చు కొట్టవలసి వచ్చిందేమో!) వీటికి ఇంగ్లీషులో ఏస్టరోయిడ్స్ (asteroids) అని పేరు పెట్టి, గ్రహాల జాబితాలోంచి తీసేసేరు. వాటి పేరు మీద ఉన్న రసాయన మూలకాల పేర్లు మాత్రం మారలేదు. బెజవాడ పేరు విజయవాడ అయినా బెజవాడ గోపాలరెడ్డి పేరు మారనట్లుగా అనుకొండి.

ఇక్కడ ఏస్టర్ (aster) అంటే గ్రీకు భాషలో నక్షత్రం, ఓయిడ్ (oid) అంటే "లాంటిది" అని అర్థం. కనుక ఏస్టరోయిడ్ (asteroid) అంటే "నక్షత్రం లాంటిది" అని అర్థం. కాని ఈ రెండూ నక్షత్రాలలాంటివి కానే కావు; రాళ్లలాంటివి అంటే సరిపోయేది. కాని ఏస్టరోయిడ్ అన్న పేరు అతుక్కుపోయింది. కొంతమంది – నాలాంటి చాదస్తులు అప్పుడూ ఉండేవారన్న మాట – వీటికి గ్రహశకలాలు (ప్లేనెటోయిడ్స్, planetoids) అని పేరు పెట్టేరు. నేనంటే ఇష్టం ఉన్న వాళ్లు ఈ కొత్తపేరు పెట్టి పిలుస్తున్నారు; ఇష్టం లేని వాళ్లు తప్పు అయినా పాత పేరు పెట్టే పిలుస్తున్నారు. ఈ భాషాభిమానులూ, వీరాభిమానులూ, పరమ ఛాందసులూ ఉన్నారు, చూశారూ, వాళ్లు మేకపోతు మెడ కింద ఉన్న చన్నులు పట్టుకుని అలా చప్పరిస్తూనే ఉంటారు.

## 3

సా. శ. 1851 నాటికి మహాసాగరంలాంటి ఆకాశపు లోతుల్లోకి దుర్భిణి అనే గేలాన్ని వేసి వెతకగా, వెతకగా దరిదాపు ఇరవై పిల్ల చేపలలాంటి గ్రహశకలాలు, పెద్ద సొర చేపలాంటి మరొక గ్రహం కనబడ్డాయి. ఈ సొర చేప పేరే నెప్ట్యూన్ (Neptune). దుర్భిణి సహాయంతో ఆకాశం గాలిస్తే యూరెనస్ కక్ష్యకి అవతల నెప్ట్యూన్ కనిపించింది. రోమక పురాణాలలో నెప్ట్యూన్ సముద్రాలకి అధిపతి. అందుకని మనవాళ్లు సగరుడు అని పేరు పెట్టేరు. ఈ నెప్ట్యూన్ గౌరవార్థం మరొక రసాయన మూలకానికి నెప్ట్యూనియం (Neptunium) అని పేరు పెట్టేరు. కావలిస్తే ఈ మూలకానికి మనం తెలుగులో "సగరము" (తగరము తో ప్రాస కుదిరింది కదా!) అని పేరు పెట్టుకోవచ్చు!!

హమ్మయ్య. బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని, యూరెనస్, నెప్ట్యూన్ – మొత్తం ఎనిమిది గ్రహాలు అని అంతా ఊపిరి పీల్చుకుని, పిల్లల పాఠ్య పుస్తకాలలో ఈ ఎనిమిది గ్రహాల పేర్లూ వారాల పేర్లతో పాటూ, నెలల పేర్లతో పాటూ అచ్చు కొట్టించి పిల్లలచేత వల్లె వేయించేవారు. ఈ గ్రహాలు ఏ వరుస క్రమంలో ఉన్నాయో పిల్లలు గుర్తు పెట్టుకోవటానికి బాగుంటుందని "మార్తా విజిట్స్ ఎవ్విరి మన్డే అండ్ జస్ట్ స్టేస్ అంటిల్ నూన్" (Martha Visits Every Monday and Just Stays Until Noon) అనే ఇంగ్లీషు వాక్యాన్ని తయారు చేసి, దీనిని స్ఫోరకం (నిమానిక్, mnemonic) గా వాడుకోమన్నారు. అంటే, ఈ వాక్యంలో వచ్చే ప్రతి మాట మొదటి అక్షరం వరుసక్రమంలో ఉన్న గ్రహాల పేర్లకి గుర్తుగా వాడుకోమని అర్థం. ఇలాంటి స్ఫోరక వాక్యం తెలుగులో కూడ ఒకటుంటే బాగుంటుంది కానీ…..

పుస్తకాల విక్రేతల గ్రహచారం బాగానే ఉంది కాని రోజుకో జాబితా బట్టీయం వెయ్యవలసి వచ్చేసరికి పిల్లల జాతకాలు బాగులేవేమో అని అనిపిస్తుంది. పిల్లల గ్రహపాటు ఇలా ఉండగా, ఫిబ్రవరి 18, 1930 నాడు ఆకాశపు లోతుల నుండి మరో గ్రహం ఊడి పిల్లల పుస్తకాల్లో పడింది. (బొమ్మ చూడండి.) గ్రహశకలాలలా కాకుండా ఈ కొత్త గ్రహం నెప్ట్యూన్ కి అవతల, ఇంకా చాలా దూరంలో, మినుకు మినుకు అంటూ దుర్భిణిలో కనబడింది. మిగిలిన ఎనిమిది గ్రహాలు సూర్యుడి చుట్టూ దరిదాపు వృత్తాకార కక్ష్యలో తిరుగుతూ ఉంటే ఈ కొత్త గ్రహం దీర్ఘవృత్తాకారంలో తిరుగుతోందని నిర్ధారణ చేసేరు. పైపెచ్చు ఈ కొత్త గ్రహం పరిభ్రమించే తలం, మిగిలిన గ్రహాలు అన్నీ పరిభ్రమిస్తూన్న తలంలో కాకుండా వాటన్నికి ఏటవాలుగా మరొక తలంలో ఉంది.

"చుక్కలా కనిపిస్తూన్న ఇది గ్రహం కాదు, ఇది కూడా గ్రహశకలమే" అన్నారు, కొందరు. కాని అప్పటికే "గ్రహశకలం" (asteroid) అన్న పేరు కుజ–గురు గ్రహాల మధ్య ఉండేవాటికే కేటాయించటం అయిపోయింది. కనుక దీనికి కొత్త పేరు పెట్టాలి, లేదా గ్రహశకలం అన్న పాత మాట నిర్వచనం మార్చాలి. "అది తోక చుక్కేమో" అన్నారు కొందరు. "తోకచుక్కలో చుక్క

అలుక్కుపోయినట్లు ఉంటుంది. ఈ చుక్క ఖణిగా ఉంది. పైపెచ్చు దీనికి తోక లేదు. కనుక తోక చుక్క అనటానికి వీలు లేదు" అన్నారు మరికొందరు. ఇలా తుని తగవులా ఎటూ తేలకుండా ఉండిపోయింది దీని పరిస్థితి. ఏదో తేలే వరకు, అందాకా, దీనిని గ్రహం అనే నిర్ణయించి, ప్లూటో (Pluto) అని పిలవటం మొదలు పెట్టేరు. దీని గౌరవార్థం ఒక రసాయన మూలకానికి "ప్లూటోనియం" అని పేరు కూడ పెట్టేసేరు. దూరదృష్టికల తెలుగు వాళ్లు దీనికి ఏ పేరూ పెట్టలేదు. సీరీస్ కీ పల్లాస్ కీ పట్టిన గతి దీనికి కూడ పట్టలేదని పిల్లలు సంతోషించేరు. మళ్లా పాత పుస్తకాలు పారేసి కొత్త పుస్తకాలు అచ్చుకొట్టేరు. గ్రహాల పేర్లు జ్ఞాపకం పెట్టుకోటానికి వీలుగా – "మై వెరీ ఎక్సలెంట్ మదర్ జస్ట్ సెర్వెడ్ అజ్ నైన్ పిజ్జాస్" (My Very Excellent Mother Just Served Us Nine Pizzas) – అని కొత్త స్ఫోరక వాక్యం తయారు చేసేరు. కార్టూన్ బొమ్మలలో ఒక కుక్కకి కూడా ప్లూటో అని పేరు పెట్టుకున్నారు.

## 4

ఆధునిక విజ్ఞానశాస్త్రం అంటే — ఒక విధంగా – పేర్లు పెట్టటం; భావాలకి పేర్లు పెట్టటం. ఒకదానిని ఒక పేరు పెట్టి పిలుస్తున్నామంటే ఆ పేరు వెనక ఖచ్చితమైన భావం ఒకటి ఉంటుంది. కనుక మనం "గ్రహం" అన్న పేరు వాడినప్పుడల్లా నాకు, మీకు, ప్రపంచం అంతటికీ ఒకే ఒక భావం స్ఫురించాలి; లేకపోతే నేను అనేది ఒకటి మీకు అర్థం అయేది మరొకటి.

గ్రహం అన్న మాటనే తీసుకుందాం. తెలుగులో "గ్రహం" అనగానే నాకు రెండు అర్థాలు స్ఫురిస్తాయి. ఒకటి, సూర్యుడి చుట్టూ తిరిగే బుధ, శుక్రాదుల వంటి నభోగోళం. రెండవది భూత, ప్రేతాదుల వంటి అదృశ్య శాల్తీ. ఈ రెండవ అర్థం నా చిన్నతనంలో వినబడినంతగా ఈ రోజుల్లో వినబడటం లేదు.

సూర్యుడి చుట్టూ తిరిగేవన్నీ గ్రహాలు కాదు. సీరీస్, పల్లాస్ వంటి గ్రహశకలాలకి గ్రహాల స్థాయి, అంతస్తు ఇవ్వలేము. అవి సూర్యుడి చుట్టూ తిరిగే నభోమూర్తులైనా అవి గ్రహాలు కావని తీర్మానించేరు. "అవి కేవలం పెద్ద రాళ్లు," అన్నారు.

గ్రహం అన్న మాటకి నిర్వచనం చెప్పటానికి బదులు గ్రహాలు ఏమిటో ఒక జాబితా చెప్పవచ్చు. అప్పుడు “బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని, యూరెనస్, నెప్ట్యూన్, ప్లూటో – ఈ తొమ్మిది గ్రహములనబడును” అని వ్యాకరణంలో సూత్రంలా చెప్పెయ్య వచ్చు.

ఈ రకం నిర్వచనాలతో ఒక చిక్కు ఉంది. “అమెరికా, రష్యా, చైనా, బ్రిటన్, ఫ్రాంసు – ఈ అయిదు దేశాలే అణుబాంబులు పేల్చవచ్చు, అణ్వస్త్రాలని తమతమ ఆయుధాగారాలలో నిల్వ చేసుకోవచ్చు” అని తీర్మానించి ఇవే అగ్ర దేశాలు, మిగిలినవి అన్నీ బడుగు దేశాలు అంటే మనం ఊరుకుంటున్నామా? నిర్వచనానికి అర్థం ఉండాలి, దాని వెనక తర్కం ఉండాలి.

ఉదాహరణకి ప్లూటో వంటి నభోమూర్తి మరొకటి ఉంటే దానిని కూడా గ్రహాల జాబితాలో చేర్చుకోమని అడగమా?

ఎక్కడో ఆకాశంలో ఉన్న గ్రహాల వరకు ఎందుకు? “గుట్ట” అని ఎప్పుడనాలి? “కొండ” అని ఎప్పుడనాలి? “పర్వతం” అని ఎప్పుడనాలి? సెలయేరు, ఏరు, నది – వీటి నిర్వచనాలు ఏమిటి? ఆస్ట్రేలియా దేశమా? ఖండమా? ఇవన్నీ నిర్వచనాలు లేకుండా సంప్రదాయానుసారంగా వాడుకునే మాటలే. కాని సంప్రదాయం అని చెప్పి అన్యాయం జరుగుతూ ఉంటే చూస్తూ ఉరుకోలేము కదా. ఉడుకు నెత్తురు ఉన్న తెలుగువాళ్లు అస్సలు ఊరుకోలేరు.

కనుక అందరూ ఏది ఒప్పుకుంటే అదే గ్రహం. కాని అందరూ ఏదీ ఒప్పుకోరు కదా!

## 5

మరో కోణంతో చూద్దాం. గ్రహాలని వదిలేసి నక్షత్రాల సంగతి చూద్దాం. ఒరాయన్ (మృగవ్యాధుడు) రాశిలో ఉన్న ఆర్ద్రా నక్షత్రాన్ని ఇంగ్లీషులో బీటెల్జూస్ అంటారు. అంటే అరబ్బీలో “భారీ వ్యక్తి చంక” అని అర్థం. ఒరాయన్ అంటే వేటగాడు. ఈ నక్షత్రం ఆ వేటగాడి చంక దగ్గర ఉంది. దీనిని “ఎచ్.డి. 39801” (HD39801) అని కూడ పిలుస్తారు. అంటే హెన్రీ డ్రేపర్ (Henry Draper) అనే

ఆసామీ రాసుకున్న జాబితాలో 39801 వ నక్షత్రం. మరొకరి జాబితాలో దీని పేరు 2MASS J05551028+0724255. ఒకే నక్షత్రానికి ఇన్ని పేర్లు ఉన్నప్పుడు నభోమూర్తులని ఎవరికి తోచిన విధంగా వారు వర్గీకరించి, పేర్లు పెట్టి పిలిస్తే వచ్చిన నష్టం ఏమిటి?

వచ్చిన తంటా అంతర్జాతీయ ఖగోళశాస్త్ర సమితి (IAU) వారితో వచ్చింది. "నక్షత్రాల ప్రసక్తి ఇప్పుడు అప్రస్తుతం కాని, ఏ గ్రహానికి ఏ పేరు పెట్టాలో, ఉపగ్రహాల పేర్లు ఎలా ఉండాలో, అసలు ఏవి గ్రహాలో, ఏవి కావో నిర్ణయించే బాధ్యత మాది" అన్నారు వీరు. అనటం అన్నారు కాని వీరికి ఎవ్వరూ పట్టం కట్టి ఆ హక్కు ఇవ్వలేదు; వారంతట వారే నియామకం చేసేసుకున్నారు. నిజానికి ఇప్పుడు వాడుకలో ఉన్న గ్రహాలు వేటికీ వీరు పేరు పెట్టలేదు. కాని పెత్తనం అంకించుకున్నారు కనుక వేటికో కొన్నింటికి పేర్లు పెట్టాలి కదా. అందుకని బుధ గ్రహం మీద ఉన్న గోతులకి కవుల పేర్లు, కళాకారుల పేర్లు మాత్రమే పెట్టాలని వీరు తీర్మానించేరు. రంగారావుకి ఒక గొయ్యి, రామారావుకి ఒక గొయ్యి, సావిత్రికి మరొక గొయ్యి, శ్రీశ్రీకి ఇంకొక గొయ్యి – ఇలా కేటాయిస్తారు మనం దరఖాస్తు పడేసుకుంటే.

ఇంత గురుతర భాద్యత తమ భుజస్కందాల మీద ఉన్నా ఆకాశంలో ఉన్న నభోమూర్తులలో వేటిని గ్రహాలు అనాలి, వేటికి ఆ మర్యాద దక్కకూడదు అన్న విషయాన్ని వీరెవరూ కూలంకషంగా ఆలోచించినట్లు లేదు. ప్లూటో ప్రసక్తి వచ్చే వరకు! అంతవరకు సందిగ్ధానికి అవకాశం రాలేదు.

ప్లూటో ప్రస్తావన వచ్చేసరికి, "ఇది మరీ నాసిగా ఉంది, దీనిని గ్రహం అనటానికి వీల్లేదు" అని కమిటీలో ఒకరు అభ్యంతరం చెబితే, "ఇది మరీ తోకచుక్కల మండలంలో ఉంది, దీనిని పోతరించిన తోకచుక్క అనాలి" అని మరొకరు. మిగిలిన ఎనిమిది గ్రహాలు ఒకే సమతలంలో సూర్యుడి చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటే ఇదొక్కటీ అదే తలంలో ఉండకుండా, ఏకాకిలా, మరొక తలంలో తిరుగుతున్నాది కనుక ఇది సూర్య మండలానికి చెందినది కానే కాదు" అని ఇంకొకరు. ఇలా అభ్యంతరాలు చెప్పటం మొదలు పెట్టేరు. ఈ చిన్న చిన్న విషయాలని విస్మరించి ప్లూటో ని గ్రహం కింద లెక్క వేసుకుందామా

అనుకుంటే "ప్లూటో కంటె వెంట్రుక వాసి చిన్నగా ఉన్న మరి కొన్ని నభోమూర్తులు ఉన్నాయి, వాటి మాటేమిటి?" అన్నారు కొందరు సమతావాదులు.

భద్రతా సంఘంలో ఇండియాకి శాశ్వత సభ్యత్వం కావాలని మనం పోరాడుతూ ఉంటే "మిమ్మల్ని ఒక్కళ్లనీ చేర్చుకుంటే సరిపోతుందా? బ్రెజీలు, జపాను, జెర్మనీ లని చేర్చుకోపోతే ఎలా?" అనటం లేదూ. ఆఫ్రికాలో ఎవ్వరికీ సభ్యత్వం లేకపోతే ఎలా? ఇజ్రయెల్ దగ్గర బాంబు ఉంది కనుక వారిని కూడ చేర్చుకోవాలి కదా. ముస్లిం రాజ్యాలకి సభ్యత్వం లేకపోతే ఎలా? ఇదే విధంగా గ్రహాల జాబితాలో ప్లూటో సభ్యత్వానికి ఎన్నో సవాళ్లు ఎదురయాయి. హోరాహోరీగా ప్రసంగాలు జరిగేయి.

వెధవది, ఎవ్వరికీ కనిపించని, ఒక రాతి గుట్ట గ్రహమా, కాదా అని ఇంతలా కొట్టుకోవటం ఎందుకని ఈ అంతర్జాతీయ సంస్థ 2006లో ఒక రోజు అర్ధరాత్రి "ప్లూటో గ్రహం కాదు, ఈ తీర్మానంతో ఏకీభవించలేని వెర్రివెధవాయిలంతా కట్టకట్టుని గోదావరిలో దూకండి" అని ఒక కాగితం ముక్క మీద ప్రకటన రాసేసి, "మరో పదేళ్లవరకు ఈ కమిటీ కలుసుకోదు" అని చెప్పి చీకట్లోకి చల్లగా జారుకున్నారు.

## 6

రాజకీయాలని పక్కకి పెట్టి ప్లూటో గ్రహమా కాదా అని తేల్చాలంటే ముందస్తుగా గ్రహం అనే మాట అర్థం ఏమిటో మనందరికీ ఒక ఒప్పందం కుదరాలి.

ఎందుకైనా మంచిదని సూర్యరాయాంధ్ర నిఘంటువుని సంప్రదించి చూసేను. అక్కడ ఉన్న అనేకమైన అర్థాలలో ప్రస్తుతానికి పనికొచ్చేవి ఇవి: (1) సూర్యాది; (2) రాహువు; (3) రాహువు సూర్యచంద్రులను పట్టుట. అంటే ఈ నిఘంటువు ప్రకారం సూర్యుడు కూడ ఒక గ్రహం అనేది మొదటి అర్థం. ఇక్కడ మనం అవలంబిస్తూన్న శాస్త్రీయ పద్ధతి ప్రకారం సూర్యుడు గ్రహం కాదు. రెండవ అర్థం ప్రకారం రాహువు ఒక గ్రహం. కాని ఈ రాహువు ఆకాశవీధులలో ఎంత వెతికినా, దుర్భిణి వేసి

వెతికినా, కనబడదు. మూడవ అర్థం ప్రకారం గ్రహం అన్నా గ్రహణం పట్టటం అన్నా ఒకటే! ఆధునిక శాస్త్రం ప్రకారం ఇవేవీ "ప్లేనెట్" అనే భావాన్ని సూచించటమే లేదు కనుక సూర్యరాయాంధ్ర నిఘంటువు ఇప్పుడు, ఇక్కడ మన అవసరాలకి పనికిరాదని తేలిపోయింది.

దాశరథి నిఘంటువు చూసేను. అందులో "గ్రహం" అంటే "ఎ ప్లేనెట్ లైక్ ద సన్, మార్స్, ఎట్సెటరా" (a planet like the sun, mars, etc.) అని ఉంది. సూర్యుడిని "ప్లేనెట్" అంటే నవ్విపోవటమే కాదు నన్ను తన్నినా తంతారు.

బ్రౌన్ నిఘంటువులో గ్రహం అంటే "ప్లేనెట్స్, సన్, అండ్ మూన్" (planets, sun and moon) అని ఉంది. ఈయన గ్రహాలని, ఉపగ్రహాలని, సూర్యుడిని, గుత్త గుచ్చి ఒకే మూసలో పోసేసేడు.

గ్విన్ నిఘంటువులో మాత్రం గ్రహం అంటే "ప్లేనెట్" (planet) అని ఉంది. ఇదొక్కటే నాకు నచ్చిన అర్థం.

ఇదమిత్థమైన

అంటే ఏమిటన్నమాట? పూర్వ కాలం నుండీ తెలుగులో గ్రహం అన్న మాటకి ఇతమిద్ధమైన అర్థం లేదు. సూర్యుడు, చంద్రుడు, రాహువు, బుధ, శుక్ర, కుజ, గురు, శని గ్రహాలు, భూత ప్రేతాదులు, --- ఇవి గ్రహం అన్న మాటకి చలామణీలో ఉన్న అర్థాలు.

ఆధునిక ఖగోళశాస్త్రం దృష్ట్యా ఈ రకం నిర్లక్ష్యం పనికి రాదు; ఈ జాబితాలో ఉన్నవన్నీ గ్రహాలు అంటే శాస్త్రవేత్తలు ఒప్పుకోరు, నేను ఒప్పుకోను, ఎవ్వరూ ఒప్పుకోరు.

మనం వాడే ప్రతి మాటకి ఒక నిర్దిష్టమైన అర్థం ఉండటం అనేది ఆధునిక శాస్త్రం ఆయువుపట్టు. పేర్లు పెట్టటం ఎంత ముఖ్యమో, ఆ పేర్లు సూచించే శాల్తీలని వర్గాలుగా విడగొట్టటం కూడ అంతే ముఖ్యం. ఉదాహరణకి ప్రాణికోటిని జంతు సామ్రాజ్యం, వృక్ష సామ్రాజ్యం అని రెండు వర్గాలుగా విడగొట్టేరు. జంతువులని గాలిలో ఎగిరేవి, నేల మీద నడిచేవి, నీటిలో ఈదేవి, అంటూ విడగొట్టేరు. విడగొట్టినప్పుడల్లా ఆ జాతికి ఒక పేరు పెట్టాలి కదా. అందుకని వాయుచరాలు, భూచరాలు,

జలచరాలు అని పేర్లు పెట్టేరు. ఒక కొత్త జంతువు తారసపడినప్పుడు అది ఏ జాతిలో ఇముడుతుందో చూస్తారు. ఎక్కడా ఇమడకపోతే కొత్తపేరు, కొత్త జాతి. ఉదాహరణకి గాలిలో ఎగిరేదీ, నీటిలో ఈదేదీ అయి, నేలని తాకకుండా ఉండే జంతువు ఉందనుకుందాం. దానికి ఏ పేరు పెట్టాలి? ఉభయచరం అన్న పేరు అప్పుడే మరొక రకం ప్రాణికి వాడుతున్నాం కనుక మరొక కొత్తపేరు పెట్టాలి. కదా?

ఇదే విధంగా సూర్య కుటుంబంలోని శాల్తీలని అధ్యయనం చేసినప్పుడు మొట్టమొదట ఆకాశంలో నగ్న నయనాలకి గురుడు, శని, శుక్రుడు, బుధుడు కనబడ్డారు. వాటిని పాశ్చాత్యులు "ప్లేనెట్" అని పేరు పెట్టి పిలచేరు, మనం గ్రహం అని పేరు పెట్టి పిలచేం. ఇంగ్లీషులో "ప్లేనెట్" అంటే సంచారి అని అర్థం.

సూర్య చంద్రుల ప్రసక్తి వచ్చే సరికి మనవాళ్లు అవి కూడ కూడ గ్రహాలే అన్నారు. వీరిద్దరు ఆకాశంలో సంచరిస్తూ కనపిస్తారు కనుక వీటిని కూడ "ప్లేనెట్" అన్న మాటతో పిలిస్తే తప్పేమిటి?

అలా కాదు. సూర్యుడు గ్రహరాజు. ఈ గ్రహరాజు చుట్టూ తిరిగేవే గ్రహాలు అని అనుకుందాం. ఈ లెక్కన భూమి చుట్టూ తిరిగే చంద్రుడు గ్రహం కాకూడదు.

కనుక ప్లేనెట్ లేదా గ్రహం అన్న మాట సూర్యుడు చుట్టూ తిరిగే నభోమూర్తులకే వాడదాం అని ఒక ఒప్పందానికి వద్దాం. ఇప్పుడు సీరీసు, పల్లాసు అనే నభోమూర్తులు సూర్యుడి చుట్టూ తిరుగుతున్నాయి కనుక వాటిని గ్రహాలు అనొచ్చు.

కాని కేవలం పెద్ద పెద్ద రాళ్ల మాదిరి ఉన్న ఈ శాల్తీలని గ్రహాలు అంటే గురుడు, శని వంటి పెద్ద పెద్ద గ్రహాలని అవమానించినట్లే కదా? అంతే కాదు. ఈ రెండు నభోమూర్తుల కక్ష్యలూ దరిదాపు ఒక్కటే. "ఒకే కక్ష్యలో రెండు గ్రహాలు" అన్న విపరీతం కని, విని ఎరగం. ఇందుమూలంగా సీరీసుని, పల్లాసుని గ్రహాల జాబితాలో వేస్తామంటే నవ్వి పోతారు.

గురుడితో పోల్చి చూస్తే బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు చిన్న గోళీకాయలలా కనిపిస్తారు. అటువంటప్పుడు వీటిని మాత్రం గ్రహాల జాబితాలో ఎందుకు వెయ్యాలి?

ఈ తర్కం ఉపయోగిస్తే గురుడు, శని, యూరెనస్, నెప్ట్యూన్ పోతరించిన భారీ గ్రహాలు. అప్పుడు బుధుడు, శుక్రుడు, భూమి, కుజుడు గిడసబారిన చిన్న గ్రహాలు. "పెద్ద గ్రహాలు" , "చిన్న గ్రహాలు" అని రెండు వర్గాలు ఉన్నప్పుడు ప్లూటోని బుల్లి గ్రహం అనిన్నీ, సీరీస్నీ, పల్లాస్ని చిట్టి గ్రహం అనిన్నీ అనొచ్చు కదా.

ఈ దారిని వెళితే సీరీస్, పల్లాస్ లాంటివి వేల కొలదీ ఉన్నాయి. ఈ రాళ్లని, చిళ్లపెంకులని కూడ గ్రహాలనెస్తే ఎలా?

ప్లూటోని పోలిన మధ్య తరగతి "బంతులు" మరో పాతిక వరకు ఉన్నాయి. వీటన్నిటిని కలుపుకుంటే మన మంత్రివర్గంలా తయారవుతుంది: నలుగురు ముఖ్య మంత్రులు, నలుగురు ఉప ముఖ్య మంత్రులు, ఇరవై ఉపోప ముఖ్య మంత్రులు, మరో రెండు వందల చిళ్లపెంకు ముఖ్య మంత్రులూను!

## 7

ఈ ప్రమాదాన్ని గుర్తించి గ్రహం అనబడటానికి రెండో లక్షణం ఉండాలన్నారు. సూర్యుడి చుట్టూ తిరిగినంత మాత్రాన అది గ్రహం అవదు, అది గుండ్రంగా కూడ ఉండాలన్నారు. ఈ రెండో నిబంధనతో రాళ్లు, రప్పలు, చిల్లపెంకులు ఎన్ని సూర్య ప్రదక్షిణాలు చేసినా గ్రహాలు కాలేవు.

సూర్యుడి చుట్టూ తిరిగే రాళ్లు ఎప్పుడు గుండ్రంగా ఉంటాయి? సీరీసు, పల్లాసు కొండల్లాంటి పెద్ద రాళ్లు. అవి గ్రహాలు కావు. ఇలాంటి కొండలు పదో, వందో కలిసి కొండల గుంపులా ఉందనుకుందాం. అవి గుంపుగా సూర్యుడి చుట్టూ తిరుగుతాయి తప్ప పెద్ద విశేషం ఏమీ ఉండదు. కాని ఈ గుంపులో వేల కొద్దీ కొండలు ఉన్నప్పుడు గురుత్వాకర్షణ శక్తి పనిచెయ్యటం మొదలు పెట్టి ఈ కొండలని గట్టిగా దగ్గరకి లాగుతుంది. గురుత్వాకర్షణ బలానికి అవి చూర్ణం అయిపోయి లడ్డుండలా తయారవుతాయి.

ఇప్పుడు ఆ చుట్టుపట్ల ఉన్న చిన్న చిన్న రాళ్లు ఈ లడ్డుండకి వచ్చి అతుక్కుంటాయి. ఇలా కాలక్రమేణా లడ్డుండ గుండ్రటి ఆకారం పొందినప్పుడు ఆ నభోమూర్తిని గ్రహం అనొచ్చు. అంటే ఏమిటన్నమాట? గుండ్రంగా ఉండటం, భారీగా ఉండటం కవల లక్షణాలు.

"అలా అయితే ప్లూటో గుండ్రంగానే ఉంటుంది. గత డెబ్బై ఏళ్ల బట్టి ఇది గ్రహాల జాబితాలో ఏ ఆక్షేపణా లేకుండా ఉంది. ఇప్పుడు దానిని ఎందుకు గ్రహాల జాబితాలోంచి తీసేయ్యాలి?" అంటూ ప్లూటో తరఫున వకాల్తా పుచ్చుకుని కొందరు వాదించేరు. వచ్చిన గొడవ ఏమిటంటే --- చెబుతాను, చదవండి. ఇటీవలి కాలం వరకు ప్లూటో సూర్య మండలానికి సరిహద్దు అనుకున్నారు. అంటే అటుపైన ఏమీ లేదు – నాలుగున్నర కాంతి సంవత్సరాల దూరం వెళితే అక్కడ మరొక నక్షత్రం తగులుతుంది. కనుక ప్లూటో ప్రవర్తన కొంచెం భిన్నంగా ఉన్నప్పటికీ, "ఏదో, పోనీలే" "కడసారం" అని ఊరుకున్నారు.

ఇటీవల శక్తిమంతమైన దుర్భిణిలు వచ్చిన తరువాత ప్లూటోని పోలిన "గ్రహాలు" ఒకదాని తరువాత మరొకటి చొప్పున కనిపించటం మొదలుపెట్టేయి. వీటిల్లో కొన్ని, ప్లూటొ కంటె రవంత చిన్నవి, కొన్ని రవంత పెద్దవి. ఇంత దూరం నుండి చూసినప్పుడు "రవంత" తేడా ఉన్నప్పుడు ఏది పెద్దదో, ఏది చిన్నదో నిశ్చయించటం కూడ కష్టం. ప్లూటోని పోలిన ఇలాంటి గ్రహాలు పాతిక వరకు కనబడ్డాయి. వీటిని కనుక్కున్న వ్యక్తులకి చీము, నెత్తురు ఉన్నాయి కదా. వాళ్లకి కూడ సన్మానాలు చేయించుకోవటం అంటే ఉబలాటంగానే ఉంటుంది కదా. "శ్రీ శ్రీ శ్రీ ఫలానా ఫలానా వ్యక్తి ఫలానా గ్రహాన్ని కనుక్కున్నాడు. ఆయన్ని కూడ మెచ్చుకుని మేకతోలు కప్పండి" అని అనిపించుకోవాలని ఎవ్వరికి ఉండదు?

ఈ సన్మానాల తొక్కిసలాటలో గ్రహాలు ఏ పాతికో, ముప్ఫయ్యో అయిపోతే – మళ్లా పుస్తకాలు అచ్చు కొట్టాలి, పిల్లల చేత ఆ పేర్లన్నీ కంఠస్థం చేయించాలి. చాల తతంగం ఉంది.

"మొత్తం గ్రహాలు తొమ్మిది ఉంటే బాగుంటుంది. తొమ్మిదుంటే అప్పుడు మనం "నవగ్రహాలు" అన్నమాటని మార్చక్కరలేదు. అల్లుడిని దశమగ్రహం అని ఉన్న చోటల్లా పుస్తకాలని తిరిగి ముద్రించనక్కర లేదు." అంటూ తెలుగువాళ్లు – ఎప్పుడూ లేనిది – ముక్తకంఠంతో విన్నవించుకున్నారని ఒక గాలి వార్త విన్నాను కాని నేను నమ్మను.

అందుకనో, మరెందుకనో గ్రహాలు తలారి రాముడి సంతానంలా పెరిగిపోతే బాగులేదని ఒక లక్ష్మణరేఖ గియ్యాలన్నారు. ఎక్కడ? ప్లూటో తరువాత గీస్తే మిగిలిన పాతిక మంది ఒప్పం కాక ఒప్పం అన్నారు. ప్లూటో ముందు గీస్తే ఏడ్చుకునేది ఒక్కడే – ప్లూటోని కనుక్కున్న వ్యక్తి. వాడెప్పుడో చచ్చిపోయాడు. అందుకని కాబోలు, "ప్లూటో తోకచుక్కల మండలం లోంచి వచ్చింది. అది తోక ఊడిపోయిన, బలిసిపోయిన, గుండ్రంగా ఉన్న తోకచుక్క తల" అంటూ మొండిగా వాదించి, ప్లూటో ముందు లక్ష్మణ రేఖ గీసి, ఇటుపైన ప్లూటో గ్రహం కాదు అని తీర్మానించేరు, సా. శ. 2006 లో, అర్ధరాత్రి వేళ.

ఇప్పటికే పాఠ్య పుస్తకాలలో, విజ్ఞాన సర్వస్వాలలో, పిల్లల పరిహాస చిత్రాలలో, అంతర్జాలంలో, అన్ని చోట్లా ప్లూటో ఒక గ్రహం అనే భావన పాతుకుపోయింది. అర్ధరాత్రి వేళ అంతర్జాతీయ ఖగోళ శాస్త్ర సమితి ఎలా తీర్మానిస్తే నాకేమి? ప్లూటో ప్లూటోనే! "జై ప్లూటో!!"

**కథ వెనుక కథ:**

నవంబరు 2014 ఈమాట అంతర్జాల పత్రికలో ప్రచురితం అయిన తరువాత ప్లూటో అభిమాన సంఘం ప్లూటోని మళ్లా గ్రహాల కోవలో వెయ్యాలని చూస్తున్నారు. అదెంత వరకు వస్తుందో వేచి చూడాలి.